అపరాధ పరిశోధన అనుబంధం—84

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## అదృశ్య నేత్రాలు

రచన: సికిందర్

## ప్రాణానికి ప్రమాదం

రచన: ప్రతాప రవిశంకర్

## చస్తే చావనివ్వను

రచన: వసుంధర

## మృత్యు చక్రాలు

రచన: టెంపోరావ్

పొగమంచు—పన్నెండవ భాగం

**అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 84**
డిశంబర్, 1980
వెల: రు. 4-50
ఏడాది చందా 55 రూపాయలు
జీవిత చందా 325 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
**శ్యామదామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:
**టెంపోరావ్**
**శ్యాంబాబు**
**రమణశ్రీ**
**ఏ. పీ. మోహన్రావ్**
**సుజనశ్రీ**
**వసుంధర**
**విద్వాన్ షీలాదేవి**

కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
**క్రాంతి ప్రెస్,**
2, ఫ్రానిస్స్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# అదృశ్య నేత్రాలు!

సికిందర్

గౌహతి పట్టణం ప్రశాంతంగా వుంది....

జయకర్ మనసు కూడా నిర్మలంగా, నిలకడగా వుంది. మూడు రోజుల అదుపు చేయలేని ఉన్మాద స్థితి నుంచి తీవ్రంగా పోరాడి అతనీ మానసిక స్థితిని సాధించాడు.

అలాంటి మూడు రోజులు అతని అనుభవంలో ఎన్నడూ లేవు! ఇప్పటికైనా ఆ వలయంనుంచి బయటపడినందుకు అభినందించుకుని పని కుపక్రమించాడు....మళ్ళీ ఆ ఊబిలో దిగబడకుండా చూసుకోవాలి!

కాయితం మీద కలం పెట్టినపుడు అతను ఉన్నట్లుండి ఉలికిపడ్డాడు; మూడు రోజులు! గాడ్! ఎంత వృధా! దీనికేమిటీ సంజాయిషీ? ఈ మూడు రోజులూ తనేం చేశాడు? అతని కళ్ళనుందు రావ్ ఉగ్రరూపం మెదలి మళ్ళీ ఉలిక్కిపడ్డాడు.

ఫోన్ మోగింది.

అతను కుదుటపడి రిసీవర్ అందుకున్నాడు.

అవతలి కంఠం అంది, "హలో, జయ్!"

జయకర్ కొయ్యబారిపోయాడు. ఆ కంఠం అతని దేహంలో చలిపుట్టించింది.

"హలో, ఏమిటి అల్కా?" అన్నాడతను అతి కష్టం మీద.

"మీనన్ ఊరికెళ్ళాడు. రేపటిదాకా రాడు!"

జయకర్‌కు ఇంకా ఊపిరి సరిగా అందడంలేదు.

"ఐ—అయితే?"

"అయితే ఏమిటి, డార్లింగ్! వెంటనే నా దగ్గరికొచ్చేయి!"

ఊఁబి! జయకర్ ఉలిక్కిపడ్డాడు. అడుగునుంచి పైకి వూరే నీటి ఊట ఊఁబి! నీ అడుగు జాగ్రత్త! అంతరాత్మ ఘోష విన్నాడు.

"జయ్ మాట్లాడవేం?"

జయకర్ తేరుకొని తడబడ్డాడు. ఏం చెప్పాలో తట్టలేదు. ఆమె దగ్గరికి వెంటనే వచ్చేస్తానని చెప్పేయాలనుకున్నాడు—కానీ—మళ్ళీ రావ్ ఉగ్రరూపం కళ్ళ ముందు నిలిచింది. బాస్టర్డ్! ఎందుకీ ఆలస్యం? ఏం చేస్తున్నావ్? అతనిలాగే తిట్టాడు.

"వీలవదు, అల్కా! ఈ పూట పని వుంది!" అన్నాడతను గట్టిగా.

"ఓహ్ డామిట్! నువ్వెప్పుడూ ఇంతే!"

"నే నెప్పుడు కాదన్నాను? నీ కారణంగా ఈ మూడు రోజులు ఏమీ చేయలేకపోయాను. నా మనసు స్వాధీనంలో లేదు! ఆలోచనలన్నీ నీ చుట్టే! ఈ పూట క్షమించు. అవతల బాస్‌ని తృప్తిపర్చాలి.... తాత్కా

లికంగా ఇంత మేత పడేస్తాను. అప్పుడు నీతోనే వుంటాను. నువ్వెక్కడికి రమ్మన్నా—"

జయకర్ మనసు మళ్ళీ కల్లోలం తొలగించుకుంది.

"అవన్నీ చెప్పకు! నువ్వు గంటలోపల రావాలి! నీతో చాలా ముఖ్యమైన విషయం మాట్లాడాలి. రాక పోతే నేనంటే నీ కాసక్తి పోయిందని అనుకొంటాను—"

జయకర్ వెంటనే ఏదో అనబోయాడు. ఆలస్యమైంది. అప్పటికే లైను కట్ అయింది.

"హలో, హలో, అల్కా....?"

లాభం లేదనుకొని ఫోన్ పెట్టేసి నిట్టూర్చాడు. తల బరువెక్కి హఠాత్తుగా నీరసం కమ్మింది. అతను బెడ్ మీద కూలబడి కళ్ళు గట్టిగా మూసుకున్నాడు.

అల్కా!

ఎవరీమె? ఆమె తన నెలా వశంచేసుకుంది? తానామె దాసుడెలా అయ్యాడు? ఇన్నేళ్ల బ్రహ్మచారి సర్వీసులో ఎవరికీ ఇలా లొంగలేదు! నిగ్రహం తప్పలేదు! ఎవరినీ ప్రేమించిన పాపాన పోలేదు!

మరి, ఈమె ఏ సమ్మోహనాస్త్రంతో తన్ని లొంగ దీసుకుని ఈ ప్రేమ మైకంలో దింపింది? ఆమెలో వున్న ఆకర్షణ ఏమిటి? ప్రత్యేకత ఏమిటి?

నిజానికి తానామె ఆకర్షణలో పడ్డానికి ఆమె బాధ్యత ఏమీ లేదు. అది పూర్తిగా తన బలహీనత! ఆ రోజు-సరిగ్గా మూడు రోజుల క్రితం—ఇదే హోటల్ ప్రాంగణంలో పరిచయమైనప్పుడు తన నిగ్రహమంతా ఉన్నపళంగా కుప్ప కూలిపోలేదూ? ఆమె తేనె రంగు కళ్ళలో కవ్వింపు చూసి గుండెలో గుర్రపు డెక్కల చప్పుడు విన్పించలేదూ? ఆమె గులాబీ రేకు పెదవుల

మీద పిచ్చెక్కించే నవ్వు చూసి నరాలు జివ్వుమన లేదూ? నారింజ రంగు సిల్క్ కమీజ్, అదే రంగు షల్వార్; పొడవాటి జడతో, కాళ్ళకి మామూలు ఆకు చెప్పులతో నిరాడంబరంగా, చూపులకి గాలం వేసి లాక్కెళ్లేలా సృష్టి జరిగిన అంగసౌష్టవాలతో ఆమె నిలు వెత్తు విగ్రహం చూశాక, వొంట్లో వేడి అమాంతంగా రెట్టింపు కాలేదూ?

అల్లా—అల్లా—అల్లా!

ముఫైఅయిదేళ్ళ తన జీవత కాలంలో ఎన్నడూ స్త్రీ గురించి ఆలోచించి ఎరుగని తను, ఇలా ఆమె వ్యామో హంలో పడ్డం చాలా ఆశ్చర్యంగా వుంది. ఇలా ఎందుకు జరిగిందో తెలియడంలేదు. కానీ ఇదేమీ అసహజం కాదని తెలుసు. అయితే ఎందుకో పొరపాటు చేస్తున్నాడన్పి స్తోంది....

ఆమె వివాహిత! అయినా అదేమీ పట్టించుకోనట్లు, ఏ భయమూ లేనట్లూ ఆమె ప్రవర్తించే తీరు చూస్తే మళ్ళీ ధైర్యం మొలకెత్తుతోంది.... ఈ మూడురోజుల పరిచయంలో ఎంత తొందరగా—ఎంత దూరంగా— ఎన్నిసార్లు క్షణికావేశపు పాశం ఇద్దరిమధ్య చిచ్చు రగిల్చి చల్లార్చింది.

జయకర్ గుండె వేగంగా కొట్టుకుంది. ఆ మూడు రోజులూ అతన్ని పట్టి పీడించిన ఆమె అనుభవాల స్మృతులు మళ్ళీ ముసురుకోవడం ప్రారంభించాయి....

ఇదే. ఈ ప్రపంచంలో మునిగి తేలుతూ నేను బాధ్యతల్ని విస్మరించాను. ఈ మత్తునుంచి బయటపడక పోతే నా భవిష్యత్తు ముక్కలవుతుంది. ఓ ఆడదాని కారణంగా నా భవిష్యత్తు బ్రద్దలుకావడం జరక్కూ

డదు. ఏ స్త్రీకీ నేనూహించుకొంటున్న భవిష్యత్తుతో పొసగదు. స్త్రీకి నా లైఫ్‌లో స్థానంలేదు.

ఈ నిశ్చయానికి వచ్చి జయకర్ తిరిగి టేబిల్ దగ్గర కూర్చొని వ్రాయడం ప్రారంభించాడు.

గౌహతిలో ప్రస్తుతం పరిస్థితి ప్రశాంతంగా వుంది. మూడురోజుల క్రితం కొన్ని చెదురుమదురు సంఘటనలు తప్పితే....

హైద్రాబాద్ పత్రిక 'సైఫ్' రిపోర్టర్‌గా జయకర్ అయిదేళ్ళుగా పనిచేస్తున్నాడు. అతను చాలా చిన్న వయసులోనే కలం చేతబట్టి పిచ్చి గీతలు గీశాడు. కాలగమనంలో ఆ గీతల్ని శాస్త్ర కళాత్మకంగా గీయడం నేర్చుకుని ఇప్పుడు రాటుదేలిన జర్నలిస్టు అయ్యాడు—

పత్రిక యజమానికీ, సంపాదకుడికీ అతనంటే మంచి అభిమానం వుంది కానీ—అనవసర సాహసాలకి పూనుకొని పత్రికను ఇరకాటంలో పెట్టే అతని నిర్లక్ష్య స్వభావం న్యూసెన్స్‌గా పరిణమించి ఎంత కోపావేశాల్ని కల్గించినా; ఒక్కోసారి అదే దుడుకుతనంవల్ల బయటపడే గొప్పవాళ్ళ బండారాలు, సంస్థల కుంభకోణాలూ పత్రిక ఖ్యాతిని విస్తరింప జేస్తుండడంవల్ల, అతనిమీద ఇదమిద్ధంగా ఏ చర్యకూ పూనుకోలేని సందిగ్ధ పరిస్థితి ఏర్పడుతోంది.

వారంక్రితం అస్సాం పర్యటనకి అతన్ని పంపాలని నిశ్చయించినవుడు ఎడిటర్ రావ్ యజమానితో తీవ్రంగా వ్యతిరేకించాడు - అక్కడి సంఘటనల్లో అతని ప్రవేశం కష్టాల్ని తెస్తుందని. కానీ ప్రస్తుత పరిస్థితిలో అక్కడ అడుగుపెట్టే గట్స్ పత్రిక స్టాఫ్‌లో ఎవరికున్నాయని యజమాని అరిచాడు. చివరికి జయకర్ ప్రయాణమై

గౌహతి చేరుకున్నాడు.

ఈ వారంలో మొదటి మూడు రోజులు రాష్ట్ర మంతటా పర్యటించి అక్కడ సాగుతోన్న 'విజాతీయుల్ని తన్ని తరిమేసి—స్వతంత్ర రాష్ట్రం ఏర్పరచుకొనే ఉద్యమం'లో జరిగిన అల్లర్లు, కొట్లాటలు, కూల్చివేతలు, కాల్చివేతలు, పేల్చివేతలూ, దోపిడీలు, చంపడాలు, ముకుమ్మడి మారణ హోమాలు, దౌర్జన్యాలూ, వీటన్నిటినీ విజయవంతంగా తెర వెనుక వుండి నిర్వహిస్తోన్న విద్రోహక శక్తులు, వీటిలో విచ్చలవిడిగా ప్రవహిస్తోన్న పొరుగు రాజ్యాల ఆయుధాలు, వీటిని అణచడానికి పోలీసు కాల్పులు, మిలటరీ చర్యలూ, పర్యవసానంగా నిషేధాలూ, కర్ఫ్యూలూ, ఫలితంగా స్తంభించిన ప్రజాజీవనం, ఆహుతులైన అనేకమంది అమాయక జనం, నిరాశ్రయులైన వేలాదిమంది దీన జనం, ఎటుచూసినా మృత్యుకళ తాండవించే నగర వీధులూ.... వీటన్నిటినీ కళ్ళారా చూశాడు జయకర్.

చూసింది వ్రాశాడు. వ్రాసింది పంపాడు. అది గొప్ప కాదు. ఈ ఉద్యమంలో సరఫరా అవుతోన్న చైనా ఆయుధాలు ఎక్కడనుంచి వస్తున్నాయన్నది కనిపెట్టడం అతను చేయబూనిన కార్యాల్లో ముఖ్యమైనది. కానీ దాని గురించి ఇంకా లోతుగా ఆలోచించే లోపునే అల్కా ప్రవేశించి అతని మనసులో తిష్ట వేసింది. దానికి అధిపతియై పాలిస్తోంది. అంతా బెడిసికొట్టింది.

ఆమె కారణంగా ఈ మూడు రోజులూ ఏమీ పంపలేదు. అక్కడ రావ్ వెయ్యి కళ్ళతో ఎదురు చూస్తుంటాడు. వారం రోజుల్లో పూర్తి కావల్సిన అస్సాం పర్యటన కాలేదు. రేపు మణిపూర్ వెళ్ళవల్సి వుంది. ఈ

పరిస్థితుల్లో అది సాధ్యమవుతుందా?

రెండు గంటల్లో వ్రాయడం పూర్తి చేసి అతను చదువుకున్నాడు. చదువుతోంటే గుండె అదరసాగింది.... ఇంత గజిబిజిగా, పేలవంగా ఎప్పుడూ వ్రాయలేదు! ఇక అందులో విషయాలు ఎంతవరకు వాస్తవమో తనకే తెలియదు. ఆలోచించకుండా అరగంటలో డిస్పాచ్ చేసి తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు.

అప్పుడు జ్ఞాపకం వచ్చింది—అల్కా.

ఆమె ఫోన్ చేసి మూడుగంటలవుతోంది. ఇప్పుడు పన్నెండవుతోంది. ఆమె వెంటనే రమ్మనలేదూ?.... నా కోసం ఎదురు చూస్తుంటుంది. ఆమె హెచ్చరిక జ్ఞాపకంవచ్చి తటాలున టాక్సీ ఎక్కి బయలుదేరాడు.

## 2

జయకర్ అలా వెళ్ళకుండా వుంటే బాగుండేది.... అల్కా విషయంలో అతను తీసుకొన్న నిర్ణయంవల్ల ఎంతో మేలు జరిగి వుండేది. కానీ అతనిప్పుడు ఇదివరకటి జయకర్ కాదు. అతిడి మనసు కళ్ళెం తొలగించుకొని మళ్ళీ దౌడు తీసింది! ఇక దాన్నెవరూ ఆపలేరు. అదుపు చేయలేరు.

బెల్ పుష్ నొక్కిన కొన్ని క్షణాలకి అల్కా ద్వారములో ప్రత్యక్షమైంది.

జయకర్ నవ్వాడు.

ప్రతిగా ఆమె నవ్వలేదు; ముఖం ప్రసన్నమూ కాలేదు.

జయకర్ తటపటాయిస్తూ చూశాడు.

"అల్కా, అయాం సారీ.... కానీ నే నేం చెయ్యను?"

"లోనికిరా!" అందామె సున్నకంఠంతో, వెనుదిరిగి నడుస్తూ.

జయకర్ లోనికెళ్ళి తలుపు మూశాడు. ఆమె బెడ్

రూంలోకి దారితీస్తోంది. అతను అనుసరించాడు—కసాయి వాడి వెంట మేకపోతులా.

ఆమె బెడ్ మీద కూలబడి వాలు కుర్చీ చూపించింది. "కూర్చో!"

"అయాం సారీ, అల్కా నిన్ను బాధపెట్టాలని కాదు గానీ...."

"చూడు! ఇలా క్షమాపణ చెప్పుకొని దీనంగా మొఖం పెట్టేవాళ్ళంటే నాకు చికాకు. కూర్చో. నీ పరిస్థితి నాకూ తెలుసు."

జయకర్ స్థిమితపడుతూ కూర్చుని అన్నాడు: "టైముకి రిపోర్ట్సు అందకపోతే ఎడిటర్ తిడ్తాడు. ఈ మూడు రోజులు ఆకలితో మాడ్చివుంటాను. ఏదో గీసి పంపాను. అందుకే ఇంతాలస్యం...."

"నువ్వు మణిపూర్ ఎప్పుడెళ్తున్నావ్?" అడిగిందామె అతని మాటలు పట్టించుకోకుండా.

"అసలు రేపు వెళ్ళవల్సింది....కానీ ఇక్కడ....నీతో కాలక్షేపం చేస్తూ బాధ్యతలు విస్మరించాను. ఇక్కడ ఇంకా పని పూర్తికాలేదు."

అల్కా అతన్ని ఓరగా చూసింది.

"నీకు బాధ్యతలు ముఖ్యమా? నేను ముఖ్యమా?"

అతను ఆశ్చర్యపడ్డాడు. "ఎందుకలా అడిగావు?"

"ముందు చెప్పు!"

జయకర్ పెదవులు చప్పరించి అంతలోనే నవ్వాడు.

"ఫో, అల్కా! ఎందుకలా అనుమానాలు పెట్టుకుంటావు? నువ్వంటే నా కిష్టంలేదని యెవరన్నారు? నాకు నువ్వెంతో బాధ్యతలూ అంతే."

"ఈ ఉద్యోగంలో తృప్తి వుందా నీకు?"

"ఉంది, చాలా వుంది."

"ఆరికంగా?"

"ఆర్థికంగా నాకే ఆశలూ లేవు. ఖర్చు పెట్టడానికి నా కెవరూ లేరు. డబ్బుగురించి నే నెప్పుడూ ఆలోచించలేదు. కానీ ఇప్పుడు నాకు నువ్వున్నావు. నీకోసం ఏది కావాలన్నా తెచ్చివ్వగలను....ఏదీ చెయ్యడానికి వెనుకాడను."

అల్కా లేచి వెళ్ళి ఫ్రిజ్‌లో జిన్ తీసి గ్లాసుల్లోపోసి తెచ్చింది.

"నేనూ అదే వూహించాను" అందామె.

జయకర్ నవ్వాడు గ్లాసందుకొని. "చెప్పు, నీకేం కావాలి? నీకోసం ఏం చెయ్యమంటావు?"

"నాకోసం కాదు జయ్, మనకోసం!"

"ఓహ్, అందులో నావాటా కూడానా? చెప్పు, ఏం చెయ్యాలి?"

అల్కా గ్లాసు ఖాళీచేసి పెట్టింది. అతన్నిచూసి అదోలా నవ్వింది.

"స్వీట్ డార్లింగ్! నాకు తెలుసు....నువ్వే చెయ్యగలవు."

జయకర్ ఆమె భుజాలుపట్టి దగ్గరికి లాగాడు.

"ఏమిటి సంగతి? అంతలా వూరించకు."

ఆమె హఠాత్తుగా నవ్వి పెదవులందించింది. వెంటనే చటుక్కున విడిపించుకొని కిటికీ దగ్గరికెళ్ళి బయటికి చూసింది.

ఎండ తీవ్రంగా వుంది.

జయకర్ కాచుకున్నాడు.

"మొన్న కన్వార్ దగ్గర రైలు పడగొట్టిన ఉగ్రవాదుల ముఠా పట్టుబడిందా, జయ్?"

జయకర్ ఉలిక్కిపడ్డాడు. అయోమయంగా చూశాడు.

"అది నీకెందుకు. అల్కా?"

ఆమె ఇటు తిరిగి చూసింది. ఆమె కళ్ళలో ఇదివరకు ఎప్పుడూ చూడని మెరుపు చూసి బెదిరాడతను.

"మన భవిష్యత్తు వాళ్ళమీద ఆధారపడి వుంది జయ్."

"ఏమిటి నువ్వనేది? స్వప్నాలో వున్నావా నువ్వు?" అరిచాడతను.

"ఓహ్-హో! నన్ను మతిచెడినదానిలా ఎందుకు ట్రీట్ చేస్తావ్!"

"వాళ్ళతో నీకేమిటి అవసరం?"

"మన భవిష్యత్తు వాళ్ళవల్ల పండుతుంది. వాళ్ళ సహాయం మన కవసరం. వాళ్ళతో నా ఆలోచన ఫలిస్తే స్వతంత్రులమవుతాం! ఐశ్వర్యంలో మునిగి తేలుతాం!"

"నిజంగా నీకు పిచ్చెక్కింది, షటప్!"

ఆమె ఫక్కున నవ్వింది: "ఇలాంటి బరువైన మాటలు ఎన్నడూ వినివుండవు. బ్రహ్మచారివికదూ? బాధ్యతలు తెలియని వాడివి. జయ్, నాలో ఏం లోపం వుందని బొంబాయిలో బంగారంలాంటి మోడల్ జీవితం వదులుకొని ఈ ముసలాడివెంట వచ్చాననుకున్నావు? ఈ రెండేళ్ళుగా ఈ దరిద్రపు బ్రతుకు నెందుకు భరిస్తున్నాననుకున్నావు? అతని సోకాల్డ్ మగసిరీ రసికత చూసికాదు. అతని వాదెకరాల టీతోట చూసి; కేరళ బీచిలో త్రీస్టార్ హోటలు చూసి; డిస్సూవర్ షెల్ఫుడ్ ఫ్యాక్టరీలో మేజర్ షేరు చూసి—ఇవన్నీ చూసి—అతని డబ్బు చూసి—ఈ జీవితానికి సిద్ధపడ్డాను."

"మరిప్పుడెందుకు బాధపడుతున్నావు? నువ్వతని భార్యవి. అవన్నీ నీకే చెందుతాయి."

"అవును. నాకే చెందుతాయి. కానీ ఎప్పుడు? అతను చచ్చినప్పుడు. ఎప్పుడు ఛస్తాడు? కనీసం పరో ఇరవై ఏళ్ళదాకా ఆ ఆశలేదు. ఇంత డబ్బు గడించినా ముసలి వాడికి ఏ దురలవాటూ లేదు. పైగా యోగాసనాలు వేస్తాడు. అతని చావుమీద నాకు నమ్మకం లేదు. అప్పటి వరకు నేనిక్కడ బానిసలా పడివుండి జీవితం వృధా చేయ లేను. ఎప్పుడో అతను చచ్చాక వచ్చే ఐశ్వర్యంతో ముసలి దాన్నయ్యాక నన్నేం చెయ్యమంటావు?"

"అందు కిప్పుడేం చేస్తావు?"

"జీవితాన్ని ఈ వయసులోనే అనుభవించాలి. మిానన్‌ని చూసి నేను చాలా మోసపోయాను. నా అంచనా తారుమారైంది. కోరుకున్న సౌఖ్యాలు లభించ లేదు. ఆర్థిక స్వాతంత్ర్యం లేదు. కోటీశ్వరుడి భార్యగా గుర్తింపులేదు. ఒక్కసారి నన్ను చూస్తే మిానన్ పిసినారి తనం కన్పిస్తుంది. నా వేషం చూడు. ఇంతకంటే ఆడంబ రంగా వుండలేను. ఖరీదైన దుస్తులు కట్టుకోలేను. నగలు పెట్టుకోలేను. హై సొసైటీలో తిరగాలంటే చెప్పరాని సిగ్గు వేస్తుంది.ఇంటికెవర్ని ఆహ్వానించాలన్నా చిన్నతనంగా వుంటోంది.

"లేదు, జయ్! నేను చాలా విసిగిపోయాను. ఇహ ఈ బ్రతుకు చాలు. ఇంకా భరించలేను. నాకు విముక్తి కావాలి. నేను కన్న కలలు నిజం చేసుకోవాలి. ప్రపంచం లోని డబ్బంతా అనుభవించాలి. జీవితంలోని తియ్యదనం చవిచూడాలి. ఇంకెప్పుడో కాదు. ఇప్పుడే—ఈ వయసు లోనే."

"అసలు విషయానికి రా, అల్కా. ఏమిటి నీ ఆలోచన?"

# 14

"నిన్ను చూసినప్పుడే నాకీ ఆలోచన వచ్చింది. ఇది నీవల్లనే అవుతుంది: నువ్వు ప్రెస్ రిపోర్టర్‌వి. ఆ తీవ్రవాదుల్ని గాలించి పట్టుకోవడం నీకు కష్టంకాదు. వాళ్ళ వల్ల ఈ బ్రతుక్కి విముక్తి లభిస్తుంది. ఈ సంపదంతా మనిద్దరిదవుతుంది....అతనికి వారసులు లేరు. విల్లు ఇంకా వ్రాయలేదు. ఈ ఆస్తులన్నీ అమ్మేసి మన ఇష్టమైన చోటుకి—"

జయకర్ అడ్డంగా తలూపాడు.

"అయాం సారీ, అల్కా. మనిద్దరి లక్ష్యాలు ఒకటి కావు. నీకు ఐశ్వర్యం కావాలి. నాకు దానిమీద మోజు లేదు. నేను కలలుగనే భవిష్యత్తు వేరు. నాకొక్కటే లక్ష్యం వుంది. అది డబ్బుతో నెరవేరదు. సామర్ధ్యం కావాలి. సామర్ధ్యం నాకుంది, కానీ సమయంలేదు. ఇంత వరకూ నేను రిపోర్టర్‌గానే కొనసాగుతూ వచ్చాను. ఇప్పుడు మరో మెట్టు ఎక్కాలనుకుంటున్నాను....ఈ వృత్తిలో కొంత తీరుబాటు చేసుకొని గ్రంధ రచనకు పూనుకుంటాను. దేశవ్యాప్తంగా పర్యటిస్తూ విరివిగా అనేక విషయాలమీద గ్రంధాలు వ్రాస్తాను. ఇంకా పేరు తెచ్చుకుంటాను. జర్నలిస్టు అనే ప్రతివాడూ ఏదో ఒక గ్రంథం వ్రాసితీరాలి! అప్పుడే నమ్ముకున్న వృత్తికి పరిపూర్ణత ఏర్పడుతుంది. నీ కర్థమవుతోందనుకుంటాను."

"అర్థమైంది. కానీ డబ్బు జీవితంలో ఒక భాగం. అదంటే ఎలర్జీ ఎవరికీ లేదు. అది లేనిది నువ్వేమీ చేయలేవు, ఎక్కడా తిరగలేవు. నీకున్న ఆర్థిక పరిధి మేరకు దేశవ్యాప్తంగానే పర్యటించాలనుకుంటున్నావు. కానీ నేను ప్రపంచం చుట్టి రావాలనుకుంటున్నాను.

నీ లక్ష్యాన్ని నేను నిరసించడం లేదు. నువ్వు గొప్ప

జర్నలిస్టువై దేశవ్యాప్తంగానే గాక అంతర్జాతీయంగా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకొంటూంటే—నీ ప్రక్కన నేను ఫలానా వాడి భార్యగా గుర్తింపూ, ఆదరణా పొందుతూంటే—ఎంత గర్వంగా వుంటుంది. నాక్కావల్సింది గుర్తింపు, జయ్. నువ్వు పొందేతృప్తీ సంతోషమూ ఒక్కడివే అనుభవించలేవు. భాగస్వామి వుండాలన్పిస్తుంది....ఆ భాగ్యం నాకివ్వు. నేను పంచుకుంటాను."

ఈ మాటలు జయకర్‌కి సరిగ్గా ఎక్కడ తగలాలో అక్కడే తగిలి, కలుగవల్సిన ప్రభావం కల్గించాయి. గాడ్, ఈ ఆడవాళ్ళు వీక్ పాయింట్స్‌ని గురిచూసి కొట్టగల నేర్పుగలవాళ్ళు.

అతను తేరుకొని అయోమయంగా చూశాడు. అల్కా నవ్వింది.

"నాకు తెలుసు, నిన్ను ఒప్పించటం కష్టం కాదని. బ్రహ్మచారులు దృఢమనస్కులంటే నమ్మలేను. పైగా నువ్వు ధీరుడివి. భయపడవు—పిరికివాడివి కాదు. నాతో చెయ్యికలిపి ఈ పని చెయ్యడానికి వెనుకాడవు."

"ఏమిటి నువ్వు చెయ్యదల్చుకుంది?"

"నీకు తెలుసు, మీనన్ చచ్చిపోవాలి!"

"తెలుసు, కానీ ఎలా చేస్తావు?"

"రాత్రి బాగా ఆలోచించాను, జయ్. మంచి అయిడియా వచ్చింది."

"అయిడియాలు రావటం ఎప్పటినించీ!"

"నిన్ను చూసినప్పట్నుంచీ!" చమత్కరించిందిఅల్కా.

## 3

కనార్ గ్రామమంతటా B. S. F గస్తీ దళాలు అప్రమత్తతో ఉన్నాయి. వారం రోజుల క్రితం కల

కత్తాకు ప్లైవుడ్ లోడ్ తీసుకువెళుతున్న రైలును ఇక్కడే పడగొట్టారు విద్రోహులు. ఆ తర్వాత విజాతీయులన్న ఉక్రోషంతో వందపూరిగుడిసెలు తగులబెట్టి, జనంమీద బాంబులు విసిరారు....

కన్హార్‌కు తూర్పున ఏడు కి.మీ.ల దూరంలో దట్టమైన పెద్ద అడవి వుంది. అందులో లోయలు, గుట్టలు, చెరువులూ కోకొల్లలు. అన్ని జాతుల క్రూరమృగాలు లేకున్నా ఉన్నంతవరకు తలచుకొంటే అడవిలో అడుగు పెట్టే ధైర్యం చలదు ఎవరికీ.

కన్హార్ చుట్టుపట్ల సాగిన రెండు విద్రోహక చర్యలు మూలంగా తీవ్రవాదుల నెలవు అడవిలోనే ఎక్కడో ఉందన్న అనుమానాలున్నాయి అధికారులకి. లైను బాగు చేశాక మళ్ళీ రైళ్ళ రాకపోకలు ప్రారంభమయ్యాయి. ఆ స్టేషన్‌లో దిగేవాళ్ళు చాలా తక్కువ.... దిగిన ప్రతివారూ పోలీసు ఇంటరాగేషన్‌ను ఎదుర్కోవలసిందే.

అందువల్ల జయకర్ రెండు స్టేషన్లు ఇవతల దిగిపోయి ఆల్కా ఇచ్చిన మ్యాపు ప్రకారం పదిహేను మైళ్ళ ప్రయాణం కాలినడకన కట్టాడు.

ఈ అడ్డమార్గాన దూరం అదనంగా ఏడు కిలోమీటర్లు పెరుగుతుంది. కన్హార్‌లో దిగినా అక్కడి నుంచి అడవికి అంతే దూరాం నడవాలి.

జయకర్‌కు నమ్మకం లేదు—పోలీసులకే చిక్కని తీవ్రవాదులు తనకెలా దొరుకుతారు. వాళ్ళసలు అడవిలోనే వున్నారా? లేక తను గుడ్డిగా వెళుతున్నాడా? అలా గుడ్డిగా వెళ్ళడం కూడా ప్రమాదకరమే. అడవి ప్రాంతాలా, అడవిలోనూ పోలీసులు తిరుగుతుండవచ్చు

గాలిస్తూ. తను వాళ్ళకి చిక్కితే....?

అతనికంతా గందరగోళంగా వుంది వ్యవహారం. త్వర పడి ఈ పనికి పూనుకొన్నాడేమో నన్పిస్తోంది....అల్కా మాటలు మందులా పనిచేస్తున్నాయి. ఆ వేలాటి దుష్పరిణామాలకి దారి చూపిస్తాయో తెలసినా, దానికి విరుగుడు అతనిదగ్గర లేదు.

ఆమె మత్తులోంచి అతను బయటపడలేడు.

అతని జ్ఞానేంద్రియాలన్నీ ఆమెగుప్పెట్లో వున్నాయి.

నడకవేగం పెంచి చెట్ల నీడలో నడుస్తూ, అంచెలంచలుగా సాగే అల్కా పథకం గురించి ఆలోచించాడు. ఆమె ధైర్యం కలది. ఈ ఐశ్వర్యమంతా ఎప్పటికైనా నిస్సందేహంగా ఆమె హక్కులోకే వస్తుంది.

మీనన్ పిసినారితనం తెలుస్తోనే వుంది. అతన్ని చూస్తే విల్లులో భార్యకి తృప్తి కల్గించే భాగం కల్పిస్తాడన్న నమ్మకం లేదు. అల్కా ఈ విషయం గ్రహించినట్లు లేదు. ఆమె విల్లువరకూ ఆలోచించలేదు. ఆమెకు ఉధృతమైన కోర్కెలున్నాయి: వాటినిప్పుడే తీర్చుకోవాలి. ఒక్కోసారి కోర్కెల పడగ నీడలో వుండటం యెంత ప్రమాదకరం. అవెప్పుడు కాటేస్తాయో తెలియదు.

ఇప్పుడు తననీ ఆ నీడలోకి లాగింది అల్కా. ఇప్పుడన్నీ భయాలే. కానీ ఇన్నేళ్ళ తన జీవితంలో సాధించిందేమిటని ఆలోచిస్తే, ఆ భయాలన్నీ పిరికితనపు చిహ్నాలుగా మాత్రమే కన్పిస్తున్నాయి. తను పిరికివాడు కాదు. తన నిర్లక్ష్యం, ఉదాసీనత జీవితంలో అతి ముఖ్యమైన ఘట్టాల్ని అనుభవించకుండా చేశాయి. ఇప్పుడు కనువిప్పు కల్గుతోంది—డబ్బులేని జీవితం ఎంత చప్పగా వుంటుంది,

అందమైన అతివ—అంతులేని ఐశ్వర్యం జీవితానికెంత వన్నె చేకూరుస్తాయి.

ఉత్సాహంగా నడుస్తున్నవాడల్లా ఉలిక్కిపడ్డాడు. జోసఫ్ జ్ఞాపకమొచ్చినప్పుడల్లా ఈ ఉలికిపాటు తప్పటం లేదు. శనిగాడు. వీడు పెద్ద అడ్డంకి. మీనన్‌తో పాటు వీడుకూడా పోవాలి. లేదా వీడినుంచి అన్నివేపులా ప్రమాదాలే.

మీనన్ ఈ బాడీగార్డుని యెక్కడ పట్టాడో గానీ, చిరుతపులికంటే ప్రమాదకరమైనవాడు దొరికాడు. వాడి రేడియం గోళాల్లా మెరిసే పచ్చటి కళ్ళల్లోకి చూస్తే చలి పుట్టుకొస్తుంది. మెరుపుకంటే వేగమైన వాడి కదలిక చూస్తే జడత్వం ఆవహించుకుంటుంది.

ఈ భూమ్మీద వీడి ఉనికి క్షణంకూడా సుఖం ఇవ్వదు. మీనన్‌తో పాటు వీడుకూడా పోవాలి—చావు తప్పి బయట పడకూడదు దెబ్బతిన్న పులిలా!

మరోగంట నడిచాక వెనుక ట్రాక్టర్ శబ్దమైంది.

ఇంకో గంట తర్వాత దానిమీద అడవి ప్రాంతాల చేరుకున్నాడు జయకర్—ట్రాక్టర్ వాలాని మాటల్లో పెట్టి తనమీద ఆసక్తి కలిగే అవకాశం ఇవ్వకుండా చూస్తూ.

అప్పుడతను ఎంతో జాగ్రత్తగా చురుగ్గా పరిసరాల్ని కనిపెడ్తూ వేగంగా కనుమరుగైయాడు అడవిలోకి.

## 4

జయకర్ దూరంగా అస్పష్టంగా ఏదో శబ్దం విన్నాడు. అతని వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి.

ఏమిటా శబ్దం? గాభరాగా చుట్టూ చూస్తూ చెవులు రిక్కించాడు. ఆ శబ్దం క్రమంగా పెద్దదవుతూ, దగ్గరవు

తోంది. అతను జాగ్రత్తగా చెట్టును చాటుచేసుకొని నిల బడ్డాడు. శబ్దం ఇప్పుడింకా వేగంగా దగ్గరవుతోంది. సూటిగా కాలిబాటకేసి చూశాడు. కనుచూపు మేరలో ఏమీ కన్పించలేదు. ఇంతలో వున్నట్టుండి బాటమీద ఏదో ఊడి పడింది....దుమ్ము రేపుకొంటూ వురికివస్తోంది.. అది జీపు.

అతను కంగారుగా వెనక్కి చూశాడు. పది గజాల దూరాన పెద్దపెద్ద చెట్లు దట్టంగా వున్నాయి. జీపు తన కేసి వచ్చేస్తోంటే అటుకేసి పరిగెత్తాడు. సందేహించ కుండా ఎగిరి కొమ్మందుకొని చెట్టెక్కేశాడు. జీపు పూర్తిగా దగ్గరయింది....అప్పుడు స్పష్టంగా చూడగలి గాడు. అందులో మనుషుల్ని చూసి అతని గుండె ఆగింది.

పోలీసులు!

పోలీసులు గాలిస్తున్నారు. జయకర్ వొళ్ళంతా జలద రించింది. ఏం చెయ్యాలో అర్థం కాలేదు. కొమ్మల్లో జాగ్రత్తగా నక్కి కూర్చున్నాడు. దాటిపోతున్న జీపుని వూపిరి బిగబట్టి చూశాడు. అప్పుడనుకోకుండా అతని కళ్ళు దానిమీద పడ్డాయి....అది కొమ్మ చివరన చుట్ట చుట్టుకొని తలెత్తి తీక్షణంగా చూస్తోంది. కట్లపాము!

జయకర్ వెన్నులో చలి పుట్టింది. ఆకాశమంతా దట్టంగా మబ్బులు కమ్మివుంది. అరణ్యమంతా నిశ్శబ్దంగా వుంది. నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ జీపు శబ్దం దూరమవు తోంది.

జయకర్ అలికిడి కాకుండా చెట్టుమీంచి దూకేశాడు. వణుకుతున్న కాళ్ళతో నడక కష్టమైంది. బెదురుతూ, వెనక్కి తిరిగి చూస్తూ నడవసాగాడు. ఏమిటి దీని అర్థం? వాళ్ళు యెవర్ని గాలిస్తున్నారు? తీవ్రవాదుల్నా?

ఆకస్మాత్తుగా వాన చినుకులు ప్రారంభమయ్యాయి. అతను కసురుకుంటూ నడక వేగం పెంచాడు. ఇంకా పది గజాలుకూడ నడవలేదు, వాన ఒక్కసారిగా పెద్దదె కుండపోతగా కురవసాగింది. తిట్టుకుంటూ తడుస్తూ పరిగెత్త నారంభించాడు.

అతని అడుగులు విని కుందేళ్ళు, ఉడుతలు పొదల్లోకి గెంతుతున్నాయి. పక్షులు గాభరాపడి కూతలు కట్టి వేశాయి....కొంత దూరం వురికి, పూర్తిగా తడిసిపోయాక పెద్ద చెట్టు కన్పించింది. అదొక్కటే రక్షణ ఇవ్వగలదు.
దానికింద చేరి బ్యాగును నేలమీద పడేశాడు. సమయం 4 గంటలవుతోంది. ఉదయంనుంచీ నడుస్తున్నాడు. అడవిలోకి చాలా దూరం వచ్చేశాడు. ఈ ప్రయాణానికి గమ్యం యెక్కడో తెలియదు. గుడ్డిగా వెళ్తున్నాడు.

ఆ అడవిలోనే వాళ్ళెక్కడో వుంటారన్న నమ్మకముతో వెళ్తున్నాడు. ఇంతకంటే కన్వార్ ప్రాంతాల వాళ్ళకు అనువైన స్థలం లేదు. వాళ్ళ విధ్వంసక చర్యలు కూడా ఈ ప్రాంతాలే సాగుతున్నాయి. అయితే ఇందాక పోలీసుల్ని చూస్తే వాళ్ళు ఊరికేసి వెళ్ళిపోతున్నట్లు వున్నారు....వాళ్ళ గాలింపు ఇంకా ఫలించలేదు.

అరగంటలో వర్షంతగ్గాక తిరిగి బయలుదేరాడు.

బట్టలు, తల పూర్తిగా తడిసిపోయి చలి పుట్టసాగింది. బ్యాగులోంచి అల్కా ఇచ్చిన బిస్కట్లు తిని, విస్కీ తాగాడు. కొన్ని రొట్టెముక్కలుకూడా తిని, శక్తి తెచ్చుకొని పావుగంటసేపు ఉరికాడు....అలా ఉరుకుతూనే వున్నాడు. గుడ్డిగా....ఇప్పుడొకటే ఆలోచన—ఈ అడవిలో గనుక వాళ్ళుంటే ఎక్కడో పొంచి వుండి పోలీ

సుల్ని గమనిస్తూంటారు. అలాగే తనూ వాళ్ళకంట పడ్తాడు. అప్పుడు వాళ్ళ చేతిలో పడ్డం చాలా సులభం.

అలా పరిగెడుతున్న జయకర్ కి మళ్ళీ హఠాత్తుగా జీపు శబ్దం విన్పించింది. నెత్తిమీద పిడుగు పడ్డట్టయింది. ఒక్క దూకులో బాటమీంచి పక్కకు వెళ్ళి పొదల్లో పడ్డాడు. అక్కడ దాగి కూర్చొని, గుండె అదురుతోంటే జాగ్రత్తగా తొంగిచూశాడు.

వాళ్ళు జీపు దిగుతున్నారు ...యాభై గజాల దూరాన వున్నారు. ఇద్దరు ఇన్ స్పెక్టర్లు, నలుగురు కానిస్టేబుల్స్ జీపు దిగి నేలమీద చూడసాగారు. ఏదో చర్చించుకోసాగారు....

అడుగుజాడలు! అడుగుజాడల్ని అనుసరిస్తున్నారు. హఠాత్తుగా వాళ్ళంతా ముందుకు కదలడం చూశాడు జయకర్. ఇన్ స్పెక్టర్ల చేతుల్లో రివాల్వర్స్, కానిస్టేబిల్స్ దగ్గర రైఫిల్స్ వున్నాయి. వాళ్ళు నిశ్శబ్దంగా అడుగుజాడల్ని అనుసరిస్తూ వస్తున్నారు.

డామిట్! ఈ వర్షం నన్ను ముంచేసింది. తిట్టుకున్నాడు జయకర్. వాళ్ళిక నన్ను పట్టుకుంటారు! ఏం చెప్పాలి? నేను ప్రెస్ రిపోర్టర్ ననీ, తీవ్రవాదుల్ని గాలిస్తున్నాననీ చెప్పేస్తే నమ్ముతారా? ఇప్పుడు నా దగ్గర ప్రెస్ కార్డ్ లేదు. హోటల్ లోనే వదిలాను, నేను రిపోర్టర్ నని ఆ ముఠాకు తెలియడం మంచిది కాదన్న ఉద్దేశంతో. ఇప్పుడేం చెయ్యాలి?

అతను ఉలికిపడ్డాడు. ఓ.కే! నేను ప్రెస్ రిపోర్టర్ నని రుజువు చెయ్యగలను. అయితే ఈ బ్యాగులో అయిదువేల రూపాయలకి, సంజాయిషీ ఏం చెప్పాలి? ఈ డబ్బు అల్కా ఇచ్చింది, ఆ ముఠాకు అడ్వాన్సుగా.

ఇంత డబ్బుతో నేనా ముఠాను గాలిస్తున్నానంటే పోలీసుల దృష్టిలో అర్థమేమిటి? ఏజెంట్ వి! నువ్వేదో విధ్వంసక చర్యకు వాళ్ళ నెన్నుకొంటున్నావు! ఇలాగే ఆరోపిస్తారు పోలీసులు—

జయకర్ వాళ్ళకేసి గాభరాగా చూశాడు. నాన్సెన్స్ ఏమిటీ ఆలోచనలు? తాను పట్టుబడతాడని ఎందుకనుకోవాలి? పట్టుబడకుండా ఉపాయం ఆలోచించాలి! ఆలోచించాడతను—క్షణాల్లో ఆలోచిస్తూనే అందుకు పూనుకొన్నాడు.

గభాల్న లేచి పరుగుతీశాడు. నేలలో అతని బూట్ల గుర్తులు లోతుగా పడ్తున్నాయి.

చెట్లూ, పొదల్ని చాటుచేసుకొంటూ దట్టమైన స్థలానికి చేరుకున్నాడు. అక్కడ గజిబిజిగా గెంతుతూ అడుగు జాడల్ని సృష్టించాడు. తర్వాత బూట్లు విప్పేసి ఒట్టి పాదాలతో సృష్టించాడు, అరచేతులతో నేలమీద ప్రాకాడు. బూట్లు బ్యాగులో దోపి, సిగరెట్ పెట్టి, కర్చీఫ్ తీసి క్రింద పడేశాడు. ఆ తర్వాత బ్యాగునందులోని వట్టి కాళ్ళతో ఏపుగా, నడుము ఎత్తుకు పెరిగిన గడ్డిలోకి పరుగుతీశాడు. అక్కడ బోర్లా పడుకొని చెవులు రిక్కించాడు. వాళ్ళ మాటలు దగ్గర్లో, అస్పష్టంగా వినిపిస్తున్నాయి.

ఉన్నట్టుండి జయకర్ గట్టి కేక పెట్టాడు.

"హెల్ప్! రక్షించండి! కాపాడండి!"

అతని అరుపు వేగంగా వ్యాపించింది. వెంటనే అవతలి వేపు కేకలు విన్పించాయి. బూట్ల చప్పుడు అవుతోంది. వాళ్ళు అడుగుజాడల్ని వెంబడించి వస్తున్నారు...క్షణాల్లో వాళ్ళంతా జయకర్ సృష్టించిన భీభత్స స్థలానికి చేరు

కున్నారు. అక్కడ చెదరిన నేలను ఆశ్చర్యంగా చూస్తూ మాట్లాడుకోసాగారు.

"చూడండి. అతను క్రిందపడిపోయాడు. ఎవరో అతన్ని కొట్టి ఎత్తుకుపోయారు. అడుగుజాడలు అలా వెళ్తున్నాయి.... షాలో జమ్!"

వాళ్ళు తనకేసి వచ్చేస్తుంటే జయకర్ లేచి శబ్దం గాకుండా తిరిగి కాలిబాట దిశకు వురికాడు. మెరుపులా చేరుకొని, దూరంగా ఆగివున్న జీపుకేసి చూశాడు.

జీపులో డ్రైవరు అటు తిరిగి కూర్చొని సిగరెట్ కాలుస్తున్నాడు. వెనుకనుంచి జయకర్ జాగ్రత్తగా చేరుకున్నాడు. పిల్లిలా వెళ్ళి డ్రైవర్ వెనుక నిలబడి, బ్యాగులోంచి బూటు తీసి దాని మడమతో మూడు మెరుపు దెబ్బలు నెత్తిమీద వేశాడు. డ్రైవర్ కిక్కురుమనకుండా కూలిపోయాడు. అతన్ని క్రిందకు లాగి పడేసి, జీపెక్కి స్టార్టు చేసి, వెనక్కి తిప్పి వచ్చినదారిన వేగంగా డ్రైవ్ చేశాడు. వాళ్ళు శబ్దం వింటే డ్రైవర్ బండిని తమవద్దకు తెస్తున్నాడనుకుంటారు....

కొంతదూరం వెళ్ళి ఆపేసి, దిగి బూట్లకు బురద అంటించి సీట్లమీద అద్దాడు. స్టీరింగ్ వీల్‌తోపాటు గేర్ లివర్‌ని శుభ్రంగా తుడిచేసి బ్యాగందుకొని వేగంగా చెట్లచాటుకి వురికాడు అనువైన స్థలం చూసుకొని, అక్కడ నిలబడి జీపుకేసి చూడసాగాడు.

పావుగంట గడిచాక వాళ్ళు స్పృహతప్పిన డ్రైవర్‌ నెత్తుకొని కంగారుగా వస్తూ కన్పించారు.

జీపుని చేరుకొని ముఖాలు చూసుకున్నారు. గట్టిగా అర్చారు.

"అతన్ని జీపులో వేసుకొని ఇక్కడికి తెచ్చాడు.

ఇక్కడ దిగి తిరిగి మోసుకొని వెళ్ళిపోయాడు" అన్నాడు ఒక ఇన్‌స్పెక్టర్.

"ఎక్కడికి?"

"అడుగుజాడలు చూడండి — పూళ్ళోకె ళ్తుంటాడు. లెటజ్ గో!"

వాళ్ళంతా జీపెక్కుతోంటే జయకర్ నవ్వుకున్నాడు.

జీపు స్టార్టయి వేగంగా ఊరికేసి వెళ్ళిపోయింది.

## 5

చీకటి పడింది.

కళ్ళకేమీ కన్పించడంలేదు.

టార్చి తీసుకురాలేదు. అది మంచిది కాదనుకున్నాడు. కాని ఇప్పుడు దాని అవసరం గుర్తిస్తున్నాడు. దాంతో సులభంగా వాళ్ళ చేతిలో పడవచ్చు! సిగరెట్ కూడా అందుకు ఉపకరిస్తుంది. కానీ ఉన్న ఒక్క ప్యాకెట్‌ని అక్కడ పారేశాడు.

ఇప్పుడు సమయం ఎనిమిది కావస్తోంది.

తను మధ్యాహ్నంనుంచీ నడుస్తోనే వున్నాడు. ఎంతకీ ఈ అడవి అంతం కావడంలేదు! ఇప్పుడు కాళ్ళు కూడా తీపులు పెడుతున్నాయి. ఈ చీకట్లో అడవిలో చుట్టూ తిరుగుతున్నాడేమో తెలియదు. అతని కళ్ళు మాత్రం ఒక దివిటీకోసం, చిన్న వెలుగుకోసం వెతుకుతున్నాయి. ఆ వెలుగు వాళ్ళ స్థావరం అయ్యే అవకాశం వుంది.

ఉన్నట్టుండి ప్రక్కన పిడుగుపడ్డట్టు—పటపటమని—శబ్దమెంది. అదిరిపడి ముందుకు వురికాడు.

మళ్ళీ అదే శబ్దం! వెంటనే నీళ్ళ చప్పుడు! నీరు అల్ల కల్లోలమవుతోన్న అలజడి! కుదుటపడ్డాక ఆ చప్పుడేమిటో పసిగట్టాడు. మొసళ్ళు అలాగే అరుస్తాయి!

అప్పుడు గానీ తను పెద్ద చెరువు ప్రాంతాల వున్నట్లు గ్రహించలేదు. వెంటనే అక్కడనుంచి శక్తికొద్దీ పరుగు తీశాడు.

జయకర్ ఇలా అడవుల్లో ఎన్నడూ ప్రయాణించలేదు. అయినా ఇన్ని అపాయాల్ని తప్పించుకొంటూ ధైర్యంగా ముందుకు సాగడం అతనికి ఆశ్చర్యంగా వుంది. అది అల్లా మహాత్మ్యం అనుకున్నాడు.

ఇంతలో మళ్లీ ఏదో శబ్దం—అది నవ్వు. ఎవరో పగలబడి నవ్వుతున్న శబ్దం. అది మనిషి నవ్వుకాదు. జయకర్ వొళ్ళు జలదరించింది. దెయ్యం.... దెయ్యం నవ్వుతోంది అతన్ని చూసి. అతను కొయ్యబారిపోయాడు. ఆ నవ్వు ఆగిపోయి మళ్ళీ ప్రారంభమైంది.

అప్పుడు జయకర్ వులికిపడి తేరుకున్నాడు. ఆ నవ్వు జాగ్రత్తగా విన్నాడు.... హైనా! హైనా అరుపు అలాగే వుంటుంది!

అతని కాళ్ళూ, చేతులు బిగుసుకు పోయాయి. అది తనని పసిగట్టిందా? అయితే పీక్కుతింటుంది. చీకట్లో ఎటు వురకాలో అర్థంకాలేదు. ఏదీ తేల్చుకొనే లోపున ఆ వికట నవ్వు భయంకరమైన కేక గా మారిపోయింది. ఆ తర్వాత మూల్గు విన్పించింది...

ఏం జరిగింది? అదెందుకలా మూల్గింది? మరేదైనా జంతువు వాతపడిందా? చచ్చిపోయిందా?

అతనా అయోమయ స్థితిలో ఎంత సేపున్నాడో తెలియదు చేష్టలుడిగి—వెనుకేదో అలికిడి విని చివాల్న తిరిగి చూశాడు. అతనివేపు మెరుపులా ఏదో దూసుకొచ్చింది.

దాన్ని పసిగట్టే లోపున ముఖంమీద గట్టి దెబ్బ

పడింది. వెర్రి కేకతో వెనక్కి పడ్డాడు. మరో దెబ్బ అతని పొట్టమీద పడింది.

జయకర్ ఓర్చుకోలేక మళ్ళీ అరిచాడు.

"ఇక ఆపు!" అన్నారెవరో.

"వీడెవడు?" మరోగొంతు పలికింది.

"అతన్ని లేపు!" మొదటి కంఠం ఆజ్ఞాపించింది.

జయకర్ బాధగా కళ్ళు తెరిచి చూశాడు. ఒక ఆకారం మీదకి వంగి చూస్తోంది. అది నడుముపట్టి అతన్ని లేపి నిలబెట్టింది. జయకర్ పూర్తిగా తేరుకొని వాళ్ళని చూశాడు. చీకట్లో మొఖాలు కన్పించలేదు. ఆ ఇద్దర్లో ఒకడు సైకిలెక్కి వున్నాడు.

"ఎవరు మిస్టర్ నువ్వు?" సైకిల్ మనిషి అడిగాడు.

"నేనెవరైతే నీ కెందుకు?"

"ఇక్కడేం చేస్తున్నావ్?"

"ఎక్స్కరషన్ కొచ్చాను."

"అంటే?"

"ఓహో, మీరు ఆదిమానవులు కదూ? ఇంగ్లీషురాదు."

"నోర్మూయ్! మేం తీవ్రవాదులం! సరిగా మాట్లాడక పోతే ఇక్కడే పాతేస్తాం!"

"ఓ.కే! ఓ.కే! మీరు తీవ్రవాదులని తెలియడానికలా అరవనవసరంలేదు! తెలుస్తోనే వుంది. మీతోనే నాకు పనివుంది. నన్ను మీ మొగుడి దగ్గరికి తీసుకెళ్ళండి—"

"ఏమన్నావ్?"

"మీ నాయకుడి దగ్గరికి తీసుకెళ్ళండి!"

సైకిల్ మనిషి అనుచరుడితో అన్నాడు: "ఇతన్ని సోదాచెయ్యి. పోలీసు మనిషయితే ఇక్కడే సఫా చెయ్యి."

జయకర్ నవ్వాడు. "చూసుకోండి! ఈ బ్యాగులో అయిదువేలు రొక్కం వుంటుంది, రొట్టెముక్క లుంటాయి...ఆయుధాలుండవు. పరికరాలుండవు. మిమ్మల్ని ఒక పనికి ఎన్నుకోవాలని వచ్చాను."

సోదా పూర్తయ్యాక అనుచరులు ఏదో మాట్లాడు కున్నారు.

"అచ్చా! మాతో నీకేం పని?" సైకిల్ మనిషి అడిగాడు.

"మీతో కాదు, మీ బాస్‌తో చెప్తాను. తీసు కెళ్తారా? నన్నే వెళ్ళమంటారా? టైం వేస్ట్ చెయ్యకండి కామ్రేడ్స్!"

మళ్ళీ వాళ్ళిద్దరేదో చర్చించుకున్నారు. సైకిల్ మనిషి తొక్కుకుంటూ వెళ్ళిపోయాడు.

మిగిలినవాడు జయకర్ దగ్గరికొచ్చాడు, "పద, వెళ్దాం."

జయకర్ తేలికపడి బ్యాగందుకున్నాడు. ఇద్దరూ నడవసాగారు. కాస్సేపటి తర్వాత జయకర్ అడిగాడు, "అతనెక్కడికి కెళ్ళాడు."

"ఊళ్ళోకి!"

"ఏం పని?"

"నీ కనవసరం, అడక్కు!"

"సాయంత్రం ఇక్కడ పోలీసులు గాలించారు, తెలుసా?"

"మాకు అన్నీ తెలుసు."

"ఎలా తప్పించుకున్నారు."

"మాకు కొన్ని పద్ధతులున్నాయి. అవన్నీ నీకెందుకు?"

"ఇందాక అరిచింది హైనా కదూ?"

"అవును, తర్వాత నువ్వు అర్చావు."

"అది చచ్చిందా?"

"నమ్మకంగా. నేనే చంపాను."

"మొనగాడివి. పేరేమిటి?"

"సతీంకూల్."

"రష్యన్ పేరా?"

"ఎందుకనుకుంటున్నావు?"

జయకర్ నవ్వాడు. "నేనెప్పుడో ఓ రష్యన్ అనువాద నవల చదివాను. అందులో నీ పేరేగల బదుద్ధాయి పళ్ళసందునుండి ఉమ్మతుంటాడు—తుంటరి నెగడు!"

"పేరేమిటి?"

"తొలి ఉపాధ్యాయుడు."

"పుస్తకం పేరు కాదు, నీ పేరు!"

"బాబ్ క్రిస్టో."

"తెలివిగలవాడిలా వున్నావ్. ఇందాకటి బహుమానం గుర్తుందా?"

"గుర్తుంది. నువ్వు వెన్నుదెబ్బ తీశావు. ఏం జరుగుతోందో తెలుసుకోలేకపోయాను. ఇప్పుడు కాచుకుంటావా?"

సతీంకూల్ పిడికిలి విసురుగా వచ్చి జయకర్ గడ్డం క్రింద తాకింది. వెనక్కిపడుతూ నిలద్రొక్కుకున్నాడు. సతీంకూల్ పిడికిలి మళ్ళీ మెరుపు వేగంతో వచ్చింది. జయకర్ తటాలున దాన్ని పట్టుకొని చెయ్యి మెలితిప్పి కాలితో కడుపులో తన్నాడు. సతీంకూల్ పొలికేక పెట్టాడు. జయకర్ అతన్ని వదలి రెండుచేతులూ బిగించి ముఖంమీద బాదాడు. అతను క్రిందపడి దొర్లుతుంటూ వెళ్ళి ఎక్కడ పడ్డాడో తెలియదు.

కాస్సేపటి తర్వాత, "సతీంకూల్!" అని పిల్చాడు.

"....క్రిస్టో! మేరేభాయీ!"

అరుపు విన్పించినవేపు వెళ్ళి చూశాడు. సతీం గోతిలో పడివున్నాడు. చెయ్యి అందించి లేపాడు. సతీంకూల్ ఆయాసంగా నిలబడుతూ, "మె చ్చా ను యార్!" అన్నాడు.

"చచ్చావనుకున్నాను," అన్నాడు జయకర్.

సతీంకూల్ గట్టిగా నవ్వేశాడు "చలో భాయీ!"

# 6

వాళ్ళు నలుగురు బయటేదో అలికిడి విని చటుక్కున లాంతర్ నార్పేశారు. వాళ్ళ చేతులు ఆయుధాలకోసం ప్రాకాయి చీకట్లో—కణకణ చప్పుడు. అదే క్షణంలో బయట చీకట్లో రెండు ఆకారాలు అస్పష్టంగా కన్పించాయి.

"ఉష్.... సతీంకూల్" ఎవరో గుసగుసలాడారు.

"అవును. ప్రక్కన ఎవరది, హే?" మరో గొంతు పలికింది.

"రాందేవ్ కాదు, మఖన్."

"సైకిలేది, హే? రాందేవ్ ఏడి?"

బయిట విచిత్రమయిన అరుపు విన్పించింది—సతీంకూల్ సంకేతం.

"హే! లాంతర్ ముట్టించు."

చురుక్కున అగ్గిపుల్ల మండింది. మరుక్షణం లాంతరు వెల్గింది. అప్పుడే గుడారంలోకి ప్రవేశించిన రెండు ఆకారాల్ని పరీక్షగా చూశారు వాళ్ళంతా.

"ఇతను మనకోసం వచ్చాడు, మఖన్" సతీంకూల్ అన్నాడు, జయకర్‌ని చూపిస్తూ.

ఖాకీ నిక్కరు, బ్లూ షర్టులో ఉన్న అజానుబాహుడు ఎగాదిగా చూశాడు.

"ఎవర్నువ్వు, హే? ఏం పని?"

జయకర్ భయపడకుండా అన్నాడు, "బాబ్ క్రిస్టో పేరు. మీరేమీ కంగారుపడ నవసరంలేదు. శత్రువుని కాను. మిమ్మల్ని కలుసుకోడానికొచ్చాను. మీతో పని వుంది."

మఖన్ సతీంకూల్‌ని ప్రశ్నార్థకంగా చూశాడు. అతను అంతా వివరంగా చెప్పాడు.

"మేమిక్కడ వున్నట్టు నీకెలా తెలుసు, హే?" మఖన్ అడిగాడు.

జయకర్ కింద కూలబడుతూ నవ్వాడు. "ఊహించాను. మీ చర్యలు కన్వార్ ప్రాంతాలే సాగుతున్నాయి. అందుకే పోలీసులకూ కూడా ఈ అడవిమీద కన్నుపడింది...." అని తన అనుభవాల్నీ, పోలీసుల్ని ఎలా దారిమళ్ళించిందీ వర్ణించి చెప్పాడు.

కాని ఎవరూ నమ్మలేదు. నమ్మరని తెలుసు.

మఖన్ సిగరెట్ వెలిగించాడు. "నీ రాక అనుమానాస్పదంగా వుంది, క్రిస్టో. నిన్ను పోలీసులు పంపలేదు కదా?"

జయకర్ తేలిగ్గా నవ్వేశాడు. "ఈ జోక్స్ మానేసి ఇక బిజినెస్ మాట్లాడుకుందామా, కామ్రేడ్?"

"ఏం బిజినెస్?"

"ఒక పార్టీని అంతం మొందించాలి—ఇద్దర్ని."

ఎవరూ ఉలికిపడలేదు. తీక్షణంగా చూశారు.

"ఆ పని మేమెందుకు చెయ్యాలి, హే?"

"ఈ పార్టీలో మీ శాసక్తి వుంది గనుక."

"మాకా?"

"నమ్మకంగా మీకే. విజాతీయుల్ని తరిమేయడం— అంతమొందించడం మీ బిజినెస్. ఈ పార్టీ మీ జాతి కాదు. సిరపడ్డ పార్టీ."

"ఎక్కడనించి?"

"కేరళనుంచి."

"ఆగు మిస్టర్! నిన్ను చూస్తే సౌత్ ఇండియన్‌లా వున్నావు. నీ ముఖం చెపుతోంది. నకిలీ పేరుతో ఏమిటీ కథ? నీదేవూరు?"

"కొచ్చిన్. పేరు నకిలీ కాదు. ఈ పార్టీ మీద నాకు కక్ష వుంది. అది తీర్చుకోడానికి గౌహతి కొచ్చాను. మీ దగ్గరికి రావడం పొరపాటనుకోను. మీరు నా ప్రాణాలు తీయరు— నే చెప్పిన ప్రాణంతీసి లాభిస్తారు."

"బేటా క్రిస్టో, ఆ పార్టీ పేరు చెప్పు?"

జయకర్ పేరుతో సహా వివరాలన్నీ చెప్పాడు.

"హే! కృష్ణమీనన్! కాపిటలిస్ట్, అవునా?"

"అవును."

"అతనిగురించి మాకు బాగా తెలుసు. అతణ్ని గౌరవిస్తాం, శ్లాఘిస్తాం. అతనీ ప్రాంతాన్ని అభివృద్ధిపర్చాడు. ఆర్థికంగా, పారిశ్రామికంగా అతను మళయాళీ కావచ్చు కానీ, అతని పౌరసత్వం ఇక్కడ 1951 కంటే చాలా పూర్వం నుంచి వుంది. 1944 లో సిరపడ్డాడు. అలాటి వాడు కాదు విజాతీయుడు. విజాతీయుడు '51 తర్వాత దేశ సరిహద్దు దాటి, ఇతర రాష్ట్రాలనుంచి తరలివచ్చి, ఇక్కడ మాకు నిరుద్యోగ సమస్య సృష్టించినవాడు. మా ఉనికినీ, సంస్కృతినీ గుర్తింపులేకుండా చేసినవాడు. వాడిని సహించం. కాని మీనన్‌లాటి వారిని కాదు."

"నేనిక్కడ రాజకీయ దృష్టితో రాలేదు. వ్యక్తిగత మోటివ్‌తో వచ్చాను. మీనన్‌ని చంపడం నా ధ్యేయం."

"అయితే ఆ పని నువ్వెందుకు చెయ్యకూడదు, హాఁ?"

"అది నావల్ల అయ్యే పనైతే మీ దగ్గరికి వొచ్చేవాణ్ని కాదు. మీ సహాయం కావాలి. అందుకు యాభై వేలు ఇవ్వడానికి సిద్ధంగా వున్నాను."

ఒక్కసారిగా శిబిరంలో కలకలం బయలుదేరింది.

యాభై వేలు! యాభై వేలు! ఆర్భాటంతా.

"అవును. అయిదువేలు ఎర్నెస్టు మనీ, ఇదిగో తీసుకోండి. డబ్బు ముందు మీ రాజకీయ ఉద్దేశాలు వెలవెల బోతాయి. డబ్బుకు మరేదీ సాటిరాదు. డబ్బుని మించిం దేమిటి? మీరీ పని చేస్తే అంత డబ్బు ముట్టుంది-యాభై వేలు. మిమ్మల్ని ప్రజల్లో స్వేచ్ఛగా తిరగనివ్వని రాజకీయ ఉద్దేశాల్ని ఎవరూ హర్షించరు. అది ఉన్మాదం. హింసామార్గం. మీకు తిండి పెట్టని ఈ రాజకీయాలకంటే, సిద్ధాంతాలకంటే, నే చెప్పిన పని వెయ్యిరెట్లు నయమని పించటంలేదూ? ఆత్మవిమర్శ చేసుకోండి."

పది నిమిషాలు వాళ్ళ మధ్య చర్చసాగింది. అంతసేపూ జయకర్ సిగరెట్ తాగుతూ వుండిపోయాడు.

"బేటా క్రిస్టో, ఇదేదో పోలీసు ట్రాప్ కాదు కదా?" మఖన్ అన్నాడు చివరికి.

అతన్ని పరీక్షగా చూశాడు జయకర్. యాభై వేల రూపాయలకి ముఖంలో ఎంత కళ వచ్చింది.

"కాదు" అన్నాడతను. "మిమ్మల్ని డబుల్ క్రాస్ చేస్తున్నట్లు అన్పిస్తే శిక్షించండి."

"కానీ అంత డబ్బు నీ దగ్గరెక్కడిది?"

"ఈ అనుమానాలన్నీ రేపు మీనన్ బంగళా కొస్తే

తీరిపోతాయి."

"మీనన్ బంగళాకా!"

"అవును. రేపు అతనుండడు. అక్కడే అన్ని విషయాలు వివరంగా మాట్లాడుకోవచ్చు. ప్లాను తయారు చేయవచ్చు."

"బేటా క్రిస్టో, మేం చాలా ప్రమాదకరమైనవాళ్ళం. మాతో ఆటలు, మోసాలూ మంచివికావు. నువ్వు డబుల్ క్రాస్ చేస్తే నీ ఆనవాలు నీ స్వంత తల్లికూడా గుర్తు పట్టదు. అర్థమైందా, హేఁ?"

"అర్థమైంది. నన్ను బేటా అని పిలవకు. నాకు నీలాంటి తండ్రి ఎప్పుడూ లేడు. రేపు మీనన్ బంగళాకి వస్తావా?"

"అక్కడికెందుకు, హేఁ? ఏమిటీ వ్యవహారం, వివరంగా చెప్పు?"

జయకర్ వాళ్ళకు వివరంగా కథ వినిపించాడు.

## 7

విద్రోహులు ఆరుగురూ రోడ్డు దిగువ గుంటల్లో పొంచి వుండి గుసగుసలాడుకోసాగారు.

చుట్టూ చీకటి. ఉండుండి వీచే గాలి హోరు తప్ప పరిసరాలన్నీ నిశ్శబ్దంగా వున్నాయి.

వాళ్ళక్కడ గంటసేపటినుంచీ కూర్చుని వున్నారు. వాళ్ళ జీవితాల్లో చాలా భాగం ఎదురుచూడ్డంలోనే గడిచిపోయింది కాబట్టి విసుగనిపించటంలేదు. మఖన్ ఎడమచెయ్యెత్తి డొక్కువాచీలో టైం చూసుకున్నాడు. పదికావడానికి అయిదునిమిషాలున్నాయి. మీనన్ ఎప్పుడో బయలుదేరి వుంటాడు. లెక్క ప్రకారం పది నిమిషాల్లో కారులైట్లు కన్పించాలి.

సతీంకూల్ ఒక్కసారిగా దిక్కులదిరేలా కేక

పెట్టాడు. అనుచరులందరిపడి చూశారు. అతను క్రింద దొర్లుతూ తన్నుకుంటున్నాడు. పిచ్చిగా అరుస్తున్నాడు.

“హే, సతీం! ఏమయింది!” అర్చాడు మఖన్ అగ్గి పుల్ల గీసి.

పరుచుకున్న వెలుతురులో అతని నోట్లో నురుగుచూసి తెంరెత్తిపోయారంతా!

పాము! పాము కాటేసింది!

అదే క్షణంలో దూరంగా హెడ్ లైట్లు కన్పించాయి! అవి వేగంగా దగ్గరవుతున్నాయి.

దాని శబ్దానికి అందరూ సతీంని వదిలేసి రోడ్డుమీదకు ప్రాకసాగారు. సతీం కూల్ తన్ని వదిలిపెట్టొద్దని అర్చాడు, ఏడ్చాడు. చివరికి శక్తి హరించి విషప్రభావానికి ప్రాణాలు విడిచాడు.

కారు పూర్తిగా దగ్గరవడంతో దాన్ని గుర్తించాడు మఖన్. అదే మీనన్ కారు! అతను చెయ్యెత్తి చిటిక వేయడం, విసురుగా అందరి చేతుల్లో గ్రెనేడ్స్ కారుకేసి దూసుకెళ్ళడం, దాన్ని తాకి పెద్ద శబ్దంతో అన్నీ ఒకేసారి ప్రేలిపోవడం, లిప్తపాటు కాలంలో జరిగిపోయాయి....

కార్లో వున్న బెంగాలీ బ్రదర్స్ అమరసేన్, సమరసేన్‌లకి ఆ తాకిడి ఎట్లా అన్పించిందంటే — శుక్రగ్రహం అమాంతంగా వూడి నెత్తిమీద పడ్డట్టయింది!

ఏం జరుగుతుందో తెలియని సమర్ సేన్ సడన్ బ్రేకుతో కారాపేశాడు. మరొక గ్రెనేడ్ దొర్లుకుంటూ వచ్చి కారు క్రింద ప్రేలింది. మరొకటి బాయ్‌నెట్ మీద పడి కాళ్ళముందు బ్రద్దలంది. అమర్ సేన్ కళ్ళు మూసుకొని పెద్దగా అర్చాడు. జుట్టు పీక్కొని డోర్ తెరిచి బయటికి

దూకేశాడు. అతని వెనుక అమర్ దూకాడు. ఇంకో గ్రేనేడ్ వాళ్ళిద్దరి వెనుక పేలింది.

"ఓహ్, ఏమిటిది!" అమర్ సేన్ రోడ్డుదిగి బోర్లా పడుకొని కేక పెట్టాడు.

మరో గ్రేనేడ్ కారు తలుపుని విడగొట్టడంతో అది వచ్చి రోడ్డు దిగుతోన్న సమర్ సేన్ వీపుకి కొట్టుకుంది. అతను బోర్లాపడ్డాడు.

"కమాన్, షూట్!" అర్చాడతను రెచ్చిపోయి.

మరుక్షణం ఇద్దరి చేతుల్లో రివాల్వర్స్ ప్రత్యక్షమయ్యాయి....గుళ్ళు పేలాయి. అవతలికి వెళ్ళి అవి ఆర్తనాదాల్ని సృష్టించాయ్. ఇద్దరూ ఆగకుండా కాలుస్తున్నారు. అవతల అరుపులు విన్పిస్తోన్నాయి. అవి నమ్మకంగా చావు కేకలు. బెంగాలీ బ్రదర్స్ గురి ఎప్పుడూ తప్పదు.

ఇంతలో కారు టైరు వూడి గిరగిర తిరుగుతూ వచ్చి అమర్ ముఖంమీద తాకింది. అతను పదిగజాలు వెనక్కి దొర్లాడు. అప్పుడే సమర్ చేతికేదో తాకింది....దాన్ని ముట్టుకుని నిశ్చేష్టుడయ్యాడు. క్షణం ఆలస్యం చెయ్యకుండా బలంకొద్దీ రోడ్డుకవతల విసిరాడు.

దాని తాకిడికి అవతల మరో ఆర్తనాదం విన్పించింది.

ఆ తర్వాత ఇంకేమీ జరక్కపోవడంతో లేచి అటువైపు వరిగెత్తారిద్దరూ. చీకట్లో అస్తవ్యస్తంగా పడివున్న శవాల్ని చూసి వెనుదిరిగారు. అప్పుడే దూరంగా హెడ్ లైట్స్ కన్పించాయి.

సమర్ ఉలికిపడి, "స్క్రామ్!" అనరిచాడు.

"వాళ్ళిద్దరు....?" అమర్ గొణిగాడు.

"ఓహ్, షడాప్! చచ్చివుంటారు. పారిపోవాలి."

అమర్ సేన్ కారు దగ్గరికి వురికి ముందు సీట్లో, వెనుక సీట్లో చూశారు. మీనన్ జోసెఫ్‌లు క్రింద పడిపోయి వున్నారు. కదలిక లేదు. పలుకు లేదు. అతను ముక్కు దగ్గర వేలు పెట్టి చూశాడు. శ్వాసకూడ లేదు. వెంటనే జేబులో వున్న మరో రివాల్వర్ తీసి ముందుసీటుమీద పడేసి పరిగెత్తాడు.

"చచ్చారు....ఇప్పుడేం చెయ్యాలి?"

"ఓహ్, షటప్. స్కౌండ్రెల్!" అర్చాడు సమర్ అసహనంగా.

కారులెట్లు పూర్తిగా దగ్గరవుతోంటే ఇద్దరూ వెనక్కి తిరిగి సిటీకేసి పరిగెత్తసాగారు. వాళ్ళిద్దరూ పేరుపొందిన కిరాయి కిడ్నాపర్స్.

# 8

ఘటనా స్థలానికి పోలీసు దళాలు చేరుకున్నాయి.

కానీ అక్కడ మిగిలిందేమీ లేదు — కాలిపోయిన కారు అవశేషాలూ, ఉడికిన శవాలూ తప్ప. కారులో వున్న రెండు కళేబరాలు గుర్తించ వీల్లేకుండా వున్నాయి. కారు ఒక్కటే వాటి ఆనవాళ్ళి నిర్ధారించగలదు. రిజిస్ట్రేషన్ చెకింగ్‌లో దాని యజమాని కృష్ణమీనన్ అని తెలియడంతో పట్టణమంతా ఆ వార్త గుప్పుమని వ్యాపించి సంచలనం రేకెత్తించింది.

పోలీసులు F.I.R. తయారుచేశారు. దాని ప్రకారం మీనన్ తన బాడీగార్డు సమేతంగా డిన్నూర్ బయలుదేరి వెళ్తుండగా దారికాచిన దుండగులు బాంబు దాడి జరిపి అటకాయించారు. అప్పుడు జోసఫ్ రివాల్వర్‌తో ఎదురు దాడి జరిపాడు—ఇలాగని దుండగుల శరీరాల్లో బుల్లెట్ రంధ్రాల్ని బట్టి నిర్ధారించారు—కానీ దుండగుల దాడి

ఇంకా తీవ్రం కావడంతో వాళ్ళిద్దరూ మరణించారు. ఇంతలో గౌహతికొస్తున్న ఒక ప్రయాణికుడు కారాపి జరిగింది గ్రహించి, వెంటనే సిటీ చేరుకొని పోలీసులకి తెలియజేశాడు.

అప్పుడు కారుకు నిప్పంటుకోలేదు. లోపల రెండు శవాలు సాధారణ స్థితిలో కన్పించాయి.

కానీ పోలీసులు చేరుకునేటప్పటికి కారు తగులబడి పోయి శవాలు కాలిపోతున్నాయి. కార్లో లగేజీ లేదు, రివాల్వర్ లేదు. పెట్రోల్ టాంకు పగిలివుంది.

దీన్నిబట్టి రిపోర్టిచ్చిన ప్రయాణికుడు ఆ స్థలంనుంచి నిష్క్రమించాక అక్కడెవరో వచ్చివుంటారనీ, వాళ్ళు కార్లో సామాను, రివాల్వర్‌తోబాటు శవం మీద వస్తువులు దోచుకొని పారిపోతుండగా పొరపాటున పారేసిన సిగరెట్ పీకవల్లనో; అగ్గిపుల్లవల్లనో, రోడ్డుమీద మడుగు కట్టిన పెట్రోలుకు నిప్పంటుకొని; ఆ మంటల్లో కారు తగులబడి పోయిందని నిర్ణయించారు.

బహుశ, ఆ దుండగులు దాడిలో చనిపోకుండా బయటపడ్డ ఉగ్రవాదులు కావచ్చనికూడ పోలీసులకి అనుమానం వుంది. అక్కడ మొత్తం నలుగురు దుండగుల శవాలు లభించాయి. దాడి జరిపిన వారెందరో లెక్క దొరకలేదు.

మీనన్ మరణంతో అతని భార్య ఆల్కాని యావదాస్తికీ ఎదురులేని సామ్రాజ్ఞిగా అభివర్ణించాయి పత్రికలు. ఆమె ఇప్పుడు మీనన్ ఐశ్వర్యంలో మునిగి తేలుతూ జలవిన్యాసాలు జరుపవచ్చని వ్యాఖ్యానించాయి....

తనగురించి పత్రికలు అలా వ్రాస్తాయని ఆల్కాకు ముందే తెలుసు. అది చదివి తనివిదీరా పొంగిపోవాలను

ఉంది, గర్వపడాలనుకుంది. ఇన్నాళ్ళూ ఒక కోటీశ్వరుడి భార్యగా తనకా గుర్తింపూ, ప్రచారమూ లభించలేదు. ఆ కోరిక ఇప్పుడిలా తీరుతోందనుకుంది—తీరింది.

కానీ తాను కోరుకున్న విధంగా కాదు. ఆమె ప్రక్కన జయకర్ లేడు. ఈ ఆనందమంతా అతనితో పంచుకోవాలనుకుంది.... కాని అతని జాడ లేదు! రెండు రోజుల్నుంచి కన్పించడంలేదు; చెప్పకుండా ఇలా ఎక్కడికెళ్ళాడో అంతు చిక్కడంలేదు. హోటల్ గది ఖాళీ చేశాడు.

అతని పిలుపుకోసం, రాకకోసం, ఆమె తహతహలాడుతూ యెదురు చూస్తోంది. నిరాశా నిస్పృహాలతో కృంగిపోతోంది. జయ్! ఎందుకిలా చేశాడు? ధైర్యం కోల్పోయాడా! నన్ను వదలి పారిపోయాడా? ఇదే నిజమైతే నేనెలా జీవించడం? అతను లేకుండా నాకీ డబ్బు వద్దు.

కానీ, జయకర్ మాత్రం మణిపూర్‌లో మకాంవేసి మనసును బాధ్యతలమీద లగ్నం చెయ్యడానికి ప్రయత్నిస్తున్నాడు. అల్కాని విడిచి అతను పారిపోలేదు. ఒక వ్యవహారంలో తల దూర్చాక వెనక్కి తీసుకొనే ప్రసక్తి లేదు.

ఇప్పటి పరిస్థితిలో తను అక్కడ వుంటే అల్కాతో కలయిక తప్పదు. తను కలవకపోయినా ఆమె ఆ ప్రయత్నం చేస్తుంది. ఆమె చాపల్యం తనకు తెలుసు. ఆమె తొందరపాటుతో కలలుగన్న సుస్థిరమైన బంగారు భవిష్యత్తును చిటికెలో ముగించివేస్తుంది—నల్గురికి అనుమానాలూ, అపోహలూ రేకెత్తించి; తద్వారా తమ బండారమంతా వెల్లడిచేసే మతిలేని చేష్టలతో.

అందుకే అతను ఆమెతో చెప్పకుండా మణిపూర్ వచ్చేశాడు. అంతా సద్దుమణిగి, పరిస్థితులు చక్కబడ్డాక కలవాలనుకుంటున్నాడు. అప్పటికి అందరూ మీనన్ని మర్చిపోయి, అల్కా పట్ల ఆనాసక్తిని కనబరుస్తారు. అంత వరకూ ఇవతల తను బాస్ని తృప్తిపరుస్తూ అనుమానాలు కలక్కుండా చూసుకోడం మంచిదేకదా?

అయితే జయకర్కు ఒక విషయంలో అనుమానమూ, కొంత భయమూ వున్నాయి.

వార్తలు చూశాక మఖన్ మూఠా పూర్తిగా చావలేదని నమ్మకం కల్గింది. అక్కడ నల్గురి శవాలే దొరికాయి. మొత్తం ఆరుగురు దాడి జరిపారు. కాబట్టి ఇద్దరు తప్పించుకున్నారు. పోలీసు కథనంకూడా ఇదే—కాకపోతే సంఖ్య విషయంలో సంశయముంది. ఆ ఇద్దరే మీనన్ని దోచుకొని కారు తగలబెట్టారు. వాళ్ళని పోలీసులు తీవ్రంగా గాలిస్తున్నారు. ఒకవేళ పట్టుబడితే వాళ్ళు నోరు విప్పకుండా వుంటారా? ఆ ఇద్దరెవరు? అందులో మఖన్ వున్నాడా?

వాళ్ళు తనని కలుసుకోడానికి ప్రయత్నిస్తారా?

ఈ సంఘటన తర్వాత వాళ్ళెలా రియాక్ట్ అవుతున్నారు? నలుగురు అనుచరులు తమవల్ల చచ్చారు. అందుకు ప్రతీకారం తీర్చుకుంటారా? లేక ఇంకా డబ్బు డిమాండ్ చేస్తారా? ఒకవేళ వాళ్ళు రియాక్ట్ అయితే ఏ క్షణంలోనైనా అల్కా దగ్గరికెళ్ళవచ్చు. అప్పుడేమవుతుంది? ఆ విషయం తనకెలా తెలుస్తుంది? తానేం చెయ్యాలి?

అల్కా ఒంటరిగా వుండకూడదు. ప్రమాదకరం....

ఇలా రెండు రోజులు ఆలోచనల తర్వాత మర్నాడు బయలుదేరడానికి పూనుకున్నాడు జయకర్.

గౌహతిలో బెంగాలీ బ్రదర్స్ అమర్, సమర్‌లు హోటల్‌లో మకాంవేసి పరిస్థితుల్ని గమనిస్తున్నారు. ఈ మిస్టరీ వాళ్ళ తల కెక్కడం లేదు. అసలు శుక్రగ్రహం షేకొన్న షాక్ నుంచి మర్నాటివరకూ కోలుకోలేదు.

ఆ సంఘటన వాళ్ళ గట్స్‌ని ఊహించని రీతిలో పటాపంచలు చేసింది. పైగా పదివేల ఎసైన్‌మెంట్ మంట గలసింది. వాళ్ళ కిడ్నాపింగ్ బిజినెస్ బెడిసికొట్టింది.

అయితే ఈ నష్టం కల్గించిన వాళ్ళని వూరికే వదిలి పెట్ట దలచలేదు. వాళ్ళూ వార్తల్ని గమనిస్తున్నారు.

మీనన్ బంగళామీద ఓ కన్ను రిజర్వ్ చేసి వుంచారు. వాళ్ళక్కడ వస్తారన్న నమ్మకంతో కాదు; బెంగాలీ బ్రదర్స్‌కి కుతూహలం ఎక్కువ నమ్మకం కంటే. మీనన్ మీద దాడిచేసినోళ్ళు తెలివిహీనులైతే అతని ఇంటిమీద కూడా దాడి జరపవచ్చని ఆలోచన, ఆశ.

ఈ ఆలోచన పోలీసులకీ రాకపోలేదు. కానీ రక్షణ ఏర్పాట్లకు అల్కా తిరస్కరించి తాను చాలా ధైర్యవంతురాలని పోలీసుల్ని నమ్మించాననుకుంది. కానీ అది పొరపాటు. జయకర్ మాటల్లో మతిలేని చేష్ట.

పోలీసు అదృశ్యనేత్రాలు మీనన్ బంగళాను గమనిస్తున్నాయి.

## 9

జయకర్‌ని చూసి అల్కా అఘాతం తిన్నట్టు అదిరి పడింది.

“ఓహ్, డార్లింగ్! ఎక్కడున్నావ్? ఏం చేస్తున్నావ్? నన్ను విడిచి—”

“షటప్! నేనెక్కడికీ పారిపోలేదు. పిరికివాడ్ననుకున్నావా?”

అతను బెడ్‌రూంలోకి దారితీసి మంచంపైన కూల బడ్డాడు. అతని ముఖం అలసటగా, నీరసంగా వుంది. అల్కా అతనిప్రక్కన చేరి చేతుల్లోకి తీసుకుంది ఆత్రుతగా.

"జయ్! ఏమయింది నీకు. బాగున్నావుకదా?"

"బాగున్నాను. బాగున్నాను. చాలా? ఇక్కడేం జరుగుతోంది?"

"ఏమీ లేదు. అంతా సవ్యంగా వుంది. నువ్వేమీ దిగులుపడకు, జయ్. నెలరోజుల్లో అంతా మనదవుతుంది. ఇక్కడ్నుంచి వెళ్ళిపోదాం. అంతా నీ చేతుల్లోనే పెడ్తాను, జయ్. నాకేమీ వద్దు. నేనే నీదాన్ని అయి నప్పుడు——"

"ఓహ్, ఇక ఆపు."

"ఏమిటి, జయ్?"

"నా గొంతు కాస్త తడుపు."

ఆమె అయోమయంగా లేచి వెళ్ళి విస్కీగ్లాసుతో తిరిగి వచ్చింది. అతను అందుకొని గటగటా తాగేశాడు.

"జయ్! ఏమిటిది? ఏమైంది? ఎందుకిలా వున్నావు?"

"నీకు మఖన్ మనుషులు కన్పించారా?"

"ఏమిటీ! మఖన్ మనుషులా!"

"అవును. నిన్ను కలిశారా?"

"నన్నా? ఎలా? వాళ్ళు చచ్చారుకదా!"

"ఇద్దరు చావలేదు."

"అయితే....నన్నెందుకు కలుస్తారు?"

"ఆ జోసఫ్ వాళ్ళని షూట్ చేసి మన ఒప్పందం గల్లంతు చేశాడు. మనం డబుల్ క్రాస్ చెయ్యమని హామీ ఇచ్చాం. కానీ ఇప్పుడదే జరిగింది—వాళ్ళ దృష్టిలో. తమ అనుచరుల చావుకి ప్రతీకారం తీర్చుకోకుండా వూరు

కోరు."

"అంటే....ఏం చేస్తారు?"

"ఎప్పుడైనా వూడిపడి మనిద్దర్నీ చంపేయవచ్చు. లేదా—"

"ఊఁ, లేదా? జయ్! ఇంకేం చేస్తారు?"

"డబ్బు గుంజవచ్చు, బ్లాక్ మెయిల్ చేసి."

"కానీ జయ్, జోసఫ్ దగ్గర రివాల్వర్ వుంటుందని మనం హెచ్చరించాం కదా?"

"అవును, హెచ్చరించాం."

"మరి వాళ్ళ చావుకి మన బాధ్యత ఏమిటి?"

"మన బాధ్యత లేదు. కానీ అది వాళ్ళు ఒప్పుకోరు. సవ్యంగా వున్నంతవరకు అన్నీ ఒప్పుకుంటారు. ఎక్కడ చిన్న పొరపాటు జరిగినా మనల్నే బ్లేమ్ చేస్తారు. అసలు తీవ్రవాదులంటే ఎవరు? సెమీ క్రాక్స్—"

ధడాలున తలుపుతోసుకొని బెంగాలీ బ్రదర్స్ జొరబడ్డారు.

వాళ్ళ వికృతరూపాల్నీ, చేతుల్లో రివాల్వర్స్‌నీ చూసి అల్కా కెవ్వుమని కేక పెట్టి బెడ్ మీంచి దూకేసింది. జయకర్ కదలకుండా బోర్లాపడుకొని కళ్ళు తేలవేశాడు.

"షడాప్. యూ లవర్ బాయ్, ఆ బ్యూటీని అరవొద్దని చెప్పు! దిసీజ్ సీక్రెట్ కాన్ఫరెన్స్" సమర్ సేన్ కంఠం కర్కశంగా పలికింది.

అమర్ సేన్ తలుపునో తాపు తన్ని గడియపెట్టాడు. అల్కాని చూసి అతను ఆశగా నవ్వాడు. ముందుకెళ్ళి ఆమె పెదాల్ని నలిపెయ్యాలనుకున్నాడు. కానీ సమర్ అది పసిగట్టి నివారించాడు.

"టేకిటీజీ, అమర్! ఇది సమయంకాదు. కమాన్.

లవర్ బాయ్! లేచి కూర్చో."

"జయ్!" అల్కా బిగ్గరగా అర్చింది, "వాళ్ళని బయటకు గెంటు! ఓహ్, త్వరగా వీళ్ళని తరుము ఇక్కడ్నుంచి."

జయకర్ తేరుకొని లేచి అయోమయంగా చూశాడు.

సమర్ నవ్వాడు. "ఏయ్, బ్యూటీ నీ లవర్ బాయ్‌కి మమ్మల్నెదుర్కొనే ధైర్యముందనుకోకు. నే నొక్క గుండు పేల్చానంటే ధైర్యంతో సహా ఎగిరి పోతాడు స్వర్గానికి."

"ఎవరు మీరు? ఇక్కడికెందుకొచ్చారు?" జయకర్ అర్చాడు కోపంగా.

అమర్ ఎడమచెయ్యెత్తి అతని మెడమీద కొట్టాడు.

అల్కా రైలింజన్ కూత వేసింది.

"నెమ్మది నెమ్మదిగా మాట్లాడు!" అమర్ అన్నాడు.

సమర్ సోఫాలో కూలబడి సిగరెట్ వెలిగించాడు. అతని ముఖం కర్కశంగా, వికృతంగా మారింది మళ్ళీ. కొన్ని క్షణాలు ఇద్దర్నీ తీక్షణంగా చూసి తలూపాడు.

"ఓ.కే. మీరన్నమాట గూడుపుఠాణి నడుపుతోంది? మీ మాటలన్నీ ఇందాక విన్నాను....నీ మొగుడ్ని ఆ ముఠా చేత చంపించి వీడితో పారిపోవాలనుకుంటు న్నావు డబ్బుతో! వెరీగుడ్. ప్రొసీడ్, బేబీ! మా కభ్యంతరంలేదు!"

"అయితే ఎందుకొచ్చావ్?"

"మీరు మా ప్లాను చెడగొట్టారు! మేం మీనన్‌ని కిడ్నాప్ చేసి ఒక పార్టీకి అప్పగించాల్సివుంది. కానీ మీవల్ల అది జరగలేదు. మా శ్రమ వృధా అయింది. తీసుకున్న డబ్బు వాపసు చెయ్యాలి. ఈ పరిహారం మీ

నుంచి రాబట్టుకోవాలని వచ్చాం."

"మీరు మీనన్‌ని కిడ్నాప్ చెయ్యాలనుకున్నారా!" జయకర్ అన్నాడు.

"చేశాం! కానీ మధ్యలో బెడిసింది. మీ ముఠా మా మీద దాడిచెయ్యడంతో వాళ్ళని చంపేసి ప్రాణాలు రక్షించుకుని బయటపడ్డాం."

"ఓహ్, అయితే ఇప్పుడేం చేస్తారు?"

"ఏమీలేదు. మీరు క్షేమంగానే వుంటారు. నేను మాటిస్తాను—నేను కోరిన మొత్తం ఇస్తే."

"ఎంత? ఎంత కావాలి?"

"పది లక్షలు సరిపోతాయి. మీరిప్పుడు కోట్లలో పడి దొర్లుతున్నారు. నేనడిగింది పదోవంతుకూడా కాదు. వారంరోజుల్లో సిద్ధంచెయ్యకపోతే, సకల లాంఛనాలతో మీ దగ్గరకి పోలీసులొస్తారు. అర్థమైనట్టేనా?"

అలేఖ్య జయకర్ ఒకర్నొకరు చూసుకొన్నారు. అలేఖ్య ధైర్యం పుంజుకొని సమర్‌తో అంది.

"అంత డబ్బు సాధ్యంకాదు. ప్రభుత్వానికి లెక్కలు చూపాలి."

సమర్ నవ్వాడు. "ప్రభుత్వానికి లెక్కలు చూపడం సమస్యకాదు, మా లెక్కం సరిగా ముట్టకపోతే గొంతు మీదకొస్తుంది సమస్య!"

జయకర్ అసహనంగా అన్నాడు, "కానీ మీరు చంపిన ముఠాలో ఇద్దరు చావలేదు. అందుకు మీదే బాధ్యత! వాళ్ళిక్కడకొచ్చి మమ్మల్ని బ్లాక్ మెయిల్ చేయవచ్చు. కాబట్టి మీ మొత్తం కొంత తగ్గించుకోవాలి."

"షడాప్! దిక్కుమాలిన ఎత్తులు వెయ్యక!"

సమర్ కసిరాడు, "వాళ్ళు మీ దారికి రాకుండా మేం చూసుకుంటాం. అందుకయ్యే ఫీజు ఈ పది లక్షల్లో నే సర్దేసాం. ఏమంటావు అమర్?"

"గుడ్ అయిడియా బ్రదర్."

బయట అడుగుల అలికిడితో బాటు తలుపుమీద చప్పుడయింది.

అందరూ ఉలికిపడి చూసుకున్నారు. అందరి ముఖాల్లో కలవరం స్పష్టంగా కనపడింది. ఎవరూ కదల్లేకపోయారు.

మళ్ళీ అదే చప్పుడయింది.

ఎవరిలోనూ చలనం లేదు.

మరోసారి చప్పుడు. టక్—టక్—టక్—

తలుపు తడుతోందెవరు?

"ఎవరూ?" అర్చింది అల్కా గొంతు చించుకుని.

"వాళ్ళొచ్చేసి వుంటారు...." అన్నాడు సమర్.

"పోలీసులా....?" జయకర్ గొణిగాడు.

అమర్ ఒక్క దూకులో రివాల్వర్‌తో వెళ్ళి తలుపు తీశాడు.

ముఖంమీద ముష్టిఘాతం పడ్డంతో వెనక్కి వచ్చి పడ్డాడు.

మీనన్ లోనికి చూసి, "వెరీగుడ్! మీరంతా ఒకే చోట వున్నారన్నమాట?" అన్నాడు.

## 10

అల్కా వెర్రికేక పెట్టి స్పృహ తప్పింది.

జయకర్ భయంతో కొయ్యబారిపోయాడు. సమర్ తెరిచిన నోరు మూయలేదు. అమర్ నేలమీంచి బెదుకుతూ లేచి నిలబడ్డాడు.

మీనన్ పైనుంచి క్రింది దాకా తెల్లగా మెరిసి

పోతున్నాడు. అతని వొళ్ళంతా కట్లున్నాయి. తెల్లటి లాల్చీ, ధోవతిలో వున్నాడు. కాళ్ళకి తోలుచెప్పులున్నాయి. చేతిలో సిగరెట్‌తో భారంగా కదులుతూ లోనికి వచ్చాడు.

అతని వెనుక జోసఫ్ నీడలా కదిలివచ్చాడు. అతనికీ వొళ్ళంతా బ్యాండేజిలున్నాయి. కాకీ డ్రెస్ లో వున్నాడు. చేతిలో రివాల్వర్‌తో చురుగ్గా చూస్తున్నాడు.

"యూ బ్లడీ బాస్టర్డ్స్. మీ చేతుల్లో గొట్టాలిలా పారెయ్యండి!" అర్చాడతను తీవ్రంగా.

బెంగాలీ బ్రదర్స్ తేరుకొని ఒకర్నొకరు చూసుకున్నారు. రహస్యంగా సైగలు చేసుకొను వూహించని విధంగా జోసఫ్ మీదకి విరుచుకుపడ్డారు. ఆ అదను చూసుకుని జయకర్ బయటకురబోయాడు.

కానీ జోసఫ్ అంతకంటే వేగంగా కాలెత్తి అమర్ పొట్టమీద ఫెడీమీద తన్నుతూనే, రివాల్వర్ పిడితో జయకర్ తలమీద బాదాడు. జయకర్ తలపట్టుకొని కూలబడ్డాడు. అమర్ వెనక్కి విరుచుకుపడ్డాడు.

సమర్ ఆవేశంగా రెండు చేతులతో జోసఫ్ గొంతు పట్టుకోబోయాడు. కానీ ముఖంమీద రివాల్వర్ బట్ ఖంగుమనడంతో స్ప్రింగ్ లా తన్నుకుపోయాడు.

"టేక్ కేర్! వెధవల్లారా, మీ తోలు వొలిచి కోటు కుట్టించుకుంటాను."

జోసఫ్ వాళ్ళదగ్గరికెళ్ళి రివాల్వర్స్ లాక్కున్నాడు.

అంతా భయంగా, నిస్సహాయంగా చూడసాగారు.

అల్కా ఇంకా ఫ్రిజ్ దగ్గర బోర్లాపడివుంది.

మానస్ తేలిగ్గా నిట్టూర్చి సిగరెట్ వెలిగించి

సోఫాలో కూర్చున్నాడు.

"శభాష్, జోసఫ్! ఇక ప్రమాదం లేదు. ఉష్ష్.... ఈ ఉక్కలో మీ రెలా వుంటున్నారు? వెళ్ళి ఏ.సి. మీట నొక్కు."

జోసఫ్ వెళ్ళి ఏ.సీ. ఆన్ చేశాడు. బెంగాలీ బ్రదర్స్ లేచి బట్టలు దులుపుకోసాగారు. జయకర్ అలాగే కూర్చుని మీనన్ని తీక్షణంగా చూశాడు. మీనన్ నవ్వాడు.

"మీరు—మీ రెలా వచ్చారు?" జయకర్ గొణిగాడు.

మీనన్ పెద్దగా నవ్వి వూరుకున్నాడు.

బెంగాలీ బ్రదర్స్ అతన్ని కఠినంగా చూశారు.

"డామిట్! సమాధానం చెప్పవేం?" సమర్ కసిరాడు.

మీనన్ ఆ ఇద్దర్నీ ఏవగింపుగా చూశాడు.

"సమాధానం కావాలా మీకు? ఆల్ రైట్ దానితో బాటు తగిన శాస్తి కూడా లభిస్తుంది. మీరు—మీరు మమ్మల్ని చంపడానికి ప్రయత్నించారు. మేం—మే మిద్దరం చిటికెలో తప్పించుకుని బయటపడ్డాం. మీకు తగిన బుద్ధి నేర్పాలని సమయం కోసం ఎదురుచూసాం. ఇప్పుడిలా వచ్చాం. ఇదే సరయిన సమయం. చోటు.

"యూ థగ్స్! ఏ ప్రయోజనమాశించి మమ్మల్ని కిడ్నాప్ చెయ్యాలనుకున్నారు? డబ్బు కోసమా? ఎవరి నుంచి గుంజుతారు? నా డబ్బుమీద ఎవరికీ హక్కు లేదు. ఎవరూ ఇవ్వలేరు. కాబట్టి మీరు డబ్బుకోసం ఈ పని చెయ్యలేదన్పిస్తోంది. మరో పార్టీ కోసం చేశారు. మీ ముఖాలు చూస్తే తెలుస్తోంది—కిరాయి క్రూక్స్ అని. వెల్, ఆ పార్టీ ఎవరు?"

"అది బిజినెస్ సీక్రెట్, మై డియర్ ఓల్డుమాన్."

"నేనడిగింది కక్కకపోతే మీరూహించని గతి పట్టిస్తాను."

"పోలీసులకి పట్టిస్తావు, అంతేనా?"

"శిక్షలు నేనే స్వయంగా విధిస్తాను. నాతో సహకరించకపోతే జోసఫ్ మీ కాళ్ళలో షూట్ చేస్తాడు. అప్పటికీ మొండికేసే కత్తిపెట్టి తొడలు చీరేస్తాడు. ఇంకా దారికిరాకపోతే మీ గోళ్ళు పీకేస్తాడు. జోసఫ్ ప్రొఫెషనల్. మీ అమెచూర్ వేషాలు కట్టిపెట్టి చెప్పినట్టు వినండి."

"మా రిప్యుటేషన్ గురించి నీకు తెలియదు. మేం"

షూట్ అన్నాడు మీనాన్.

జోసఫ్ చేతిలో రివాల్వర్ పేలింది. కానీ బుల్లెట్ గురితప్పి గోడలో దూరింది. అది ట్రిక్. వాళ్ళ సదరగొట్టే చిట్కా.

అల్కా ఆ శబ్దానికి తటాలున లేచి కూర్చుంది. బెదురు చూపులు చూసి మళ్ళీ 'కెవ్వు'మనబోయింది. ఆమె దవడ పగిలేలా చేత్తో కొట్టాడు జోసఫ్.

జయకర్ వొళ్ళు చల్లబడింది.

బెంగాలీ బ్రదర్స్ కంగుతిని అలాగే నిలబడివున్నారు. ఏ క్షణాన శుక్రగ్రహం ఢీకొందో, అప్పుడే వాళ్ళ గట్స్ ఉఫ్‌మంటూ ఎగిరిపోయాయి.

"మేం మిమ్మల్ని సందీప్ సన్యాల్ కోసం కిడ్నాప్ చెయ్యాలనుకున్నాం" అన్నాడు సమర్ నెమ్మదిగా.

మీనన్ కళ్ళు విశాలమయ్యాయి.

"సందీప్ సన్యాల్? కలకత్తా కాంట్రాక్టరా?"

"అవును, సర్."

"ఓహ్. అతను చచ్చాడు కదా?"

"చచ్చాడా! ఎప్పుడూ?"

"నిన్న పేపర్లో చూశాను. మొన్న రాత్రి గుండె ఆగి చచ్చాడు."

"గాడ్! మాకు తెలియదు!"

"అతనెందుకీ పని చెయ్యమన్నాడు?"

"తెలియదు, సర్. మిమ్మల్ని కిడ్నాప్ చేసి మరొకరికి అప్పగించమన్నాడు."

"ఎవరికి?"

"అదీ తెలియాదు, సర్. ఘూల్‌పూర్ పొలాల్లో హెలికాపర్‌లో దిగుతారని చెప్పాడు."

"హెలికాప్టర్? గూఢచారులా?"

"సారీసర్. వాళ్ళెవరో మాకు తెలియదు."

"సరే, నా శత్రువు చచ్చాడు. నాకిపుడు ప్రమాదం లేదు. ఆ వ్యవహారమంతా తర్వాత తెలుసుకొంటాను."

"మీరెలా బ్రతికి వచ్చారు, ఓమ్!" అల్కా అంది బలహీనంగా.

ఆమెని మీనన్ ఏవగింపుగా చూశాడు.

"అది పెద్ద కథ. క్లుప్తంగా చెప్తాను, టైము లేదు. ఈ క్రూక్స్ మమ్మల్ని హైవేమీద ఆపి, పెద్దమనుషుల్లా లిఫ్ట్ కావాలన్నారు. తాము బెంగాలీలమని చెప్పి, ఎవరో తరుముకొస్తున్నట్లు నటించారు. జోసఫ్ వాసన పసి గట్టాడు. కానీ, నేను పొరబడ్డాను. వెంటనే కారెక్కించుకొని బయలుదేరమన్నాను. ఈ ఇద్దర్లో ఒకడు ముందు సీట్లో, మరొకడు వెనుక నా ప్రక్కన కూర్చున్నాడు.

"కారు కొంత దూరమైనా వెళ్ళిందో లేదో, చీకట్లో

ఎవరికీ కన్పించని విధంగా ముందుసీట్లో వాడు జోసఫ్ తలమీద దేనితోనో కొట్టాడు. జోసఫ్ ముందుకు పడ్డంతో కారు అదుపు తప్పింది. నేను గట్టిగా అర్చాను. ఇంతలో నా పక్కనతను నన్నుకూడా అలాగే కొట్టాడు. కళ్ళుతిరిగి పడిపోయాను."

"అప్పుడేమైంది?"

"ఏమో. ఆ తర్వాత ఏం జరిగిందో నాకు తెలియదు. కానీ, ఒక్కసారిగా ఏవో చప్పుళ్ళు విన్పిస్తే కళ్ళు తెరిచాను. నా ఒళ్ళంతా నొప్పులు. కదల్లేకపోయాను. కారుమీదా క్రిందా ఏవో పడుతున్నాయి. బాంబులవి! వాటితోబాటు షాట్స్ విన్పిస్తున్నాయి. కార్లో నేను రాయిలా వుండిపోయాను. ఒళ్ళంతా రక్తం కారుతోంది. దిగి వురకాలనుకున్నాను. సాధ్యంకాలేదు....

హఠాత్తుగా ఆ శబ్దాలన్నీ ఆగిపోయాయి. నేనలాగే ఫుట్‌బోర్డుమీద పడివున్నాను. ఇంతలో బయట ఏదో కారాగడం, వెంటనే స్టార్టయి వెళ్ళిపోవడం విన్పించింది. అరవాలనుకున్నాను. అదీ సాధ్యం కాలేదు. అప్పుడే జోసఫ్ నన్ను పట్టి బయటికి లాగాడు. అతనికీ ఒళ్ళంతా గాయాలున్నాయి. మేం ఇంకా ఎలా బ్రతికి వున్నామో తెలియదు. ఈ క్రూక్స్ యెక్కడ పారిపోయారో అర్థంగాలేదు. అంతా సద్దుమణిగింది...."

"అప్పుడేం చేశావు?" అసుర్ అడిగాడు కుతూహలంగా.

"జోసఫ్ టార్చితో పరిసరాలు చూసి పరిగెత్తి వచ్చాడు. రోడ్డుకవతల శవాలున్నాయట. ఇద్దరం వెళ్ళి చూశాం. అయిదు ఆకారాలు కన్పించాయి. కానీ ఒకడు చావలేదు. వాడు బ్లూ నిక్కరులో వున్నాడు. అతని స్థితి

భయంకరంగా వుంది. కొన ప్రాణాలతో వున్నాడు. అతడు మమ్మల్ని చూసి పిల్చాడు. నా చేతుల్లో ప్రాణాలు వదులుతూ అంతా చెప్పేశాడు. అప్పుడే నాకు నీ వ్యవహారం తెలిసివచ్చింది—"

"మరి.... ఈ రెండు రోజులెక్కడున్నారు?" అడిగింది అలాక్—

"నా ఆస్తికోసం నువ్వెంతకు తెగించావో, ఎంత విశ్వాసఘాతం తలపెట్టి ప్రేమకలాపాలు సాగిస్తున్నావో అప్పుడు తెలిసి నిన్ను నరికి పోగువేయాలనుకున్నాను. కానీ జోసఫ్ నన్ను శాంతపర్చాడు. మీకు బుద్ధిచెప్పే సరైన ఉపాయం క్షణంలో ఆలోచించి చెప్పాడు. ఒప్పుకున్నాను. వీడి రాతి కళ్ళలో మీరు క్రూరత్వమే చూస్తారుగానీ, గుండె పొరల్లో దాగివున్న విశ్వాసం, విధేయత కన్పించదు."

"మీరేం చేశారసలు!"

"మేం చనిపోయినట్లు మీరు నమ్మాలి. నా సంపద చిక్కిందన్న ఆనందంలో మజా చేసుకొనే సమయంలో ఎంచక్కా నడచి వచ్చి—వెల్, మేం చచ్చామని లోకం నమ్మింది. కానీ చావలేదు. మా చావు ఫేక్. జోసఫ్ నాకా ఉపాయం చెప్పి రంగంలో కూకాడు.

"రెండు శవాలు కావాలి మాకు. అక్కడ నాలుగు శవాలకి బుల్లెట్ గాయాలున్నాయి. అవి వుండకూడదు. బ్లూ నిక్కర్ మనిషికి లేవు. వాడు బాంబు తగిలి చచ్చాడు. వెంటనే నా దుస్తులు వాడికి తొడిగి, వాడివి నేను వేసుకున్నాను. జోసఫ్ మరో శవంకోసం గాలించాడు. అప్పుడు దూరంగా ఒక వంటరి శవం కన్పించింది. దానికి బుల్లెట్ గాయాల్లేవు. నోట్లో నురుగుతో

అసహ్యంగా వుంది. పాము కరిచి వుంటుంది. జోసఫ్ వెంటనే ఆ శవంమీద తన దుస్తులు తొడిగాడు."

"అప్పుడేమైంది."

మీనన్ నవ్వేడు. "ఆ రెండు శవాల్ని కార్లో మోసి, మా సామానంతా తీసేసుకున్నాం. కారు టాంక్ పగిలి రోడ్డుమీద పెట్రోలు నుడుగుకట్టింది.... జోసఫ్ అగ్గిపుల్ల గీసి అందులో విసిరాడు. అంతే, గుప్పున మంటలులేచి కారుకు నిప్పంటుకుంది.

"దాడిలో అది జరిగి వుంటే ఆ శవాలకు బదులు మేం సజీవంగా కాలిపోయేవాళ్ళం. కానీ దేవుడి కృపవల్ల అది జరగలేదు. దేవుడు మమ్మల్ని కాపాడాడు. దేవుడు దీనుల్ని కాపాడతాడు.

"మేం అక్కడనుంచి పరుగుతీశాం. పారిపోయాం. నా ఎస్టేట్‌కి చేరుకొని డాక్టర్‌ని పిల్చి రహస్యంగా చికిత్స పొందాం.

"ఈ రెండు రోజులూ ట్రీట్‌మెంట్ పొందుతూ, మిమ్మల్ని జాగ్రత్తగా గమనిస్తున్నాం. ఎస్టేట్ ఎక్జిక్యూటివ్ ఈ ఇంటిమీద—అల్కా మీద నిఘా వేశాడు. వీడు-ఈ జర్నలిస్టు బంగళాలో ప్రవేశించినట్టు నాకు ఫోన్ వచ్చింది. వెంటనే బయలుదేరి వచ్చేశాం. అప్పుడే ఈ క్రూక్స్ లోని కెళ్తున్నారు. వీళ్ళ వెనుక మేం వచ్చాం. వెల్, గది బయట వుండి మేం అంతా విన్నాం."

"కానీ, మీరిపుడు ప్రపంచానికెలా దర్శనమిస్తారు?" అమర్ అడిగాడు ఇంకా కుతూహలంగా.

మీనన్ నవ్వాడు. "నా దర్శనం అందర్నీ విస్మయపరుస్తుంది. పోలీసులకి తీవ్రమైన షాక్. నా సాహసానికి ముక్కుమీద వేలేసుకొంటారు....అంతకంటే ఏంకావాలి!

బ్రహ్మాండమైన పబ్లిసిటీ. కదూ?"

"అయితే మా గురించి ఏమిటి?" సమర్ అడిగాడు.

"మీతో నాకు చాలా పని వుంది" అన్నాడు మీనన్, "ఒక విధంగా మీరు నా ప్రాణాలు కాపాడారు. మీరు కిడ్నాప్ చెయ్యకపోతే ఆ ముఠా చేతిలో మేం చచ్చేవాళ్ళం. మీరు వాళ్ళని చంపి మమ్మల్ని రక్షించారు."

"అయితే ఏం చేస్తారు?"

"ప్రతిఫలం చెల్లిస్తాను. కానీ మీరు తలపెట్టబోయిన పనికూడా దృష్టిలో వుంచుకుంటాను. నేను చెప్పినట్టు మీరు చేసే పోలీసు బెడద వుండకుండా చూస్తాను. అంతేగాక మీకు జోసఫ్ భయం కూడ వుండదు."

"ఏం చెయ్యాలి?"

మీనన్ అల్కాని, జయకర్ని చూశాడు కఠినంగా.

"ఆ ఇద్దర్ని మీరిద్దరు శిక్షించాలి."

అల్కా ఉలికిపడి జయకర్ని చూసింది. జయకర్ బొమ్మలా వున్నాడు.

"విన్నారా? వాళ్ళని శిక్షించాలి. ఇక్కడనుంచి తరిమి తరిమి కొట్టాలి. లేవకుండా కూర్చోకుండా చావగొట్టాలి. బట్టలు వొలిచి అడవిలో వదలిపెట్టాలి. మీకు తోచిన విధంగా చిత్రహింసలు పెట్టాలి. కాని చావకూడదు. అనుక్షణం బ్రతుకు దుర్భరం చెయ్యండి. ఎవరి సహాయమూ అందదొరక్కూడదు. అలమటించి పోవాలి. ఆ నరకం భరించలేక వాళ్ళే ఆత్మహత్య చేసుకోవాలి. అదే వీళ్ళకి సరైన శిక్ష. అప్పుడే నాకు సంతృప్తి—"

అల్కా ముందుకు పోకి మీనన్ని పట్టుకుంది.

"మీనన్. నాకీ అన్యాయం చెయ్యకు."

మీనన్ విదిల్చికొట్టాడు. ఆమె వెళ్ళి జయకర్ మీద

పడింది. సమర్ ఆమె జుట్టు పట్టి లేపాడు. ఆమె కెవ్వుమంది.

"బయటికి లాగండి వీళ్ళని" అర్చాడు మీానన్, "ఈ పని చేస్తే మీకు ఇరవై వేలిస్తాను. వాళ్ళతో కుమ్మక్కు అయ్యారంటే మీరు తలపెట్టిన హాని గుర్తుకొస్తుంది.... అప్పుడు జోసఫ్ మిమ్మల్ని యెక్కడున్నా గాలించి నరికి పోగులేస్తాడు. అర్థమైందా?"

"మమ్మల్ని పూర్తిగా నమ్మవచ్చు, సర్. మేం బెంగాలీ బ్రదర్స్ అని చాలా—"

"డామిట్! మీారెవరైతే నాకేమిటి? చెప్పినట్టు చెయ్యండి."

జోసఫ్ బెంగాలీ బ్రదర్స్ మీాదకి రివాల్వర్స్ విసిరి వేశాడు.

సమర్ రివాల్వర్ని అందుకొని అమర్ని చూశాడు. "కమాన్ లవర్ బాయ్, స్క్రామ్!"

అమర్ జయకర్ మెడపట్టి లాక్కెళ్ళాడు. జయకర్ ఎదురుతిరిగి పొట్టలో కుమ్మాడు. అమర్ నిలదొక్కుకొని రెండు చేతులు బిగించి దవడకింద కొట్టాడు. మరోదెబ్బ ముఖంమీాద వెయ్యడంతో జయకర్ ముక్కునుంచీ, నోటినుంచీ రక్తం చిమ్మింది. క్రింద పడ్డంతో అమర్ కాలర్ పట్టి లేపి వెనుకనుండి నడుముమీాద చాచి తన్నాడు.

జయకర్ నడవలో దొర్లుకుంటూ వెళ్ళి మెట్లమీాంచి జారిపడ్డాడు. అతని గావుకేక బంగళాను కదిలించివేసింది.

అల్కా ముఖంలో నెత్తురుచుక్క లేదు. ఆమె ముందుకు దూకి మీానన్ని పట్టుకుంది.

"మీానన్! నన్ను క్షమించు. మళ్ళెప్పుడూ ఇలా చెయ్యను. నాకీ అన్యాయం చెయ్యకు. నన్ను వీళ్ళపరం

చెయ్యకు."

మీనన్ జాలిగా నవ్వాడు: "నే నేం చేశాను? అంతా నువ్వే కోరి తెచ్చుకున్నావు. నన్ను చంపడానికి తెగిం చావు, నేను చచ్చాననుకున్నావు. మళ్ళీ ఈ సెంటి మెంట్స్ ఎందుకు? నేనిపుడు పునర్జన్మ ఎత్తాను: కళ్ళు తెరిచాను. నీతో నాకు గత జన్మలోనే చెల్లిపోయింది.... నువ్వెవరో నా కిపుడు తెలియదు, వెళ్ళిక్కడ్నుంచి."

"మీనన్! ప్లీజ్—ప్లీజ్—ప్లీ—"

"షడాప్!" సమర్ అర్చాడు అసహనంగా. "కమాన్, బేబీ! అవతల నీ లవర్ బాయ్ వెయిట్ చేస్తున్నాడు."

అల్కా గింజుకుంటూ, తన్నుకుంటూ ఏడుస్తోంటే; సమర్ వెటకారంగా నవ్వుతూ లాక్కెళ్ళాడు.

బయట మరోసారి జయకర్ కేక, వెంటనే అల్కా అరుపు విని మీనన్ నవ్వుకున్నాడు. పగలబడి నవ్వాడు. మెలికలు తిరుగుతూ పడీపడీ నవ్వసాగాడు....

అతన్ని చూసి జోసఫ్ గాభరా చెందాడు. అతని దుస్థితికి గుండె చెదిరింది. ముందుకు దూకి అనునయంగా అతన్ని పట్టుకొని శాంతపర్చాడు.

"బాస్! ఓహ్, బాస్! రిలాక్స్. ప్లీజ్ రిలాక్స్, బాస్! యూ మస్ట్ రిలాక్స్. ఇప్పుడేమైందని? అంతా సవ్యంగా జరిగింది...."

"అంతా సవ్యంగా జరిగింది, వాళ్ళని అరెస్టు చేశాం" అన్నాడు పోలీస్ కమీషనర్, తన బలగంతో గదిలోకొస్తూ.

—:ఐపోయింది:—

# ప్రాణానికి ప్రమాదం!

## ప్రతాప రవిశంకర్

"నా పేరు సునీత" మృదువుగా చెప్పిందామె.

రెండు నిముషాల క్రితమే ఆమె నా గదిలోకి వచ్చింది. ఆమె చేతిలో ఖరీదయిన హాండు బ్యాగ్ వుంది. అంతే కాదు. ఆమె దుస్తులు, అలంకరణ ఆమె బాగా ధనికురాలనే విషయాన్ని వెల్లడిస్తున్నాయి.

"మీరు కారులో వచ్చారా?" అడిగాను.

"లేదు. టాక్సీలో వచ్చాను" అన్నది.

"మీకు కారు లేదా?"

"ఉన్నది. కాని కొన్ని కారణాలవల్ల నేను టాక్సీలో రావలసి వచ్చింది" అన్నది చిన్నగా.

"చెప్పండి. నావల్ల మీకు ఎటువంటి సహాయం కావాలి?" సిగరెట్టు ప్యాక్ అందుకుంటూ అడిగాను.

ఆమె వెంటనే మాట్లాడలేదు. హ్యాండుబాగ్ లోనించి కర్చీఫ్ బయటకు తీసింది. ఒక్కసారిగా ఖరీదయిన సెంటు వాసన ఆ గదినంతటినీ ఆక్రమించుకుంది.

కర్చీఫ్‌తో మొహం తుడుచుకుని "మంచినీళ్ళు కావాలి" అన్నది.

లేచి నిలుచున్నాను.

ఫ్రిజ్ లోనించి వాటర్ బాటిల్ తీసి ఆమెకు ఇచ్చాను. టేబిల్ మీద వున్న గ్లాసులోకి నీళ్ళువంచుకుని గబగబా తాగింది.

తర్వాత "థాంక్స్" అన్నది.

"ఇప్పుడు చెప్పండి" అన్నాను ఆమె కదలికలను గమనిస్తూ.

"నన్ను ఎవరో హత్య చెయ్యాలనుకుంటున్నారు జగదీష్ గారూ" అన్నది.

ఆమె కళ్లలో భయం నాకు స్పష్టంగా కనిపించింది.

"మిమ్మల్నా!" అన్నాను.

"అవును. నన్నే"

"ఎవరో మీకు తెలుసా?" అడిగాను.

"తెలీదు."

"పోనీ యెందుకు హత్య చెయ్యాలనుకుంటున్నారో చెప్పగలరా?"

ఆమె విషాదంగా నవ్వింది. నిమిషం తర్వాత "నేను అందమైన దాన్నని మీరుకూడా ఒప్పుకుంటారనుకుంటాను. అంతేకాదు. నేను ధనవంతురాల్ని. ఈ రెండు కారణాల వల్ల నన్ను హత్య చెయ్యాలనుకుంటున్నారు" అన్నది.

"ధనవంతులు, అందమైన వాళ్ళు హత్య చెయ్యబడతారని మీరనుకుంటున్నారా?" అడిగాను.

"కాదు.... నాలాంటి కొంతమంది."

"వివరంగా చెప్పండి" అన్నాను సిగరెట్టును యాష్ ట్రేలో నొక్కి.

"నా తండ్రి పేరు రంగారావు....అయితే నేను ఆయన దగ్గర పెరగలేదు. మా జగన్నాథం బాబాయి దగ్గర పెరిగాను. ఆయనకు పిల్లలు లేరు. బాగా ధనవంతుడు. ఇప్పుడు నేను అనుభవిస్తున్న ఆస్తంతా ఆయనిదే. ఏడాది క్రితం ఆయన చనిపోయాడు. తన ఆస్తినంతా నా పేరున రాశాడు. అంతేకాదు. మా ఎస్టేట్ మేనేజర్ మోహన రావుకీ నాకూ పెళ్ళి కూడా చేశాడు. మోహనరావు నేను ప్రేమించుకున్నాం. పెళ్ళి చేసుకోవాలనుకున్నాం. ఈ విషయం నేను మా బాబాయికి చెప్పాను. ఆయన కాదన లేదు. వెంటనే పెళ్ళి జరిపించాడు. తర్వాత మూడు నెల లకు ఆయన హార్ట్ ఎటాక్‌తో పోయాడు. అప్పటినించే నాకు కష్టాలు మొదలైనాయి" అన్నది సునీత విచారంగా.

వెంటనే నేను మాట్లాడలేదు.

ఆలోచిస్తూ వుండిపోయాను.

సాధారణంగా డబ్బు వున్నవాళ్ళకే అన్నీ ఇటువంటి ప్రమాదాలు వస్తూ వుంటాయి. అందమైన ఆడది. అంతే కాకుండా ధనవంతురాలు. ఎవరి కన్నయినా ఆమె మీద పడకుండా వుండదు. అయితే సునీతకు వివాహమయింది. మరి అటువంటప్పుడు ఆమెకోసం, ఆమె ఆస్తికోసం ప్రయత్నం చేసేదెవరు?

"చెప్పండి సునీతగారూ....మిమ్మల్ని హత్య చెయ్యవల సిన అవసరం ఎవరికి వుంది? ఎందుకు వుంది? మీరు ఎవర్ని అనుమానిస్తోన్నారు?"

"నేను నలుగుర్ని అనుమానిస్తోన్నాను జగదీష్‌గారూ. ఆ నలుగురికే నన్ను హత్య చేసేంతటి కారణాలు వున్నాయి."

"ఆ నలుగురు అనుమానితులు ఎవరు? చెప్పండి" మరో

సిగరెట్టు వెలిగిస్తూ అన్నాను.

"మొదటి అనుమానితుడు నా భర్త మోహనరావు. ఇక అతను నన్ను హత్య చేస్తాడనుకోవటానికి వున్న కారణాలు చెబుతాను. పెళ్ళయినతర్వాత మా బాబాయి చనిపోయిన తర్వాత ఆయన ప్రవర్తనలో బాగా మార్పు వచ్చింది. మా బాబాయి పోయిన రెండు నెలలకు అసలు విషయం తెలిసింది.

ఆయనకు ఇంకో ఆడదానితో అక్రమ సంబంధం వుంది. ఇంతకు ముందు ఎప్పుడో ఇద్దరూ ప్రేమించుకున్నారుట. అతడు ముందుగా ఈ విషయాన్ని నాకు చెప్పలేదు. తర్వాత ఇంట్లో డబ్బు తీసుకుని వేలకువేలు దానికి ఇస్తూ వుంటే నాకు విషయం తెలిసింది. నాకు బాగా కోపం వచ్చింది. ఆయనతో గొడవపడ్డాను. ఇకనించీ డబ్బు తీసుకువెళ్ళి దానికి ఇవ్వటానికి వీల్లేదని చెప్పాను. ఆయన నా మాటలను లక్ష్యపెట్టలేదు. చివరికి ఆయన చేతికి డబ్బు అందకుండా కట్టుదిట్టం చేశాను. దాంతో ఆయనకు నామీద కసి పెరిగింది. ఒక రోజు నా చెంపమీద కొట్టాడు. నేను సహించలేకపోయాను.

ఇక తనతో కాపురం చెయ్యననీ విడాకులివ్వమనీ అడిగాను. ఆయన ఒప్పుకోలేదు. ఈ ఆస్తి మరొకడికి వెళ్ళటానికి వీల్లేదన్నాడు. అప్పటినించి మేమిద్దరం వేరుగానే వుంటున్నాము. పేరుకు మాత్రం భార్యాభర్తలం. అంతే. ఆయన నన్ను హత్యచెయ్యాలనుకుంటున్నాడని వూహించటానికి ఈ కారణాలు చాలనుకుంటాను" అన్నది సునీత మాట్లాడటం ఆపి.

తల వూపాను ఆమె చెప్పిన విషయాలగురించి ఆలోచిస్తూ. ఆమె భర్త మోహనరావుకు భార్యను హత్యచేసే

అవసరం వుంది.

"రెండో అనుమానితుడు ఎవరు?" అడిగాను.

"మా బావ సుధాకర్. ఆయన వయస్సు నలభై వుంటుంది. ఆయన మొదటినించీ నన్ను కబళించేలా చూస్తూ వుండేవాడు. కాని మా అక్కయ్య ఆయన ఆటల్ని సాగనివ్వలేదు. ఆయన గుణం దానికి తెలుసు. అందుకే అది ఎప్పుడూ ఆయనతో కలిసి నా ఇంటికి రాలేదు. దానికి ఏడాది క్రితం కాన్సర్ వచ్చింది. మంచం పట్టింది. దాంతో మా బావకు స్వేచ్ఛ వచ్చింది. అప్పు డప్పుడు మా ఇంటికి రావటం మొదలుపెట్టాడు.

మా అక్కయ్య మందులకు కావాలంటూ నా దగ్గర డబ్బు తీసుకువెళ్ళటం మొదలుపెట్టాడు. మొదట్లో ఆయన నా దగ్గర తీసుకున్న డబ్బును అక్కయ్య మెడి కల్ ట్రీట్‌మెంటుకే ఖర్చుపెడుతున్నాడని అను కున్నాను. కాని తర్వాత ఆయన ఆ డబ్బుతో ఖుషీ చేస్తున్నాడని తెలిసింది. వెంటనే ఆయనకు డబ్బు లివ్వటం ఆపేశాను. ఇలా నన్ను మోసంచేసినందుకు బాగా తిట్టాను. దాంతో మా బావకు నామీద బాగా కోపం వచ్చింది. నేను అనుభవిస్తున్న ఆస్తిలో మా అక్కయ్యకు కూడా భాగంవుందనీ, దాన్ని అక్కయ్యకు రాసివ్వమనీ అడిగాడు. ఆ ఆస్తి మా బాబాయి నాకు ఇచ్చిపోయాడనీ అందులో చిల్లిగవ్వకూడా ఎవ్వరికీ రాదు పొమ్మన్నాను. ఎలా రాదో చూస్తానని మండిపడుతూ వెళ్ళిపోయాడు.

ఆ తరువాత వారం రోజులకే మా అక్కయ్య చని పోయింది. అది పోయిన పదిరోజులకు మా బావ నన్ను కలుసుకున్నాడు. పదివేలు ఇవ్వమనీ ఏదో బిజినెస్

చేస్తాననీ అన్నాడు. నేను రూపాయ కూడా ఇవ్వనని చెప్పి పంపించాను. అయితే ఇంత ఆస్తిని నువ్వు ఎలా అనుభవిస్తావో చూస్తానని వెళ్ళిపోయాడు" చెప్పింది.

అప్పటికే పైన ఫ్యాను తిరుగుతున్నా ఆమె ముఖానికి చెమటపట్టింది. ఆమె మరోసారి కర్చీఫ్ తీసి మొహాన్ని తుడుచుకుంది.

' సునీత మొహం చూస్తే నాకు జాలి కలిగింది. నిజంగా ఆమె ప్రాణానికి ప్రమాదం వస్తోంది. ఆమె ఎటువంటి పరిస్థితుల్లో ఇరుక్కునిపోయిందో అర్థమయింది.

బాయ్ ట్రేలో రెండు బ్రూ కాఫీలు తీసుకొచ్చాడు.

ఇద్దరం తాగాము.

ఆమెకు వక్కపొడి ఆఫర్ చేశాను. ఆమె తీసుకో లేదు. నేను సిగరెట్ వెలిగించాను.

పొగవదులుతూ "మిగిలిన ఇద్దరు అనుమానితులు ఎవరు?" అన్నాను.

"చెబుతాను. మూడో అనుమానితుడు ఎవరూ కాదు. నా సొంత తమ్ముడు సుధీర్. వాడు ఇంటర్ నాలుగుసార్లు ఫెయిలయ్యాడు. ఆ తర్వాత పాతికేళ్ళు వచ్చినా దాన్ని పూర్తి చెయ్యలేకపోయాడు. వాడికిలేని దురలవాటులేదు. అన్నీ వున్నాయి. వాడికి సొంత ఖర్చుకి నెలకు రెండు వేలు కావాలి. వాడు డబ్బుకోసం ఎప్పుడూ నన్ను పీడించేవాడు. అప్పుడప్పుడు ఇస్తూ వుండేదాన్ని. కాని ఈమధ్య ఇవ్వటం మానేశాను.

చివరికి వాడు నా దగ్గరినించి డబ్బు గుంజటం కోసం ఎంతకు తెగించాడంటే ఎప్పుడో ఓసారి నేను స్నానం చేసివచ్చి బట్టలు కట్టుకుంటున్నప్పుడు లంగా, బ్రాతో వున్న నా ఫోటోను తీశాడు. దాన్ని నాకు చూపించి తను

అడిగినప్పుడు డబ్బు ఇవ్వకపోతే ఆ ఫోటోను పత్రికల్లో అచ్చువేయిస్తానని నన్ను బ్లాక్ మెయిల్ చెయ్యబోయాడు.

నాకు ఒళ్ళుమండి వాడ్ని చెప్పుతో కొట్టి ఫోటోను పత్రికల్లో అచ్చువేయించుకోమని చెప్పాను. ఇదీ జరి జరిగింది. వాడికీ నామీద కోపం కసి వున్నాయి. వాడికి కూడా నన్ను హత్యచెయ్యగల కారణం వుందని అనుకుం టున్నాను. ఏమంటారు?" అన్నది నా కళ్ళలోకి చూసి.

తలవూపాను నిజమేనన్నట్టు.

సొంత తమ్ముడే డబ్బు కోసం అలా చేశాడంటే ఆశ్చర్యం కలిగింది.

"ఇక నాలుగో అనుమానితుడు రామరాజు. డిగ్రీ చదువుతున్నప్పుడు నా క్లాసు మేటు. ఇద్దరం బాగా స్నేహంగా వుండేవాళ్ళను. అయితే మేమిద్దరం పెళ్ళి చేసుకోవాలని మాత్రం ఎప్పుడూ అనుకోలేదు.

నా పెళ్ళి మోహనరావుతో జరిగిన తర్వాత రామ రాజు నన్ను కలుసుకున్నాడు. నేను తనని మోసం చేశాననీ అందుకు ప్రతిఫలంగా నన్ను తనకు యాభై వేల రూపా యలు ఇచ్చుకోమనీ అన్నాడు. నాకు నవ్వొచ్చింది. యాభై వేలు ఇస్తే నేను పెళ్ళిచేసుకున్నట్టు అవుతుందా. ఇదేమాట అతన్ని అడిగాను. అదంతా తనకు అనవసరం అనీ ముందు యాభై వేలు ఇవ్వమని బలవంతపెట్టాడు.

"ఇవ్వనన్నాను. ఈ మాటే గుర్తుపెట్టుకో. నువ్వు ఎలా బతుకుతావో చూస్తానని కోపంగా వెళ్ళిపోయాడు. ఇతన్నించి కూడా నాకు ప్రమాదం వుంది జగదీష్‌గారూ. ఈ నలుగురినీ నేను అనుమానిస్తున్నాను" అన్నది సునీత భారంగా నిట్టూర్పు వదిలి.

ఆమె కళ్ళు బెదురుతున్నాయి.

"ఈ నలుగురికీ మిమ్మల్ని హత్యచెయ్యటానికి తగిన కారణాలు మాత్రమే వున్నాయి సునీతగారూ. ఈ నలుగురూ మిమ్మల్ని బెదిరించారు. కేవలం వీళ్ళ బెదిరింపుల కారణంగానే మీరు హత్యచేయబడతారని భయపడుతున్నారా? లేకపోతే మిమ్మల్ని హత్యచెయ్యటానికి ప్రయత్నాలు ఏవయినా జరిగాయా?" అడిగాను.

"వాళ్ళ బెదిరింపుల గురించి అసలు నేను భయపడలేదు. కోపం వచ్చిన మనుషులు అలా బెదిరిస్తారని అనుకున్నాను. కాని వారంరోజుల క్రితంనించీ నేను బయటకు వెళితే ఎవరో నన్ను కారులో వెంటాడుతున్నారు. వాళ్ళు ఎవరో నాకు తెలీదు. మొదట్లో ఎవరో అనుకున్నాను. కాని తర్వాత వరసగా వారం రోజులనించీ వాళ్ళు నా వెనకే తిరుగుతున్నారు.

వాళ్ళు అప్పటివరకూ ఎక్కడ వుంటారో నాకు తెలీదు. నా కారు బయల్దేరి కొంచెం దూరం వెళ్ళగానే వెనక్కి తిరిగిచూస్తే వాళ్ళు కార్లో వస్తూవుంటారు. వారంరోజులనించీ ఇలాగే జరుగుతోంది. ముందు పోలీసులకు రిపోర్టు ఇద్దామనుకున్నాను. కాని అంతకంటే మిమ్మల్ని కలుసుకోటం మంచిదనిపించింది. అందుకే ఇప్పుడు వచ్చాను. ప్లీజ్ నన్ను మీరే కాపాడాలి" అన్నది అర్థిస్తున్నట్లు.

"అలాగే .... మీరు భయపడకండి సునీతగారూ. త్వరలోనే మిమ్మల్ని హత్యచెయ్యాలనుకుంటున్న మనుషుల్ని పట్టుకుంటాను. నిశ్చింతగా వుండండి" అన్నాను.

"థాంక్స్ సర్. ఇదిగో పదివేలకు ముందుగా చెక్కు ఇస్తున్నాను. తర్వాత మీరడిగిన మొత్తం చెల్లిస్తాను" అని బ్యాగ్‌లోనించి చెక్కు తీసి నా చేతికిచ్చింది.

"మీ అడ్రసు మిగిలిన అనుమానితుల ఎడ్రసులు ఈ కాయితంమీద రాసి ఇవ్వండి" అన్నాను పెన్ను కాయితం ఇచ్చి.

ఆమె రాసింది.

"మిమ్మల్ని వెంటాడుతున్న ఆ మనుషులు ఎలా వుంటారో ఒకసారి చెప్పండి" అన్నాను.

సునీత వాళ్ళను వర్ణించి చెప్పింది.

"నా ఫోన్ నెంబర్ నోట్ చేసుకోండి. మిమ్మల్ని వెంటాడుతున్న ఆ మనుషులు కనిపించగానే ఆ కారు నెంబరు—మీరు ఏ రోడ్డులో వెళుతున్నదీ ఏదయినా పబ్లిక్ బూత్ నించి నాకు ఫోన్ చెయ్యండి. నేను వస్తాను" అన్నాను.

"అలాగే. వెళ్ళొస్తా జగదీష్ గారూ. ఇప్పుడు నాకెంతో ధైర్యంగా వుంది" అని డోర్ నెట్టుకుని వెళ్ళిపోయింది సునీత.

ఆమె చెప్పిన నలుగురు అనుమానితుల గురించి ఆలోచిస్తూ కుర్చీలో వెనక్కి వాలాను సిగరెట్టు ముట్టించి.

## 2

సాయంత్రం ఐదుగంటలయ్యింది.

బెడ్ మీదనించి లేచికూర్చుని స్క్రీన్ పక్కకు జరిపి కిటికీలోనించి బయటకు చూసింది సునీత.

పలుచగా వుంది ఎండ.

రోడ్డుమీద జనం ఎక్కువగా వున్నారు.

అంతా నిశ్శబ్దంగా వుంది....

సునీతకు ఒక్కక్షణం జీవితం మీద విరక్తి పుట్టింది. తన ప్రాణానికి అనుక్షణం ప్రమాదమే. అందరూ తన చావు కోసం ఎదురు చూస్తున్నారు అనుకున్నది. కాని వెంటనే

ఆమెకు తను డిటెక్టివ్ సహాయం కోరిన విషయం గుర్తొచ్చింది. మళ్ళీ జీవితం మీద ఆశ చిగురించింది.

గోడనున్న గడియారన్ని చూసింది సునీత. తరువాత తను చెయ్యవలసిన పని గుర్తుకొచ్చింది.

తనని వెంటాడుతున్న మనుషుల గురించి డిటెక్టివ్‌కి తెలియజేయాలి.

లేచి నిల్చుంది.

బాత్‌రూమ్‌కి వెళ్ళింది.

ఐదు నిముషాల్లో సబ్బుతో మొహం కడుక్కొని వచ్చింది.

అరగంటలో డ్రెస్ చేసుకుని తన గదిలోనించి బయటకు వచ్చింది.

డ్రయివర్ కారులోనే కూర్చుని వున్నాడు.

సునీతను చూడగానే బ్యాక్ డోర్ తెరిచాడు. వెనుక సీట్లో కూర్చుంది ఆమె.

ఆమె కూర్చోగానే కారు ముందుకు కదిలింది.

"ఎక్కడికి మేడమ్" అడిగాడు డ్రయివరు.

"సికింద్రాబాద్ వయిపు పోనివ్వు" అన్నది చిన్నగా.

నున్నటి తారురోడ్డు మీద మెత్తగా వెళుతోంది. కారు. ఐదు నిముషాల తర్వాత వాచీ చూసుకుంది సునీత.

కారు రామ్‌నగర్‌లోనించి వెళుతోంది.

వెనక్కి తిరిగి చూసింది సునీత.

వెనుక ఎవ్వరూ లేరు. ఒక ఆటో వస్తోంది. అందులో ఎవ్వరూ లేరు.

ముందుకు తిరగింది ఆమె.

డ్రయివర్ సూటిగా రోడ్డుమీదకు చూస్తూ డ్రయివ్

చేస్తున్నాడు.

మరో రెండు నిముషాలాగి మిళ్ళీ వెనక్కి తిరిగి చూసింది సునీత.

ఉలిక్కిపడింది.

వెనకనే కొంచెం దూరంలో వస్తోంది ఫోర్డుకారు. నల్లగావుంది. అందులో డ్రైవరు కాకుండా ముగ్గురు మనుషులు కూర్చుని సూటిగా సునీత కారునే చూస్తున్నారు. ముగ్గురూ గూండాల్లా లావుగా, కర్కశంగా వున్నారు.

వెంటనే చూపు మరల్చుకుంది సునీత. అలా చూపు మరలిస్తూనే ఫోర్డుకారు నెంబరు చూసింది.

ఆ నెంబర్ని హాండుబ్యాగ్ లోనించి చిన్న స్లిప్ తీసి బాల్ పెన్ తో దానిమీద నోటుచేసుకుంది.

కారు సికింద్రాబాద్ రైల్వేస్టేషన్ దగ్గరకు వస్తూ వుండగా మరోసారి వెనక్కి తిరిగిచూసింది సునీత.

ఫోర్డు కారు నెమ్మదిగా వస్తూనే వుంది.

స్టేషన్ ముందుకు రాగానే "డ్రయివర్....ఒక్క నిముషం కారు ఆపు" అన్నది సునీత.

కారు ఆగింది.

దిగి గబ-గబా స్టేషన్లోకి వెళ్ళి టెలిఫోన్ బూత్ లోకి చొరబడింది.

నెంబర్ డయల్ చేసింది.

యాభై పైసల నాణెం వెయ్యగానే కనెక్షన్ వచ్చింది.

"నేను సునీతను జగదీష్‌గారూ. సికింద్రాబాద్ స్టేషన్ నించి మాట్లాడుతున్నాను. వాళ్ళు ఇప్పుడు కార్లో నన్ను వెంటాడుతున్నారు. ఫోర్డు కారు. కారు నెంబరు ఎ.ఎ.యస్. 3091. నేను బయల్దేరుతున్నాను. స్టేషన్నించి నెంబర్ త్రీ బస్సు రూటులో వెళుతూ వుంటాను స్లోగా

డ్రైవ్ చేయిస్తూ. మీరు త్వరగా వచ్చెయ్యండి. అలాగే" అని ఫోన్ పెట్టేసి, కొద్దిసేపు అక్కడే నిలబడి, తర్వాత వెళ్ళి కార్లో కూర్చుంది.

"డ్రయివర్ నెంబర్ త్రీ రూట్‌లో పోనివ్వు. స్లోగా డ్రయివ్ చెయ్" అన్నది సునీత.

కారు కదిలింది. ఆల్ఫా హోటలు ముందు టర్నింగ్ కొట్టి వెనక్కు తిరిగింది.

సికింద్రాబాద్ రైల్వే బ్రిడ్జి దాటిన తర్వాత సునీత వెనక్కు తిరిగి చూసింది.

ఫోర్డు కారు వస్తూనే వుంది.

చిన్నగా నవ్వుకుంది సునీత.

"పాపం....తను డిటెక్టివ్‌కు ఫోన్ చేసిన విషయం వీళ్ళకు తెలీదుకదా!" అనుకుంది.

యూనివర్సిటీ ఏరియా నించి వెళుతోంది సునీత కారు. ఇంజనీరింగ్ కాలేజీ దగ్గరకు వెళ్ళేసరికి వెనుకనించి డిటెక్టివ్ జగదీష్ స్కూటర్ మీద రివ్వున వచ్చి ఆమెను కలిశాడు.

అతన్ని చూడగానే "డ్రయివర్ కారాపు" అన్నది సునీత.

కారు ఆగిపోయింది.

"భలేవారే మీరు....ఏదీ మీరు చెప్పిన ఫోర్డు కారు" అన్నాడు జగదీష్.

సునీత గబుక్కున వెనక్కు చూసింది. ఫోర్డుకారు కనిపించలేదు. ఏదో సిటీబస్సు వస్తోంది.

"ఆశ్చర్యంగా వుంది. ఇప్పటివరకూ ఈ కారు వెనుకనే వచ్చింది. సీతాఫల్‌మండి రైలుగేటు దాటిన తర్వాత కూడా నేను చూశాను" అన్నది సునీత.

"అయితే వాళ్ళు ఏదో అనుమానించారు. అందుకే తప్పించుకున్నారు. ఐనా ఫర్వాలేదు. కారు నెంబరు చెప్పారుకదా.... దాన్నిబట్టి నేను వాళ్ళను పట్టుకోగలను. ఇక మీరు వెళ్ళండి. నేను వెనక్కి వెళతాను" అని స్కూటర్ని వెనక్కితిప్పి ముందుకు పోనిచ్చాడు డిటెక్టివ్ జగదీష్.

సునీత అదోలా అతన్నే చూస్తూ వుండిపోయింది కార్లో.

# 3

గదిలోనించి బయటకు వెళ్ళటానికి డ్రెస్ చేసుకుంటున్నాను. సమయం ఉదయం ఎనిమిది గంటలు కావస్తోంది.

బయట ఎండ మందంగా వుంది.

ఫోన్ మ్రోగింది.

రిసీవర్ చేతికి తీసుకున్నాను.

"హల్లో....ఎవరు? ఇన్‌స్పెక్టర్ ప్రదీప్. హల్లో.... నువ్వా? ఏమిటి విశేషాలు? ఏదయినా హత్యకేసు తగిలిందా? ఉదయమే ఫోన్ చేశావ్?" నవ్వుతో అడిగాను.

"సరిగ్గానే వూహించావ్ బ్రదర్. నిజంగానే హత్యకేసు. సునీత ఎస్టేట్స్ సునీత హత్యచేయబడింది. నేను వెళుతున్నాను. నువ్వు వెంటనే అక్కడికి వచ్చెయ్యి" ఎడ్రసు చెబుతున్నాడు ఇన్‌స్పెక్టర్.

"నాకు తెలుసు"అని ఆశ్చర్యంతో ఫోన్ పెట్టేశాను.

మైగాడ్!....ఆమె అనుమానించినంతా అయింది.

ఆమె నా సహాయం కోరినా ఆమెను కాపాడలేకపోయాను.

నిజంగా దారుణం.

స్కూటర్ని బయటకు తీసి రూమ్కు లాక్ చేశాను.

స్కూటరును స్టార్టు చేసి ముందుకు దూకించాను.

రివ్వున మూసుకు పోతోంది.

నా మెదడులో ఆలోచనలు స్కూటరుకంటే వేగంగా పరుగులు తీస్తున్నాయి.

సునీత ఎస్టేట్ లోకి మళ్ళింది స్కూటరు.

అప్పటికే అక్కడ పోలీసు జీపు, అంబులెన్స్ ఆగి వున్నాయి.

బయట పోలీసులు నిలబడివున్నారు.

"ఇన్స్పెక్టర్ గారు పైన వున్నారు" చెప్పాడు కానిస్టేబులు.

మెట్లెక్కి పైకి వెళ్ళాను.

ఓ గదిలో అంతా కనిపించారు.

బెడ్ మీద నిద్రపోతున్నట్టుగా వుంది సునీత.

ఆమెను చూడగానే నాకు షాక్ కొట్టినట్టు అనిపించింది.

క్రితంరోజు తను ఏ విషయం గురించయితే భయపడిందో ఈ రోజు అదే జరిగింది.

వేలిముద్రల నిపుణుడు ఓస్టీలు గ్లాసుమీది వేలిముద్రలు తీస్తున్నాడు.

"నీ కోసమే ఎదురు చూస్తున్నాను" అన్నాడు ఇన్స్పెక్టర్ నన్ను చూడగానే.

"దారుణం బ్రదర్. ఈమె రెండ్రోజుల క్రితం నా హెల్ప్ కోరింది" అన్నాను.

"నీ హెల్ప్ అడిగిందా?" ఆశ్చర్యంగా అడిగాడు ఇన్స్పెక్టర్.

"అవును. ఆమెను ఎవరో హత్య చెయ్యటానికి ప్రయత్నం చేస్తున్నారని చెప్పింది."

"ఎవరు?"

"అన్ని విషయాలూ తర్వాత వివరంగా చెబుతాను. ముందు ఇక్కడి విషయాలు చెప్పు. సునీత ఎలా హత్య చెయ్యబడింది??" అడిగాను.

"స్లీపింగ్ పిల్స్ ఓవర్ డోస్ కారణంగా చనిపోయింది. స్లీపింగ్ పిల్స్ పాలల్లో కలిపి తాగింది."

"అలాగా."

"న్యాయంగా ఈ కేసు నిలవదు బ్రదర్" అన్నాడు ఇన్ స్పెక్టర్.

"అవును. నీ పాయింట్ నాకు అర్థమయింది. పాలల్లో స్లీపింగ్ పిల్స్ కలుపుకుని తాగిన కారణంగా ఆమె చనిపోయింది. గ్లాసుమీద బహుశ సునీత వేలిముద్రలే వుంటాయి. కాబట్టి ఇది ఆత్మహత్య అవటానికి కూడా అవకాశం వుందంటావు. అంతేకదా?" అన్నాను.

"అవును" అన్నాడు ఇన్ స్పెక్టర్.

"నిజమే. సునీత నా సహాయంకోరి తనని ఎవరో హత్య చెయ్యాలని అనుకుంటున్నారని చెప్పకుండా వున్నట్లయితే మనం సునీత ఆత్మహత్య చేసుకుందని అనుకునే వాళ్ళము. కాని ఇప్పుడలా కాదు. చూడటానికి ఇది ఆత్మహత్యలా కనిపిస్తున్నా ఇది హత్యే. ఎవరో సునీతను తెలివిగా హత్యచేశారు. బహుశ ఆమెకు రోజూ పడుకోబోయే ముందు పాలు తాగే అలవాటు వుండి వుంటుంది. అందుకే ఆమెకు తెలియకుండా ఎవరో పాలల్లో స్లీపింగ్ పిల్సు కలిపారు" అన్నాను.

మాట్లాడలేదు ఇన్ స్పెక్టర్. సునీతవైపు చూస్తూ నిలబడ్డాడు.

పనులన్నీ చకచకా జరిగిపోతున్నాయి.

"రాత్రి రెండు గంటలప్పుడు ప్రాణం పోయి వుంటుంది" చెప్పాడు డాక్టర్.

"సునీత హత్య గురించి ఎవర్నయినా ఎంక్వయిరీ చేశావా?" ఇన్‌స్పెక్టర్‌ని అడిగాను.

"సునీత భర్తని, వంటమనిషిని, ఓ నౌకర్‌ని ఎంక్వయిరీ చేశాను. వాళ్ళు తమకేమీ తెలియదని చెప్పారు."

"ముందుగా సునీతను ఎవరు చూశారుట."

"వంటమనిషి"

"ఇప్పుడు ఎక్కడ వుంది?"

"అందరూ కింద వున్నారు."

"ఇక్కడి తతంగం పూర్తయ్యింది ఇన్‌స్పెక్టర్" చెప్పాడు డాక్టర్.

"శవాన్ని మార్చురీకి పంపిస్తున్నాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"పంపించు. నేను ఇక్కడ ఎంక్వయిరీ పూర్తి చేసుకుని స్టేషన్‌కు వస్తాను" అన్నాను ఇన్‌స్పెక్టర్‌తో.

శవాన్ని తీసుకుని పోలీసులు, డాక్టరు, వేలిముద్రల నిపుణుడు వెళ్ళిపోయారు.

సునీత భర్త మోహనరావు తనంతట తనే వచ్చి తనని పరిచయం చేసుకున్నాడు. అతను ఇంతకుముందు ఎప్పుడో నన్ను చూశాడుట.

"ఘోరం జరిగింది జగదీష్‌గారూ" అన్నాడు విచారంగా.

అతను నిజంగా విచారపడుతున్నాడో, నటిస్తోన్నాడో అర్థంకాలేదు.

"అవును. అయితే ఈ ఘోరం జరుగుతుందని సునీతకు ముందుగానే తెలుసు" అన్నాను అతని మొహంలోకి

చూసూ.

"ఏమిటి మీరంటున్నది?" అన్నాడతను.

మోహనరావుకి ముప్పయి ఏళ్ళు పయన వుంటాయి. ఎర్రగా, పొడుగ్గా వుంటాడు. అతని కళ్ళలో నాకు ఎటువంటి భావమూ కనిపించలేదు.

"అవును....సునీత రెండురోజుల క్రితం నన్ను కలుసు కుంది. ఆమెను ఎవరో హత్యచెయ్యాలనుకుంటున్నారని చెప్పింది. నా సహాయం కోరింది. ఆమెను ఎవరు హత్య చెయ్యాలనుకుంటున్నారో తెలుసుకుంటానని చెప్పాను. కానీ ఇంతలోనే సునీత హత్య చెయ్యబడింది."

"ఆశ్చర్యంగా వుంది. సునీత మిమ్మల్ని కలుసుకున్న విషయం నాకు తెలీదు. గత కొన్ని నెలలుగా మా ఇద్దరికీ మాటలు లేవు. వేరుగా వుంటున్నాము. బహుశ సునీత ఈ విషయాలన్నీ మీకు చెప్పే వుంటుందను కుంటాను" అన్నాడు మోహనరావు.

"అవును. సునీత అన్ని విషయాలు చెప్పింది. ఇంతకీ మీరు రాత్రి ఎక్కడ వున్నారు?"

"ఇంట్లోనే వున్నాను. రాత్రి తొమ్మిది గంటలకు ఇంటికి వచ్చాను. ఆ తర్వాత బయటకు వెళ్ళలేదు. అప్పటికే సునీత తన గదిలో కూర్చుని ఏదో నవల చదువుకుంటోంది. పదిగంటలకల్లా నేను నిద్రపోయాను. తెల్లవారి వంటమనిషి అరుపులతో నిద్రలేచాను. లేచేసరికి సునీత చనిపోయింది. వెంటనే పోలీసులకు ఫోన్ చేశాను."

"సునీతను మీరు హత్యచేసే అవకాశం వుందను కుంటాను" అన్నాను.

ఉలిక్కిపడ్డాడు అతను.

"అవకాశం వుంది. కాని ఆమెను నేను హత్యచెయ్య

లేదు. అలా అనుకుంటే ఆమె హత్య చెయ్యబడిందంటే నాకు నమ్మకంలేదు. ఆత్మహత్య చేసుకుందని అనుకుం టున్నాను" అన్నాడు.

"మీరేకాదు. ఎవరయినా అలాగే అనుకుంటారు. కాని సునీత నన్ను కలుసుకుంది. తనని ఎవరో హత్య చెయ్యటానికి ప్రయత్నిస్తున్నారని చెప్పింది. కాబట్టి ఇది ఆత్మహత్య కాదు. హత్య. సునీత నన్ను కలుసుకున్న విషయం పోలీసులకు చెప్పాను. కాబట్టి పోలీసులు ఇది ఆత్మహత్య అని కేసును కొట్టేసే అవకాశంలేదు. కాబట్టి అసలయిన హంతకుడు తప్పించుకోలేడు. ఇరవై నాలుగు గంటల్లో సునీతను హత్యచేసిన మనిషిని పట్టుకుంటాను."

"నన్ను నమ్మండి జగదీష్‌గారూ. ఈ హత్య నేను చెయ్యలేదు. సునీతను ఎవరో హత్యచేశారు. నేను కూడా ఒప్పుకుంటాను. మీ సహాయం కోరిన తర్వాత సునీత ఆత్మహత్య చేసుకుంటుందని నేను అనుకోను. కాబట్టి తప్పకుండా ఇది హత్యే. అయితే సునీతను హత్యచెయ్య టానికి నాకు కాకుండా మరో ముగ్గురికి కూడా అవ కాశం వుంది. సునీత ఆ ముగ్గురి గురించి కూడా మీకు చెప్పే వుంటుంది. ఆ ముగ్గురిలో ఇద్దరు మనుషులు రాత్రి సునీతను కలుసుకున్నారు" చెప్పాడు మోహనరావు.

"ఎవరా ఇద్దరు?" వెంటనే అడిగాను.

"సునీత బావ సుధాకర్. ఆమె ఒకప్పటి ప్రేమి కుడు రామరాజు."

"వీళ్ళిద్దరు సునీతను కలుసుకున్నారని మీకెలా తెలుసు?"

"నౌకరు రంగయ్య చెప్పాడు. సునీత గురించి ఇక్కడ అందరికీ తెలుసు."

"మీ వంటమనిషిని పిలుస్తారా ఓసారి."

మోహనరావు వంటమనిషిని పిలిపించాడు. ఆమెవచ్చి నా ఎదురుగా నిలబడింది. ఆమెకు యాభైయేళ్లుంటాయి! సన్నగా, పొడుగ్గా వుంది.

నన్ను చూడగానే నమస్కారం చేసింది.

"నీ పేరు?" అడిగాను.

"గోవిందమ్మ."

"ఎన్నాళ్ళనించీ ఈ ఇంట్లో నువ్వు పనిచేస్తున్నావు?"

"ఏడాదినుంచి."

"రాత్రి సునీతకు పాలు ఇచ్చింది నువ్వే కదా."

"నేను కాదండీ....ఎవరిచ్చారో నాకు తెలీదు."

"రాత్రిళ్ళు నువ్వు ఇక్కడ వుండవా?"

"ఇక్కడే వుంటానండీ పది గంటలదాకా....తర్వాత ఇంటికి వెళతానండీ....కాని రాత్రి నా కూతురుకు ఒంట్లో కులాసాగా లేకపోతే అమ్మగార్ని అడిగి ఏడు గంటలకే వెళ్ళిపోయాను."

"ఉదయం సునీత శవాన్ని నువ్వే చూశావా?"

"అవునండీ, కాఫీ తీసుకుని గదిలోకి వెళ్ళానండీ. అమ్మగారు ఇంకా నిద్రపోతున్నారు. లేపాను. కాని లేవలేదు. ఒళ్ళంతా బిగుసుకుపోయి వుంది. వెంటనే చని పోయారని గ్రహించి అయ్యగార్ని పిలిచాను."

"నువ్వు ఎక్కడ వుంటున్నావ్" అడిగాను.

చెప్పింది గోవిందమ్మ. ఇక ఆమెను అడిగే ప్రశ్నలు ఏవీలేవు. అందుకే ఆమెను పంపించాను.

"నౌకర్ని పిలవండి" మోహనరావుతో అన్నాను.

అతను దూరంగా నిలబడివున్న నౌకరు రంగయ్యను పిలిచాడు.

రంగయ్య వస్తూనే "దణ్ణాలు సామీ" అన్నాడు. ఆయనకు అరవై యేళ్ళవరకు వుంటాయి. పొట్టిగా—నల్లగా వున్నాడు.

"రాత్రి సునీతను నువ్వు చివరిసారిగా ఎన్ని గంటలప్పుడు చూశావ్?" అడిగాను రంగయ్యను.

"పది గంటలప్పుడు చూశానండీ. అప్పుడే ముందు సుధాకర్ గారు వచ్చారండీ. అమ్మగారితో ఏదో మాట్లాడారు. అమ్మగారు కోపంగా ఏదో అనేసరికి అయన విసురుగా వెళ్ళిపోయారు. తర్వాత అరగంటకి అమ్మగారి గదిలోనించి రామరాజు గారు గబగబా వచ్చి వెళ్ళిపోవటం చూశానండీ. ఆ తర్వాత నాకేమీ తెలియదండీ."

"సర్లే నువ్వెళ్ళు"

వెళ్ళిపోయాడు రంగయ్య.

"మిస్టర్ మోహనరావ్, నాదొక సందేహం. నిజంగా రాత్రి సునీత బావ సుధాకర్-ఆమె ఒకప్పటి ప్రేమికుడు రామరాజు ఈ ఇంటికి వచ్చారంటారా?" అడిగాను అతని కళ్ళలోకి చూస్తూ.

"అబద్ధం చెప్పినందువల్ల నాకు వచ్చే ప్రయోజనం ఏముంటుంది?"

"చాలా వుంది. అనుమానం వాళ్ళిద్దరిమీదకూ వెళుతుంది."

"నిజమే. తర్వాత మీ పరిశోధనలో నిజానిజాలు బయటపడతాయికదా నేను అబద్ధం చెప్పినా. ఐనా నేను నిజమే చెబుతున్నాను. వాళ్ళిద్దరూ సునీతను కలుసుకున్నారు."

"వాళ్ళు ఇంతకు ముందు ఎప్పుడయినా మీరు ఇంట్లో వున్నప్పుడు ఒంటరిగా వున్న సునీత గదిలోకి వెళ్ళి

మాట్లాడారా?"

"చాలాసార్లు మాట్లాడారు."

"మరి ఆమె భర్తగా మీరు వాళ్ళు ఆమెను కలుసుకోవటాన్ని ఎలా సహించారు?"

"సహించక నేను చెయ్యగలిగింది ఏమీ లేదు. ఈ ఆ సంతా సునీతది. ఆమె నన్ను తన విషయాల్లో జోక్యం చేసుకోవద్దని గట్టిగా చెప్పింది. అంతే కాకుండా మా ఇద్దరిమధ్య భార్యాభర్తల సంబంధం ఎప్పుడో చెడి పోయింది. ఇంకో విషయం. నిజానికి ఈ విషయంలో సునీతను ఏమీ అనే హక్కు కూడా నాకు లేదు. ఎందుకంటే నాకూ ఓ అమ్మాయితో సంబంధం వుంది" అన్నాడు మోహనరావు.

అతను తనందట తనే ఈ విషయాన్ని చెప్పటం నాకు కొంచెం ఆశ్చర్యాన్ని కలిగించింది.

"ఆల్ రైట్. థాంక్స్ మోహనరావ్ గారూ నాతో సహకరించినందుకు. మిమ్మల్ని మళ్ళీ కలుసుకుంటాను. దయచేసి పోలీసుల పర్మిషన్ లేకుండా ఈ వూరు వదిలి ఎక్కడికీ వెళ్ళకండి" అన్నాను అక్కడినించి కదులుతూ.

నవ్వాడతను, "ఈ వూర్నించి కాదు, ఈ ఇంట్లో నించే ఎక్కడికీ వెళ్ళను" అన్నాడు మోహనరావు.

## 4

"సునీత తాగిన పాలగ్లాసుమీది వేలిముద్రలు ఎవరివో తెలిసిందా?" పోలీసు స్టేషన్‌లోకి వెళ్ళగానే ఇన్‌స్పెక్టర్ ఎదురుగా కూర్చుంటూ అడిగాను.

"నువ్వు వూహించింది నిజమే. ఆ గ్లాసుమీద సునీత వేలిముద్రలే వున్నాయి."

"అయితే ఇంకెవ్వరి వేలిముద్రలూ లేవా ఆ గ్లాసు

మీద."

"లేవుట."

"ఆశ్చర్యంగా వుంది. సునీత తనకుతానే పాలను గ్లాసులో పోసుకుని తాగివుండాలి."

"అంతే అయివుంటుంది."

"మరి అటువంటప్పుడు ఆ గ్లాసులోకి స్లీపింగ్ పిల్స్ ఎక్కడినించి వచ్చాయి?"

"సునీతే కలుపుకుని వుంటుంది" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"నువ్వు మళ్ళీ మొదటికి వస్తున్నావ్ బ్రదర్. సునీత ఆత్మహత్య చేసుకోలేదు. ఆమెను ఎవరో హత్య చేశారు. కాబట్టి సునీత పాలగ్లాసులో ఆమెకు తెలీకుండా ఎవరో స్లీపింగ్ పిల్స్ కలిపారు. ఆమె కలుపుకోలేదు" అన్నాను.

"అయితే ఆ మనిషి ఎవరు?" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఆ మనిషే హంతకుడు. ఆ మనిషి ఎవరో మనం తెలుసుకోవాలి."

"చెప్పు....నువ్వు నాకు అన్ని విషయాలూ వివరంగా చెబుతానన్నావు. కాని చెప్పలేదు. అసలు సునీత నీకు ఏం చెప్పింది?"

ఇన్‌స్పెక్టర్‌తో అంతా వివరంగా చెప్పాను.

"అయితే ఆ నలుగురు అనుమానితుల్లో ఎవరో ఈ హత్యను చేసి వుండాలి" అన్నాడు ప్రదీప్.

"అలాగే అనుకోవాలి. నలుగుర్లో ఇద్దరు హత్యజరిగిన రోజు రాత్రి సునీతను కలుసుకున్నారు. మూడో మనిషి, సునీత భర్త. అతను ఇంట్లోనే వున్నాడు. అతను యెంత వరకు నిజం చెబుతున్నాడో మనకు తెలీదు. ఇక నాలుగో మనిషి—సుధీర్. సునీత తమ్ముడు. అతను క్రితం రాత్రి ఎక్కడ వున్నాడో తెలుసుకోవాలి. అంతేకాదు, మిగిలిన

ఇద్దరు అనుమానితుల్నీ కలుసుకోవాలి.

ఈ కేసులో ఇంకొంతమంది పాత్రకూడా వుంది. ఎ.ఎ.యస్. 3091 నల్ల ఫోర్డు కారులో వారంరోజుల నించీ ఎవరో ముగ్గురు మనుషులు సునీతను బయటకు వెళితే వెంటాడారు? అసలు ఆ మనుషులు ఎవరు? ఆ నల్ల ఫోర్డు కారు ఎవరిది? ఈ విషయాలు నువ్వు తెలుసుకో. నేను ముందు సునీత బావ సుధాకర్‌ని కలుసుకుంటాను" అన్నాను అతనితో.

"అలాగే. క్విక్‌గా మన పరిశోధన సాగితే హంతకుడిని పన్నెండు గంటల్లోనే పట్టుకోవచ్చు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"వెళతాను" అని స్టేషన్‌లో నించి బయటకు వచ్చాను.

## 5

సన్నగా వున్న రోడ్డులోకి మళ్ళించాను స్కూటరుని. ఆ రోడ్డు నిర్మానుష్యంగా వుంది. వరుసగా డోర్ నెంబర్లు చూసుకుంటూ వెళుతున్నాను.

సుధాకర్ వుంటున్న డోర్ నెంబర్ కనిపించింది. స్కూటరాపాను.

దిగి గేటు నెట్టుకుని లోపలకు వెళ్ళాను. గది తలుపులు మూసి వున్నాయి.

తట్టాను.

లోపల్నించి "ఎవరు?" అన్నారు ఎవరో.

"తలుపు తెరవండి."

నిమిషం తర్వాత తలుపులు తెరుచుకున్నాయి. ఎదురుగా నలభై యేళ్ళాయన నిలబడి వున్నాడు లుంగీ చుట్టుకుని. బట్టతల. కళ్ళు ఎర్రగా వున్నాయి.

"సుధాకర్ గారు మీరే అనుకుంటాను" అన్నాను చిరు

నవ్వుతో.

"అవును.... నేనే. ఇంతకీ మీరెవరు? ఎందుకోసం వచ్చారు?" అన్నాడాయన అక్కడినించి కదలకుండానే.

"కూర్చొని మాట్లాడుకుందాం పదండి" అని నేను కదిలాను.

ఆ గదిలో నాలుగు కుర్చీలు, ఓ టీపాయ్ వున్నాయి. ఇద్దరం ఎదురెదురుగా కూర్చున్నాము.

"మీరు రాత్రి పది గంటలప్పుడు సునీతను కలుసుకున్నారు కదా?" అడిగేను సుధాకర్‌ని.

అతను మొహం అదోలా పెట్టి "సునీత గురించి అడుగుతున్నారు మీరెవరు?" అన్నాడు సీరియస్‌గా.

"నేను డిటెక్టివ్ జగదీష్‌ని. సునీత రెండ్రోజుల క్రితం నన్ను కలుసుకుంది. మీరు తనని హత్య చెయ్యాలనుకుంటున్నారని చెప్పి నా సహాయం కోరింది. క్రితం రాత్రి మీరు ఆమెను కలుసుకున్నారు. ఆమెతో మాట్లాడుతూ ఆమెకు తెలీకుండా ఆమె తాగే పాలగ్లాసులో స్లీపింగ్ పిల్స్ ఓవర్ డోస్‌లో కలిపారు. ఆమెను హత్య చేశారు" అన్నాను అతని మొహంలో ఫీలింగ్స్‌ని గమనిస్తూ.

సుధాకర్ ఒక్కక్షణం షాక్ కొట్టిన వాడిలా వుండిపోయాడు.

తర్వాత షాక్‌నించి తేరుకుని "అబద్ధం. అంతా పచ్చి అబద్ధం" అని అరిచాడు.

"అబద్ధం కాదు. మీరే రాత్రి సునీతను హత్య చేశారు" అన్నాను గట్టిగా.

"మీకు పిచ్చిపట్టింది. నేను సునీతను హత్య చెయ్యలేదు. నాకేమీ తెలీదు. నేను నిర్దోషిని. నిర్దోషిని" అన్నాడు పెద్దగా.

"అయితే జరిగింది చెప్పండి. రాత్రి మీరు సునీతను కలుసుకున్నారా? లేదా?" సిగరెట్టు వెలిగిస్తూ అడిగాను.

"అంతా చెబుతాను. రాత్రి పదిగంటలప్పుడు సునీత ఇంటికి వెళ్ళాను బాగా డబ్బు అవసరమయి. నేను వెళ్ళే సరికి ఆమె బెడ్ మీద పడుకుని చదువుకుంటోంది. నన్ను చూడగానే "ఎందుకొచ్చావ్?" అని అడిగింది. బిజినెస్ చేసుకుంటాననీ కనీసం ఐదువేలయినా అప్పుగా ఇవ్వమనీ అడిగాను. కాని సునీత ఇవ్వలేను. రెండు రూపాయలు కూడా ఇవ్వను పొమ్మని కసురుకుంది. వెంటనే ఆమెను తిట్టి అక్కడినించి వచ్చేశాను. అంతే జరిగింది. ఆమె గదిలో నేను వున్నది పది నిముషాలే. ప్లీజ్....నన్ను నమ్మండి. జగదీష్ గారూ...." అన్నాడు సుధాకర్.

అతని మాటలు నమ్మాలో, నమ్మకూడదో అర్థం కాలేదు.

మొత్తానికి సునీత హత్య చాలా తెలివిగా జరిగింది.

"మీరు చెప్పినదంతా నిజమేనా?"

"నిజమే జగదీష్ గారూ"

"సునీతను ఇంతకుముందు మీరు బెదిరించారుట కదా, ఆమె మీకు డబ్బులివ్వలేదని."

"బెదిరించిన మాట నిజమే. కోపంలో అలా బెదిరించాను. రాత్రికూడా బెదిరించాను. కేవలం బెదిరింపే. హత్యలు చేసే ధైర్యం నాకు లేదు. హత్యచేస్తే జైలుకు వెళ్ళాలి. జైలుకు వెళ్ళటంకంటే బయట ఎలాగో బతకటం మంచిదికదా" అన్నాడు సుధాకర్.

"ఇంకో విషయం....రాత్రి మీరు సునీత గదిలోకి వెళ్ళినప్పుడు ఆ గదిలో పాలగ్లాసును చూశారా?" అడిగాను.

"లేదు చూడలేదు" అన్నాడతను.

"ఆల్ రైట్. మిమ్మల్ని మళ్ళీ కలుసుకుంటాను" అన్నాను కుర్చీలోనించి లేచి.

"సునీతకు చాలా అన్యాయం జరిగింది" అన్నాడు సుధాకర్ విచారంగా బయటకు వచ్చిన తర్వాత.

## 6

పోలీస్ స్టేషన్ ముందుకు వచ్చేసరికి బయట ఆగివున్న నల్ల ఫోర్డు కారు దర్శనమిచ్చింది నాకు.

దాని నెంబర్ ప్లేటు చూశాను.

అవును. అదే నెంబరు.

సునీతను వెంటాడిన కారు. స్కూటర్ని స్టాండువేసి లోపలకు నడిచాను.

ఇన్స్పెక్టర్ ఎదురుగా నిలబడివున్న ముగ్గురు ఎద్దులాంటి మనుషులు కనిపించారు.

"మిస్టర్ జగదీష్ నల్ల ఫోర్డుకారులో సునీతను వెంటాడి ఆమెను భయపెట్టిన గూండాలు" అన్నాడు ఇన్స్పెక్టర్.

ముగ్గురూ తలలు వంచుకుని నిలబడ్డారు.

"సునీత బాగానే భయపడి వుండాలి వీళ్ళ రూపం చూసి" అన్నాడు ఇన్స్పెక్టర్ మళ్ళీ.

"సునీతను ఎందుకు వెంటాడారు?" అడిగాను ముగ్గురినీ ఉద్దేశించి.

"నేను చెబుతాను. వీళ్ళు కిరాయి మనుషులు. ఆ నల్ల ఫోర్డుకారు సన్ డ్రయివింగ్ స్కూలు వాళ్ళది. ఆ కారును వీళ్ళు అద్దెకు తీసుకున్నారు పదిరోజులపాటు. సునీతను బెదిరించటానికి వీళ్ళను నియమించింది ఎవరో కాదు, మన నలుగురు అనుమానితుల్లో ఒకడయిన రామరాజుట."

"రామరాజా!" అన్నాను.

"అవును. అందుకే వాడిని తీసుకురమ్మని మనవాళ్ళను పంపించాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

నేను మాట్లాడబోయేంతలో ముగ్గురు పోలీసులు సన్నగా ఎర్రగావున్న ఓ ముప్పైఏళ్ళ యువకుడ్ని లోపలకు తీసుకు వచ్చారు.

"ఇతనేసార్ రామరాజు" అన్నారు.

రామరాజు ఇన్‌స్పెక్టర్‌కు నమస్కారం చేశాడు.

"వీళ్ళేకదూ నువ్వు సునీతను భయపెట్టటానికి నియమించిన కిరాయి మనుషులు" అన్నాడు ప్రదీప్ అతనితో.

అతను మాట్లాడలేదు.

"రాత్రి మీరు సునీతను కలుసుకున్నారుకదూ" అడిగాను రామరాజుని.

"అవును" అన్నాడతను వెంటనే.

"ఎన్ని గంటలకు?"

"పదిన్నరవుతుంది"

"ఏం మాట్లాడారు?"

"ఏమీ మాట్లాడలేదు. నాకు కొంత డబ్బు అర్జంటుగా అవసరం వచ్చిందనీ పదివేలు కావాలనీ ఇవ్వమనీ అడిగాను. ఇవ్వనన్నది."

"అప్పుడు మీరేం చేశారు?"

"ఇవ్వకపోతే ఫలితం తీవ్రంగా వుంటుందని బెదిరించాను. ఆమె వినలేదు. నా చెంపమీద కొట్టి "బెదిరిస్తున్నావా?" అన్నది. అవమానమనిపించి ఇక అక్కడ వుండలేక గబగబా బయటకు వచ్చేశాను."

"మీరు చెప్పినదంతా నిజమేనంటారా?"

"ముమ్మాటికీ నిజం"

"సునీతను బెదిరించటానికి మనుషులను ఎందుకు నియమించారు?"

"కేవలం ఆమెను భయపెట్టటానికే. నన్ను ప్రేమించి మరో మనిషిని పెళ్ళి చేసుకున్నందుకు పరిహారంగా సునీతను యాభై వేలు ఇవ్వమని అడిగాను. ఇవ్వనన్నది. అందుకే సునీతను భయపెట్టి ఎలాగయినా ఆమె దగ్గర్నించి డబ్బు లాగాలనుకుని ఈ ముగ్గురినీ నియమించాను."

"సునీత రాత్రి హత్య చెయ్యబడింది....మీకు తెలుసు కదూ" అతని కళ్ళలోకి సూటిగా చూస్తూ అన్నాను.

"నిజంగానా!" అన్నాడు రామరాజు ఆశ్చర్యంగా.

"ప్లీజ్....నటించకు మిస్టర్. ఆమెను రాత్రి నువ్వే హత్య చేశావు. రాత్రి నువ్వు వెళ్ళేసరికి ఆమె గదిలో నీకు పాలు నిండివున్న గ్లాసు కనిపించింది. అక్కడే స్లీపింగ్ పిల్స్ బాటిల్ కూడా కనిపించింది. వెంటనే నువ్వు అవకాశాన్ని వినియోగించుకున్నావు. సునీత చూడకుండా స్లీపింగ్ పిల్స్‌ని ఆ పాలల్లో కలిపావు. తర్వాత ఏమీ తెలియని వాడిలా అక్కడినించి గబగబా బయటకు వచ్చావు. నువ్వు కంగారుగా సునీత గదిలోనించి బయటకు రావడం నౌకరు రంగయ్య చూశాడు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ ప్రదీప్.

"మీరంతా కల్పించి వూహించి చెబుతున్నారు. అసలు నేను వెళ్ళినప్పుడు సునీత గదిలో పాలగ్లాసులేదు. స్లీపింగ్ పిల్స్ సీసాలేదు. నేను ఆమెను హత్య చెయ్యలేదు. నామాట నమ్మండి" అన్నాడు రామరాజు ప్రాధేయపడుతున్నట్టు.

"నువ్వు చాలా తెలివైనవాడివి మిస్టర్. అందుకే సునీతను భయపెట్టి డబ్బు గుంజటానికి కిరాయి గూండా

లను నియమించావు. ఐనా ఆమె భయపడి నీకు డబ్బు ఇవ్వలేదు. నీ ప్లాను ఫలించలేదు. సునీత మీద నీకు వున్న ఆశ పోయింది. అందుకే దొరికిన అవకాశాన్ని ఉపయోగించుకుని ఆమెను హత్యచేశావు. మర్యాదగా నీ నేరాన్ని అంగీకరించు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఇది అన్యాయం ఇన్‌స్పెక్టర్ గారూ. సునీతను బెదిరించటానికి కిరాయి గూండాలను నియమించటమే నేను చేసిన నేరం. అందుకు నన్ను శిక్షించండి. నేను కాదనను. అంతేకాని హత్యా నేరాన్ని నామీద రుద్దకండి. నేను సునీతను హత్య చెయ్యలేదు. ఆమెను హత్యచేస్తే నాకొచ్చే లాభమేమీ లేదు. ఆమెను ఇంతకు ముందు బెదిరించిన మాట నిజమే కానీ నిజానికి సునీతను హత్య చేసే ఉద్దేశం నాకు లేదు" అన్నాడు రామరాజు.

అతని మాటల్లో నిజాయితీ వుందనిపించింది.

లేచి నిలుచుని "ఇన్‌స్పెక్టర్ .... నాలుగో అనుమానితుడ్ని ఇంతవరకు కలుసుకోలేదు. నేను వెళుతున్నాను. ఇంకో గంటలో ఇక్కడ వుంటాను" అన్నాను ముందుకు కదిలి.

# 7

"నేనే సుధీర్‌ని. నాతో ఏం పని?" అన్నాడు ఒకతను.

ఆ గదిలో నలుగురు ఒకే వయసులో వున్న మనుషులు కూర్చుని పేకాడుతున్నారు. వాళ్ళమధ్య మూడు బీరు సీసాలు వున్నాయి. గ్లాసులు లేవు.

వాళ్ళను చూడగానే ఎవరికయినా సులభంగానే ఏ పనీ చెయ్యకుండా గాలికి తిరిగే మనుషులని తెలుస్తుంది.

సుధీర్ లావుగా వున్నాడు. తెల్లగా వున్నాడు. హిప్పీ

క్రాపు - పువ్వుల షర్టు వేసుకున్నాడు. మిగిలిన ముగ్గురూ దాదాపు సుధీర్‌లాగే వున్నారు.

"నువ్వు సునీత తమ్ముడివి కదూ?" అడిగాను.

"అవును....అయితే ఏమిటి?" నిర్లక్ష్యంగా అడిగాడు కనుబొమ లెగరేస్తూ.

"నీతో పనుంది. రాత్రి నువ్వు ఎక్కడున్నావ్?"

అతను నాకేసి కోపంగా, ఆశ్చర్యంగా చూశాడు.

తర్వాత "పోలీసోళ్ళలాగా ఏమిటీ ప్రశ్నలు? అసలు ఎవరు మీరు? ఎందుకొచ్చారు?" అన్నాడు.

నేనెవరో చెప్పాను.

చెప్పగానే అతను ఉలిక్కిపడ్డాడు.

వెంటనే వాళ్ళు పేకాట ఆపేశారు.

"మీ అక్కయ్య సునీత నన్ను కలుసుకుంది. నీ గురించి అంతా చెప్పింది."

"నా గురించి చెప్పిందా? ఏమని చెప్పింది?" భయంగా అడిగాడు.

"నువ్వు తీసిన ఫోటోలు నీ దగ్గర వున్నాయా?"

"ఏ ఫోటోలు?" అమాయకంగా అడిగాడు.

"మరీ అమాయకంగా నటించకు సుధీర్. ఏ ఫోటోలో నీకు బాగా తెలుసు. ఏ ఫోటోలను తీసి నీ సొంత అక్కని బ్లాక్ మెయిల్ చేశావో ఆ ఫోటోలు."

"అవి నా దగ్గర లేవు."

"ఎక్కడున్నాయి?"

"ఎక్కడా లేవు. చించేశాను."

"నమ్మమంటావా?"

"నిజం సార్. ఏదో డబ్బు కక్కుర్తికొద్దీ అలా చేశాను కానీ మా అక్కయ్య నన్ను కొట్టిన తర్వాత నాకు బుద్ధి

వచ్చింది. అందుకే ఆ ఫోటోలను, నెగటివ్ ని చించేశాను."

"రాత్రి నువ్వు సునీతను కలుసుకున్నావు కదూ."

"లేదు. అక్కయ్య నన్ను కొట్టిన తర్వాత మళ్ళీ కలుసుకోలేదు."

"నిజంగా కలుసుకోలేదా?"

"లేదు."

"అబద్ధం. రాత్రి నువ్వు సునీత గదిలోకి వెళుతున్నప్పుడు నౌకరు రంగయ్య చూశాడు" అన్నాను.

కావాలనే అబద్ధం ఆడాను.

"రంగయ్య మీకు అబద్ధం చెప్పాడు. రాత్రి నేను ఆ ఇంటివైపుకే వెళ్ళలేదు" గట్టిగా అన్నాడు సుధీర్.

"అయితే రాత్రి నువ్వు ఎక్కడున్నావ్?"

"రాత్రి తొమ్మిదిగంటలవరకు ఈ రూములోనే మేం నలుగురం పేకాటాడుకుంటూ కూర్చున్నాము. తర్వాత తెల్లవారేవరకూ చిలకలగూడ పోలీస్ స్టేషన్ లో వున్నాము."

"పోలీస్ స్టేషన్ లోనా?!"

"అవును. తొమ్మిదిన్నరకు హోటల్లో భోజనం చేసి సినిమాకు బయలుదేరాము. దారిలో ఒక అమ్మాయి ఒంటరిగా వెళుతూ కనిపించింది. నలుగురం ఆ అమ్మాయిని అల్లరిచేశాం. ఆ అమ్మాయి మాకు ఎదురుపడిన ఓ కానిస్టేబుల్ కి మా గురించి చెప్పింది. అతను మమ్మల్ని స్టేషన్ కు తీసుకువెళ్ళి తెల్లవార్లు వుంచాడు. తెల్లవారిన తర్వాత ఆరుగంటలప్పుడు మాకు తెలిసిన ఒకాయనవచ్చి మమ్మల్ని విడిపించాడు. కావాలంటే మీరు ఎంక్వయిరీ చేసుకోవచ్చు" అన్నాడు సుధీర్.

ఆలోచనలో పడిపోయాను. సుధీర్ చెప్పేదంతా నిజమే అయివుండొచ్చు. అందుకే అంత గట్టిగా తను

రాత్రి సునీత ఇంటికి వెళ్ళలేదని చెబుతున్నాడు. ఐతే నాలుగో అనుమానితుడయిన సుధీర్ కూడా సునీతను హత్య చెయ్యలేదు.

మరి సునీతను హత్య చేసిందెవరు?

"ఎందుకు మీరు ఇవన్నీ అడుగుతున్నారు?" అడిగాడు సుధీర్.

"ఐయామ్ సారీ. సునీత రాత్రి హత్య చెయ్యబడింది."

అదిరిపడ్డాడు సుధీర్.

నమ్మలేనట్టు నన్ను చూశాడు.

"సునీత హత్య చెయ్యబడిందా!'

"అవును. ఎవరో ఆమె పాలగ్లాసులో ఓవర్ డోస్‌లో స్లీపింగ్ పిల్స్ కలిపారు."

అతని కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఆ నిముషంలో అతని మొహం చూస్తే జాలివేసింది.

కొంచెంసేపు అతను మవునంగా వుండిపోయాడు.

తర్వాత "నా అక్కయ్యను హత్య చేసిన ఆ దుర్మార్గుడు ఎవరు? మా బావ సుధాకరేనా?" అన్నాడు.

"ఇంకా ఎవరో తెలీలేదు. బహుశా కొన్ని గంటల్లోనే అసలు హంతకుడిని పట్టుకుంటాను. వెళతాను. సారీ ఫర్ ది బాడ్ న్యూస్" అన్నాను అనునయంగా.

## 8

నాకు విసుగ్గా వుంది. నలుగురు అనుమానితుల్లో ఏ ఒక్కరూ సునీతను హత్య చెయ్యలేదంటున్నారు. అందరి మాటల్లో నిజాయితీ ధ్వనిస్తోంది.

సునీతను హత్య చేసే అవకాశం ఇంకా ఎవరికి వుంది? అవసరం ఏముంది? ఈ ప్రశ్నలకు జవాబులు తెలిస్తే హంతకుడు ఎవరో తెలిసిపోతుంది.

సునీతకు పాలు ఇచ్చే అవకాశం ఎవరికి వుంది? హత్య జరిగిన రాత్రి ఆ ఇంట్లో వున్నది ఎవరు?

సునీత భర్త మోహనరావు—నౌకరు రంగయ్య—ఆమెను కలుసుకున్న సుధాకర్—రామరాజు.

ఈ మనుషుల్లో ఒక్క నౌకరు రంగయ్యను వదిలేస్తే ఇంకెవ్వరూ సునీతకు పాలు కలిపి ఇచ్చే అవకాశంలేదు. ఒకవేళ ఇచ్చినా సునీత తీసుకోదు. ఇక వీళ్ళు ముగ్గురూ సునీతకు తెలియకుండా పాలల్లో స్లీపింగ్ పిల్స్ కలిపి వుండాలి. అటువంటప్పుడు అసలు సునీతకు పాలు కలిపి ఇచ్చిన మనిషి ఎవరు? నౌకరు రంగయ్య ఇచ్చివుండడు. అయినా రంగయ్యకు సునీతను హత్యచెయ్యవలసిన అవసరం ఏమీ కనిపించటంలేదు.

ఐతే, సునీత తనకు తనే పాలు గ్లాసులో పోసుకుని తాగిందా? అయితే అందులోకి స్లీపింగ్ పిల్స్ ఎలా వచ్చాయి? సునీత కలుపుకుందా? అలా అయితే సునీత ఆత్మహత్య చేసుకుని వుండాలి.

కాని సునీత ఆత్మహత్య చేసుకోలేదు. ఆత్మహత్య చేసుకునే ఉద్దేశమే సునీతకు వున్నట్లయితే ఆమె నన్ను కలుసుకుని నా సహాయం కోరేది కాదు.

సునీత హత్యచెయ్యబడింది.

అయితే, హత్యచేసిన మనిషి ఎవరు? మళ్ళీ పరిశోధన మొదటికి వస్తోంది.

ఆలోచిస్తున్నాను.

ఉన్నట్టుండి నాలో ఓ ఐడియా గబుక్కున మెరిసింది.

అంతే! ఫోన్ అందుకొని డయల్ చేశాను.

అవతలవైపు నించి నౌకరు రంగయ్య గొంతు వినిపిం

చింది.

"రంగయ్యా! నేను జగదీష్‌ని మాట్లాడుతున్నాను" అన్నాను.

"మీరా! మోహనరావు అయ్యగార్ని పిలిచేదా?" అన్నాడు.

"వద్దు. నాకో విషయం తెలియాలి. సునీతకు నిద్ర మాత్రలు వాడే అలవాటుందా?" అడిగాను.

"నెలరోజుల కిందటివరకు వుంది. కాని తర్వాత ఆమె నిద్రమాత్రలు వాడటం మానేసింది. ఒకరోజు ఇంట్లో మిగిలిపోయిన మాత్రలన్నీ బయట పారెయ్యటం నేను చూశాను."

"అసలు సునీత నిద్రమాత్రలు ఎందుకు వేసుకునేది?"

"ఆమెకు ఇంతకుముందు కొన్నిరోజులు తరచుగా ఏదో నొప్పివచ్చింది. రాత్రివేళల్లో నిద్రవుండేదికాదు. అందుకని డాక్టరు నెప్పి క్రమంగా తగ్గిపోతుందనిచెప్పి నిద్రపట్టటానికి నిద్రమాత్రలు వాడమని చీటీ రాసి ఇచ్చాడు. నెలరోజుల కిందటనుండి అమ్మగార్కి ఆ నెప్పి రావటం మానేసింది."

"సునీత నిద్రమాత్రలను ఎప్పుడూ తనే కొని తెచ్చుకునేదా?"

"తనే తెచ్చుకునేది. కాని అప్పుడప్పుడు...." చెప్పేశాడు రంగయ్య.

"థాంక్స్ రంగయ్యా" అని ఫోన్ పెట్టేశాను.

ఇప్పుడు నా ఆలోచనలు చురుగ్గా సాగుతున్నాయి.

నా కళ్ళముందు నా గదిలో ఎదురుగా కూర్చున్న సునీత కదులుతోంది—

# 9

"అదుగో. సునీతని హత్య చేసిన హంతకి" అన్నాను.

అందరం వంటగదిలోకి వెళ్ళాను.

గబుక్కున వెనక్కి తిరిగి మమ్మల్ని చూసి షాక్ కొట్టినదానిలా అయిపోయింది వంటమనిషి గోవిందమ్మ.

"ఎవరు? వంటమనిషా?" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"అవును. వంటమనిషే సునీతను హత్య చేసింది" అన్నాను.

గోవిందమ్మ మొహం నల్లగా అయిపోయింది. వంటి నిండా చెమటపట్టింది అప్పటికప్పుడే.

"నమ్మలేకుండా వున్నాను జగదీష్‌గారూ. గోవిందమ్మ ఈ హత్య చేసిందంటే" అన్నాడు మోహనరావు.

"ఎవ్వరూ నమ్మరు. కానీ ఈమే సునీతని హత్య చేసింది. కావాలంటే ఆమెను అడగండి. చెబుతుంది."

"నువ్వేనా సునీతను హత్య చేసింది" గర్జించి అడిగాడు ఇన్‌స్పెక్టర్.

ఆమె మాట్లాడలేదు. తలవంచుకుంది.

"ఆమె చెప్పలేదు. అసలు తనని అనుమానిస్తారనే గోవిందమ్మ అనుకోలేదు. ఈ హత్యకు కారణం నా దృష్టిలో ఓ నగ. దానికోసమే గోవిందమ్మ—సునీతను హత్య చేసింది తెలివిగా."

"అసలు మీరు గోవిందమ్మను ఎలా అనుమానించారు?" అడిగాడు మోహనరావు.

"సునీతకు పాలు ఇచ్చే అవకాశం ఎవరికి వుంది? ఒక్క గోవిందమ్మకే. కాని ఆ రాత్రి గోవిందమ్మ ఏడు గంటలకే ఇంటికి వెళ్ళిపోయాననీ, తెల్లవారి వచ్చాననీ చెప్పింది. కాని ఆమె అబద్ధం చెప్పింది. నిజానికి

అందరూ చూస్తుండగా ఏడు గంటలకే ఇంటికి బయలు దేరింది. వెళుతూ తను ఎప్పుడూ సునీతకు స్లీపింగ్ పిల్స్ కొనే మెడికల్ షాపులో స్లీపింగ్ పిల్స్ కొన్నది.

తర్వాత పదకొండు గంటలప్పుడు ఎవ్వరూ చూడకుండా ఇక్కడికి వచ్చింది. బహుశ సునీత మళ్ళీ వచ్చావేం? అని అడిగివుంటుంది. సునీతకు ఏదో జవాబు చెప్పి వుంటుంది. తర్వాత వంటగదిలోకి వెళ్ళి పాల గ్లాసులో స్లీపింగ్ పిల్స్ ఓవర్ డోస్‌లో కలిపి వేలి ముద్రలు పడకుండా పమిటతో తీసుకువచ్చి సునీత గదిలో పెట్టింది.

సునీతకు ఎటువంటి అనుమానమూ లేదు. అందుకే పాలు తాగి మత్తుకు లోనయ్యింది. ఆ మత్తులోనే ప్రాణం వదిలింది. వెంటనే ఆమె మెళ్ళో వున్న ఖరీదయిన గొలుసు తీసుకుని ఎవ్వరూ చూడకుండా ఇంటికి వెళ్ళి పోయి వుంటుంది. గోవిందమ్మ ఇల్లు సోదాచేస్తే ఆ గొలుసు దొరకవచ్చు" అన్నాను.

"ఆశ్చర్యంగా వుంది. మీరు చెప్పింది నిజమే అయి వుంటుంది. మేమెవ్వరం గమనించలేదు—చనిపోయిన సునీత మెళ్ళో ఎప్పుడూ వుండే ఆ గొలుసు లేదు" అన్నాడు మోహనరావు.

"అవును. నా దగ్గరకు వచ్చినప్పుడు సునీత మెళ్ళో ఓ గొలుసు వుంది. అది ప్రత్యేకంగా వుండి నా దృష్టిని ఆకర్షించింది. చనిపోయిన తర్వాత ఆమె మెళ్ళో గొలుసులేదు. తర్వాత నాకు ఈ విషయం గుర్తుకు వచ్చింది. బహుశ గోవిందమ్మ ఇంకా రాత్రి ఈ ఇంట్లో నించి విలువైన వస్తువులు డబ్బు ఏవైనా తీసుకెళ్ళి

వుండవచ్చు. ఆమె ఇల్లు సోదా చేయించండి" అన్నాను.

అప్పటికప్పుడే ఇన్‌స్పెక్టర్ ఓ కానిస్టేబుల్‌ని గోవిందమ్మ ఇంటికి పంపించాడు.

గోవిందమ్మ చేతులకు బేడీలుపడ్డాయి.

అనుమానితులు నలుగురూ హాయిగా ఊపిరి పీల్చుకున్నారు.

—:ఐపోయింది:—

# చస్తే చావనివ్వను!

## వసుంధర

రామచంద్రం ఆమెను పరీక్షగా చూశాడు.

ఆమె చాలా అందంగా వుంది.

సాధారణంగా అందమైన ఆడవాళ్ళు నలుగురి మధ్యా వున్నప్పుడు తమ అందాన్ని దృష్టిలో వుంచుకుని ప్రవర్తిసుంటారు. ఇబ్బందిగా ముఖం చిట్లించడం, చీటికీ మాటికీ టైము చూచుకోవడం, మెడలోని గొలుసు నోట్లో వేసుకుని నమలడం—ఇలాంటి చాలా లక్షణాలు రామచంద్రానికి అనుభవపూర్వకంగా తెలుసు.

కానీ ఈ అమ్మాయి అలా ప్రవర్తించడం లేదు.

ఆమె కళ్ళలో బెరుకుంది. చేతులు కంపిస్తున్నాయి. పెదవులు అదురుతున్నాయి. ఏదో జరగకూడని సంఘటన నెదుర్కొంటున్న దానిలా వున్నదామె. రామచంద్రాన్నామె బాగా ఆకర్షించింది.

రామచంద్రం ప్రస్తుతం ఖాళీగా వున్నాడు. అతడికి వుద్యోగం లేదు. ఉద్యోగం అవసరంలేదు. బిద్యో

ప్యాసయ్యాడు. ఆతడింకా తండ్రిచాటు బిడ్డ. పెళ్ళి కాలేదు. తండ్రి పెద్ద వ్యాపారస్తుడు. రామచంద్రం కాక ఆయనకింకా ఇద్దరు కొడుకులున్నారు. రామచంద్రా న్నాయన వ్యాపారంలో పెట్టదల్చుకోలేదు. అతడి సున్నితమన స్తత్వం వ్యాపారానికి అనుకూలం కాదు. ఏ పనీ లేకుండా అతడు హాయిగా జీవితాన్ననుభవించాలన్నదే ఆయన ఆశయం.

రామచంద్రానికా అమ్మాయిని వెంటాడాలనిపించింది. అలాగని అతడిది రోమియో మన స్తత్వం కాదు. అతడి వయస్సు ఇరవై నాలుగు. ఇంతవరకూ స్త్రీ సంపర్కం ఎరుగడు. పరాయి స్త్రీని పలకరించడం మర్యాదకే తప్పు వేళాకోళానికి చేయడతను.

ఒక్క మాటలో చెప్పాలంటే రామచంద్రం డబ్బున్న మంచివాడు.

ఈ మంచివాడికా యువతి వెంటపడి ఆమె గురించి తెలుసుకోవాలనిపించింది. ఎటువంటి పరిస్థితులు ఆమె ప్రస్తుత ప్రవర్తనకు దారితీశాయో తెలుసుకోవాలన్నది అతడి కోరిక.

బస్సు రాగానే ఆమె బస్సు యెక్కింది. అతడూ యెక్కాడు. ఆమె ఆంజనేయస్వామి కోవెల వద్ద బస్సు దిగింది. అతనూ దిగాడు.

ఆమె గుడిలోకి వెళ్ళి కొద్దిక్షణాల్లోనే బయటకు వచ్చింది. ఇప్పుడు ఆమె ముఖంలో కంగారు పెరిగింది. శరీరంలో వణుకు హెచ్చింది. చూడ్డానికి ఏదో ప్రమాదంలో వున్నట్లు వుంది.

రామచంద్రం కుతూహలం పెరిగింది. ఆమెను పలకరించి విషయం తెలుసుకోవాలన్న కోరిక అతడికి కలిగింది. బల

వంతాన అది అణచుకున్నాడు.

ఆమె నడక ప్రారంభించింది. ఆమెను అనుసరిస్తూ అతడు చాలా ఆశ్చర్యపడ్డాడు.

ఆమె వెనక్కు తిరిగి చూడడంలేదు. కానీ అడుగులు తడబడుతున్నాయి. ఆమె వెళ్ళే రోడ్డు ఊళ్ళోకి కాక ఊరి చివరకు దారితీస్తుంది. ఒంటరిగా ఒక యువతి జన సంచారం లేని ప్రాంతాలకు యెందుకు వెడుతోంది?

రామచంద్రానికి భయమేసింది. ఈమెగానీ తన ప్రియుణ్ణి కలుసుకోడానికి వెళ్ళడంలేదు కదా? అదే నిజమైతే అది రహస్య సమాగమం అయుండాలి. తాను దానిని బట్టబయలు చేయడం న్యాయమా?

ఏది ఏమయినా ఆమె గురించి తెలుసుకుని తీరాలని అతను నిర్ణయించుకున్నాడు.

ఉన్నట్టుండి ఆమె రోడ్డుపక్కకు మళ్ళింది.

రామచంద్రం వులిక్కిపడ్డాడు.

రోడ్డుపక్కన వున్నది అడవిలాంటి ప్రాంతం. ఈమె అందులోకి యెందుకు వెడుతోంది? అక్కడ యెక్కడా ఇళ్ళు లేవన్న విషయం తనకు తెలుసు. అలాంటప్పుడు యెవరినామె కలుసుకోబోతోంది?

అందులోనూ ఆమె వెనక్కు చూడదేం?

ఎవరైనా తనను అనుసరిస్తారన్న ఆలోచన ఆమెకు రావడంలేదా? వచ్చినా ఆమెకు భయంలేదా?

రామచంద్రం ఆమె కంటబడకుండా ఉండడానికి ప్రయత్నిస్తూనే ఆమెను అనుసరించసాగాడు.

ఆమె రోడ్డుపక్కనించి అడవిలోకి సుమారు కిలోమీటరు దూరం మాత్రం నడిచి ఆగింది.

ఆమె ఆగిన ప్రాంతంలో విశేషమేమీ లేదు. అది ఒక

పెద్ద చెట్టు.

ఆ యువతి చెట్టు మొదలు పరీక్షగా చూసి ఓ సారి ప్రదక్షిణం చేసి నెమ్మదిగా చెట్టు యెక్కింది. ఆమె చెట్టు యెక్కగలదని అతడనుకోలేదు. కానీ చెట్టుకూడా అందుకు చాలా అనుకూలంగా వుంది. చెట్టు యెక్కాక ఆమె నెమ్మదిగా ఓ కొమ్మమీదకు చేరింది. ఆమె ఎంత నాజూగ్గా వుందో చెప్పడానికన్నట్లు ఆమె భారానికా చెట్టుకొమ్మ ఏ మాత్రమూ కదలలేదు.

అక్కడ కూర్చుని ఆ యువతి ఓ పర్యాయం చుట్టూ చూసింది. రామచంద్రం ఆమెకంట పడకుండా జాగ్రత్త తీసుకున్నాడు.

ఆమె ఒక్కక్షణం తటపటాయించింది. తర్వాత నెమ్మదిగా తను కట్టుకున్న చీర విప్పింది.

అప్రయత్నంగా రామచంద్రం కళ్ళు మూసుకున్నాడు. అయితే అతడిలోని కుతూహలం అతిడి కళ్ళను త్వరగానే తెరిచేలా చేసింది. రామచంద్రం వూహించినట్లుగా ఆమె మిగతా బట్టలు విప్పలేదు. ఒక్క చీరను మాత్రమే విప్పి ఆ కొమ్మమీద నిలబడి వుంది.

రామచంద్రం ఆ యువతి అందాన్ని అప్పుడే గుర్తించాడు.

ఆ చెట్టు కొమ్మమీద ఆమె అలా లోపావాడతోనూ, జాకెట్టుతోనూ మాత్రమే నిలబడి—చేతిలో చీర పట్టుకుని ఏదో ఆలోచిస్తూండడం ఏదో అద్భుత రమణీయదృశ్యంలా కనిపించిందతనికి. అయితే ఆ దృశ్యం ఎంతోసేపు నిలబడలేదు. ఆమె చెట్టు కొమ్మమీద చతికిలబడి చీరను నిలువుగా జారవిడిచి చీరకొసను ఒకదానిని చెట్టుకు కట్టసాగింది. ముడిపెట్టేక ఆమె చీరను గట్టిగా లాగిచూసింది.

ముడి గట్టిగానే బిగుసుకుంది.

అప్పుడామె చీర రెండవ కొసను మెడలో వేసుకుని జారుముడి వేసింది. దాన్ని నెమ్మదిగా మెడకు బిగించింది.

రామచంద్రం జరగబోయేది ఊహించేలోగా ఆమె చటుక్కున ఎత్తైన ఆ కొమ్మమీంచి క్రిందకు దూకింది కానీ కిందపడలేదు. చెట్టుకొమ్మకు వేళ్ళాడుతోందామె. తను వేసిన ముడి మెడచుట్టూ బిగుసుకుంటున్నదేమో ఆమె కాళ్ళూ చేతులూ ప్రాణభయంతో ఆడించుతోంది.

## 2

రామచంద్రం చటుక్కున పరుగెత్తి చెట్టు యెక్కి కొమ్మను చేరి ప్రయత్నించి మీద ముడివిప్పి చీరను నేల మీదకు జారవిడిచాడు. చిన్నశబ్దంతో ఆమె నేలమీద పడింది.

అతను క్రిందకు దిగి ఆమెను పరీక్షించి చూశాడు. ఆమెకు శ్వాస ఆడుతోంది కానీ స్పృహ లేదు.

రామచంద్రం ఆమె మెడకున్న చీరముడి విప్పాడు.

ఇప్పుడు తనేం చేయాలి?

ఈమెకు ప్రథమచికిత్స అవసరం. అది తనకు చేత కాదు. ఈమె కిప్పుడు వైద్యం జరగాలంటే ఊళ్ళోకి తీసుకువెళ్ళాలి. ఊరు చాలా దూరం వుంది. అదీ ఈమెను మోసుకుని వెళ్ళాలంటే చాలా కష్టం.

దగ్గర్లో టాక్సీలు, రిక్షాలు దొరకవు.

చికిత్స చేస్తేతప్ప ఆమెకు స్పృహరాదు. స్పృహ వస్తే తప్ప తనామెను చికిత్సకు తీసుకువెళ్ళలేడు.

రామచంద్రం ఎంతోసేపు ఆలోచించనేలేదు. అతడి కళ్ళముందు ఓ యువకుడు ప్రత్యక్షమయ్యాడు. అతనక్క

డికి యెప్పుడు యెలా వచ్చాడో రామచంద్రానికి తెలియ లేదు.

"ఈమె ఉరి వేసుకోబోతే మీరు రక్షించారు కదూ?" అన్నాడా యువకుడు అక్కడి పరిస్థితినీ, రామచంద్రాన్నీ చూసి.

రామచంద్రం ఆశ్చర్యంగా ఆ యువకుడి వంక చూసి "ఇంత కరెక్టుగా విషయాన్నెలా ఊహించారూ?" అనడి గాడు.

"అది నా వృత్తిధర్మం. మే ఐ హెల్ప్ యూ" అన్నాడా యువకుడు.

"ఏమిటి మీ వృత్తి?"

"డిటెక్టివ్!" అని నవ్వాడా యువకుడు. తర్వాత అతను రామచంద్రం అనుమతి తీసుకోకుండానే ఆమెకు ప్రథమచికిత్స చేసి స్పృహ తెప్పించాడు.

స్పృహ రాగానే ఆ యువతి వెర్రిదానిలా కాసేపు అటూ ఇటూ చూసింది. తర్వాత నీరసంగా "నేనెక్క డున్నాను?" అంది.

"ఎక్కడున్నావో కాదు. ఎలా వున్నావో చూసుకో" అన్నాడా యువకుడు కాస్త కటువుగా.

ఆ యువతి చటుక్కున లేచి కూర్చుని తనవంక చూసుకునేలోగా రామచంద్రం పక్కన పడివున్న చీర నామెకు అందించాడు. ఆదరాబాదరాగా ఆమె ఆ చీరను కప్పుకుని—"నన్నెందుకు బ్రతికించారు?" అని ఏడ్వ సాగింది.

"నిన్ను బ్రతికించింది నేను కాదు ఇతను" అంటూ రామచంద్రాన్ని చూపించాడా యువకుడు.

ఆ యువతి రామచంద్రం వంక ఆశ్చర్యంగా చూసి

"ఎవరు మీరు? ఇక్కడికెలా రాగలిగారు?"

రామచంద్రం క్లుప్తంగా తన కథ చెప్పాడు.

ఆ యువతి కోపంగా రామచంద్రం వంక చూసి "ఏ ఉద్దేశంతో మీరు నన్నింతవరకూ వెన్నాడారు. నన్ను వెన్నాడే అధికారం మీ కెవరిచ్చారు? ఒంటరిగా చిక్కితే ఏదో చేద్దామనేగా?" అంది.

జవాబు చెప్పలేక రామచంద్రం తడబడ్డాడు. ఆమె కంఠస్వరం చాలా కోపంగా వుంది.

"నీ పేరేమిటోగానీ-మిస్! నిన్ను వెన్నాడడం ఇతను చేసిన తప్పయితే నీ ప్రాణాలు తీసుకోవడానికి ప్రయత్నించడం ఇంకా పెద్దతప్పు. ఆ తప్పుకు నువ్వు పోలీస్ స్టేషన్లో సంజాయిషీ ఇచ్చుకున్నాక అతని తప్పుకు సంజాయిషీ చెబుతాడు" అన్నాడా యువకుడు.

ఈ మాటలకా యువతి మొహం పాలిపోయింది. "నాకు జీవించాలని లేదు. నా ప్రాణం-నా యిష్టం. నన్ను మీ రెందుకు బ్రతికించాలి?"

ఆ యువకుడు రామచంద్రం పేరు అడిగి తెలుసుకుని "చూడండి మిస్టర్ రామచంద్రం! ఈమెను మీరు రక్షించారు. ఆమె ఎందుకు జీవించాలనుకోవడంలేదో తెలుసుకోవలసిన బాధ్యతా, కాపాడిన ఆమె ప్రాణాలను నిలబెట్టి ఆమెకు జీవించాలన్న ఆశ కలిగించే బాధ్యతా మీవే!" అన్నాడు.

ఇదంతా ఏదో పెద్ద నాటకమనీ తనేదో ట్రాప్‌లో పడుతున్నాననీ రామచంద్రం అనుమానించాడు. "నాకే బాధ్యతలూ వద్దు. నే నిక్కణ్ణుంచి వెళ్ళిపోతాను" అన్నాడు.

"ఈ నిర్ణయం బజార్లో ఆమెను చూచినప్పుడే తీసు

కని వుంటే ఇంత గొడవ వుండేది కాదుగదా-లేనిపోని బాధ్యతను మీరే కలిగించుకున్నారు" అన్నాడా యువకుడు.

"అసలు మీ రెవరు? ఇక్కడికెలా వచ్చారు?" అనడి గాడు రామచంద్రం.

"డిటెక్షన్ నా వృత్తి. అమాయకుల్ని చావనివ్వను. హంతకుల్ని బ్రతకనివ్వను" అన్నాడతను.

"నా ప్రశ్నకు సమాధానం రాలేదు" అన్నాడు రామచంద్రం.

"మిష్టర్ రామచంద్రం! ఈ యువతి బాధ్యత మీదని నా అభిప్రాయం. కాదని మీ రనుకుంటే నాకేమీ అభ్యం తరం లేదు. నేను బలవంతపెట్టను. నా స్కూటర్ మీద ఒకే మనిషికి కాళీ వుంది. వస్తానంటే మిమ్మల్ని తీసుకు పోతాను" అన్నాడా డిటెక్టివ్.

"మరి ఈమె సంగతి?" అన్నాడు రామచంద్రం.

"మీ రిద్దరూ ఇక్కణ్నుంచి ఎంత త్వరగా వెళ్ళిపోతే అంత సంతోషిస్తాను" అందామె చిరాగ్గా.

రామచంద్రం ఏమనుకున్నాడో యేమో "మిష్టర్ డిటెక్టివ్! మీరు వెళ్ళండి. ఈమె బాధ్యత నేను తీసు కుంటాను" అన్నాడు.

"ఓకే—గుడ్ లక్ టూ యూ" అంటూ ఆ యువ కుడు అక్కణ్నుంచి వెళ్ళిపోయాడు.

ఆమె మోకాళ్ళపై తల వంచుకుని వెక్కి వెక్కి యేడు స్తోంది.

ఆమెనెలా ఓదార్చాలో రామచంద్రానికి తెలియ లేదు. ఓపికగా అతను చాలాసేపు ఆ ఏడుపు విన్నాడు.

చివరికి ఆమె తనంతట తానే ఏడుపు ఆపి "మీరు

ఇక్కణ్నించి వెళ్ళరా?" అంది.

అతను కాస్త ధైర్యంగా "నిన్ను తీసుకుని వెడతాను" అన్నాడు.

ఆమె వెంటనే తన సంబోధన మార్చి "నేను నీ వెంట రాను" అంది.

"రానంటే బలవంతంగా తీసుకువెడతాను" అన్నాడు రామచంద్రం.

"అప్పుడు నువ్వు బలవంతం చేస్తున్నావని నలుగురిలో అల్లరి పెడతాను" అందా యువతి.

రామచంద్రం సాఫీగా "బలవంతం చేయాలంటే నాకు పెద్ద కష్టంకాదు. ఇప్పుడే ఇక్కడే ఈ క్షణం లోనే నిన్ను లొంగదీసుకోగలను. నా పేరున బ్యాంకులో లక్షలున్నాయి. ఇంట్లో నేనాడింది ఆట పాడింది పాట. అయినా ఇంతవరకూ ఒక్క బీరుచుక్క తాగలేదు. బజార్లో నిన్ను చూడగానే నువ్వేదో కష్టాల్లో వున్నావనిపించింది. ఆత్మహత్యకు ప్రయత్నించావంటే నీ దింకా పెద్దకష్టమే అయుండాలి. నీకు చేతనైనంతలో సాయపడాలన్నదే నా తాపత్రయం. నన్ను అర్థం చేసుకుని నాతో రా" అన్నాడు.

ఆ యువతి ఆశ్చర్యంగా అతడివంక చూసి—"ఏమిటి నీకు నాపై ఆసక్తి?" అంది.

"అనుకోకుండా నిన్ను చూశాను. అనుకోకుండా నిన్ను కాపాడాను. సాటిమనిషిగా నీకు సాయపడాలనుకుంటున్నాను. ఇంతకుమించి ఏమీ లేదు. నీ పేరు వివరాలు నేను తెలుసుకోవచ్చా?" అన్నాడతను.

"నా పేరు సీమ! నేను అనాధను. నాకెవ్వరూ లేరు!" అన్నదామె.

"సీమా! ముందు నువ్వు చీర సరిగా కట్టుకో. ఇద్దరం కలసి బయల్దేరి వెడదాం!" అన్నాడు రామచంద్రం.

# 3

"ఇది నా ఇల్లు. నా ఇల్లు అంటే నా ఇల్లే కానీ మా యిల్లు కాదు. ఇది నా పేరున ఉన్నది. మా ఇల్లు మా నాన్న పేరున ఉన్నది—" అన్నాడు రామచంద్రం.

అందమైన ఆ బంగళావంక అబ్బురంగా చూసింది సీమ. ఇద్దరూ ఇంట్లో ప్రవేశించాక అతను—"ముందు నీ కథ చెప్పు." అన్నాడు.

"నాకు కథలు చెప్పడం రాదు—" అందామె.

"ఏం వస్తే అవే చెప్పు!"

"నాకు మాట్లాడడం చేతగాదు."

"మరి?" అన్నాడతను.

"నాకు కబుర్లు చెప్పాలనిలేదు. కథలు చెప్పాలని లేదు. అసలు బ్రతకాలని లేదు...." అందామె.

"అదే....అందుకు కారణం ఏమిటో చెప్పు!"

"ఆత్మహత్య చేసుకోవాలనుకుంటే అందుకుండే కారణాలేమిటో ఊహించు. వాటిలో ఒకటి నాకూహించుకో—అంతకుమించి నన్నేమీ అడక్కు—నేను చెప్ప లేను" అందామె.

రామచంద్రం ఆశ్చర్యంగా ఆమెవంక చూశాడు. అందమైన ఆమె ముఖంలో అలసట కనబడుతోంది. కళ్ళలో నిరాశ కనబడుతోంది. శరీరంలో మాత్రం ఇదివరకటి ప్రకంపనం లేదు.

రామచంద్రం ఇంట్లో పనివాణ్ని పిల్చి—రెండు బోర్న్‌విటాలు కలిపి తీసుకురమ్మన్నాడు. అవి తయారై వచ్చేవరకూ ఇద్దరూ మౌనంగా ఉన్నారు.

బోర్న్‌విటా తాగుతూ—"నిన్ను వంచించిన ఆ దుర్మార్గుడెవరో చెప్పు. మీ ఇద్దరికీ పెళ్ళి జరిపిస్తాను—" అన్నాడు రామచంద్రం.

సీమ చిరాగ్గా అతడివంక చూసి — "మగ బుద్ధి పోనిచ్చుకున్నావు కాదు. నేను అంత సులభంగా నా శరీరాన్నెవ్వరికీ అప్పగించేదాన్ని కాదు. నన్ను వంచించింది మనుషులు కారు. విధి!" అంది.

"విధి నిన్ను ఎలా వంచించిందో నేను తెలుసుకో వచ్చా?" అన్నాడు రామచంద్రం.

"కూడదు—" అందామె.

రామచంద్రం కాసేపు ఆమెవంక చూసి—"సీమా! నీ అందం నన్నాకర్షించింది. నువ్వు నాకు నచ్చావు. నీ మనసే నా కర్థంకావడంలేదు. నీ మనసు మంచిదైన పక్షంలో నిన్ను నేను వివాహం చేసుకుంటాను"అన్నాడు.

సీమ తెల్లబోయి అతడివంక చూసి—"ఏమన్నావ్?" అంది.

"నీ ప్రాణాలు నిలబెట్టినవాణ్ని. నిన్ను బ్రతికించడానికి నా ప్రేమ అవసరమైతే అది జీవితాంతం ఇస్తానంటున్నాను—" అన్నాడు రామచంద్రం.

"చాలా 'థాంక్స్'. కానీ నాకు నీ ప్రేమ అవసరం లేదు—" అంది సీమ.

"నువ్విప్పుడేం చేయాలనుకుంటున్నావ్?" అన్నాడు రామచంద్రం.

"నీ ఇంట్లోంచి బైటపడి మళ్ళీ చావాలనుకుంటున్నాను—" అంది సీమ.

"నేను నిన్ను చావనివ్వను. అనుక్షణం నిన్ను వెంటాడుతూనే ఉంటాను—" అన్నాడు రామచంద్రం.

"ఇదెక్కడి గోల?" అంటూ విసుక్కుంది సీమ.

రామచంద్రం సీమనే పరిశీలనగా చూస్తున్నాడు. ఆమె ఎందుకు చావాలనుకుంటోంది? జీవితంపై విరక్తి కలిగేటంతటి సంఘటన ఆమె జీవితంలో ఏం జరిగింది? తన వంటి ధనిక యువకుడు చేయి అందిస్తున్నా అందుకోనన డానికి కారణమేమిటి?

"నాకు నిద్రవస్తోంది—" అంది సీమ.

రామచంద్రం ఓ గదిలోకి ఆమెను తీసుకుని వెళ్ళాడు. అక్కడ మంచం వుంది. అందమైన పరుపులున్నాయి. గదిలో ఫాన్ వుంది. మంచం భూమికి ఎంతో ఎత్తులేదు. అందువల్ల ఫాన్‌నుంచి ఆమె తనను తాను ఉరి వేసుకునే అవకాశం లేదు.

రామచంద్రం ఆమెకు పక్క చూపించి, ఆమె పడుకున్నాక గది తలుపులు బయటనుంచి తాళం వేసి—పని వాడితో—"లోపలేం హడావుడి జరిగినా వెంటనే నాకు ఫోన్ చేసి చెప్పు. నేను మా ఇంటి దగ్గరవుంటాను-" అన్నాడు.

ఇదంతా పనివాడికి విడ్డూరంగా వుంది. అలాగేనని తలూపాడు వాడు.

# 4

ఇంటికి వెళ్ళగానే తల్లికి జరిగింది చెప్పాడు రామచంద్రం. ఆమె అంతా విని—"ఆదే మాయదారి ముండో నని అనుమానంగా ఉందిరా—" అందావిడ.

"సీమను చూస్తే నువ్వలాగనవమ్మా—" అన్నాడు రామచంద్రం—"ఎందుకో ఆమె ఆత్మహత్య చేసుకునేందుకు ప్రయత్నించింది. ఆమెకు జీవితం మీద ఆశ కలిగించడంకోసం నేనామెను పెళ్ళి చేసుకుందుక్కూడా

సిద్ధంగా వున్నానని చెప్పాను. ఈ విషయం ఆమె రాత్రంతా ఆలోచించవచ్చును. ఈలోగా ఏ అఘాయిత్యం చేయకుండా ఉండడం కోసం గదిలో పెట్టి తలుపులు తాళంవేసి తాళంచెవులు కూడా తీసుకవచ్చాను. మీరంతా నన్నపార్థం చేసుకోకుండా ఉండడంకోసం నేనామెనక్కడే వదిలి మనింటికి వచ్చేశాను—"

"నీమీద అనుమానవేంటిరా—" అంది రామచంద్రం తల్లి—"నీలాంటి కొడుకును కన్నందుకు నాకెంతో గర్వంగా ఉంది. ఎటొచ్చీ కంగారుపడి దాన్ని పెళ్ళి చేసుకుంటానని మాటివ్వకు. మనది పరువున్న కుటుంబం. ఇంత పరువూ తీసేయడానికి ఒక్క కోడలు చాలు."

"రేపొక్కసారి నువ్వు నాతో వచ్చి ఆమెను చూడమ్మా—తర్వాత మనం అన్నీ మాట్లాడుకుందాం—" అన్నాడు రామచంద్రం.

మర్నాడుదయం ఎనిమిది గంటలకు రామచంద్రం, తల్లి కలిసి అతనింటికి వెళ్లారు. అతను తలుపులు తీసే సరికి సీమ ఇంకా లేవలేదు.

"కొంపదీసి ఏ అఘాయిత్యమైనా చేయలేదుగదా!" అని అతనామెను సమీపించి చూశాడు. రామచంద్రం తల్లి కూడా ఆమెను సమీపించి చూసి—."పిల్ల బంగారు బొమ్మలా ఉంది—" అనుకుంది.

సీమకు గాఢంగా నిద్రపట్టింది తప్పితే ఆమె ఏ అఘాయిత్యమూ చేయలేదు. సావిత్రమ్మ సీమను కుదిపి లేపింది. కళ్ళు నులుముకుంటూ లేచిన సీమ సావిత్రమ్మను చూసి ఉలిక్కిపడింది.

"మా అమ్మ— పేరు సావిత్రమ్మ!" అన్నాడు రామచంద్రం.

"నమస్కారం!" అంది సీమ.

"నీ కథ మా అబ్బాయి చెప్పాడు. నాకు చూపించాలని తీసుకొచ్చాడు. నువ్వెక్కడెందుకూ—మా ఇంటికొచ్చి ఉందువుగాని—" అంది సావిత్రమ్మ.

"మీరేమంటున్నారో నాకర్థం కావడంలేదు—" అంది సీమ ఆశ్చర్యంగా. రామచంద్రం ఇంత త్వరగా తనను తల్లికి పరిచయం చేస్తాడని ఆమె ఊహించలేదు. అతడి నిర్మలత్వం ఆమెను కదిలించింది.

"నీ కష్టమేమిటో మాతో చెప్పుకోకపోతే మానె. కాస్త మనసు కుదుటపడేవరకూ మా ఇంట్లో ఉండి వెళ్ళు—" అంది సావిత్రమ్మ.

సీమ చలించిపోయింది. రామచంద్రం తల్లి అతడి కంటే మంచిదానిలా ఉంది. ఆమె చటుక్కున రెండు చేతుల్లో ముఖం కప్పుకుని ఏడ్వసాగింది.

సావిత్రమ్మ ఆమె పక్కనే కూర్చుని—"నీ మనసులో బాధేమిటో నాకు చెప్పకూడదా?" అని అడిగింది.

చీరకొంగుతో కన్నీళ్ళొత్తుకుంటూ—"నా కష్టం ఒకరితో చెప్పుకునేదికాదు...." అంది సీమ.

## 5

నాలుగు రోజుల్లోనే సీమ రామచంద్రం కుటుంబంలో ఒక సభ్యురాలైపోయింది.

రామచంద్రం అన్నగారిద్దరికీ వివాహాలైపోయాయి. అతడి వదినగారిద్దరూ ఆమెను మరదలా అంటూ హాస్యమాడేవారు. సావిత్రమ్మ ఆమెను అభిమానంగా చూసుకునేది.

అంత డబ్బున్న వాళ్ళింట్లో అంతటి ప్రేమాభిమానాలుండడమూ, అవి తనబోటి సామాన్యురాలికి లభించ

డమూ సీమకు ఆశ్చర్యంగా వుంది. ఇంట్లోని మగవా ళ్ళెవ్వరూ ఆమె గురించి పట్టించుకోలేదు. ఆ కుటుంబపు సంస్కారం అద్భుతమనిపించింది సీమకు.

ఆ రోజు రామచంద్రం ఆమెను తీసుకుని పార్కుకు వెళ్ళాడు. ఆమె తన పక్కన నడుస్తూంటే అతడికో విధమైన ఆనందం కలిగింది.

"వయసు మనిషికి దేవుడిచ్చిన వరం. వయసులో చచ్చిపోవడం మనిషికి శాపం—" అన్నాడు రామ చంద్రం—ఇద్దరూ పార్కులో ఒకచోట కూర్చున్నాక.

"నా జీవితానికి శాపాలే తప్ప వరాలు లేవు—" అంది సీమ.

"సీమా—నీ మనసులోని బాధ ఏమిటో నాకైనా చెప్పుకోలేవా?" అన్నాడు రామచంద్రం బాధగా.

"చెప్పుకో గలిగితే ఎప్పుడో చెప్పుకునేదాన్ని. నువ్వు తప్ప నాకిప్పుడెవరున్నారు?" అంది సీమ.

"నేను నిన్ను పెళ్ళిచేసుకుంటాను. అయినా నీ గతం నాకు చెప్పవా?"

"శారీరకంగా పవిత్రురాల్ని. ఇంతకుమించి నా గతం ఎవరికీ చెప్పడం నాకిష్టంలేదు—" అంది సీమ. హఠాత్తుగా ఆమె శరీరం వణకనారంభించింది. ఆమె పెదాలు కంపి స్తున్నాయి.

"మిస్టర్ రామచంద్రం—నేను తర్వాత వస్తాను. నువ్వు వెళ్ళు—" అందామె.

హఠాత్తుగా ఆమెలో వచ్చిన మార్పుకు కారణం రామచంద్రానికి తెలియలేదు—"ఏమయింది సీమా!"

"నాకు చిన్న పని ఉంది—" అందామె.

"నేను నిన్ను ఒంటరిగా వదలను—" అన్నాడు

రామచంద్రం.

సీమ అతనివంక మౌనంగా చూసి—"నువ్వు నన్నెందుకిలా చంపుతున్నావ్—రామచంద్రం!" అంది.

"నేను నిన్ను చంపుతున్నానా?" ఆశ్చర్యంగా అన్నాడు రామచంద్రం .... "నువ్వు చావకుండా ఆపాలన్నదే నా ప్రయత్నం సీమా!"

సీమ మాట్లాడకుండా లేచి నిలబడింది—"పద—పోదాం—" అంది.

ఇద్దరూ నడక ప్రారంభించారు.

పార్కులో ఓ మూలగా నుయ్యి ఉంది. సీమ అక్కడకు దారితీసి—"దాహంగా ఉంది రామచంద్రం—" అంది. ఆమె కంఠం వణుకుతోంది.

"పద—పోయి కూల్ డ్రింక్స్ తాగుదాం—" అన్నాడు రామచంద్రం.

"కూల్ డ్రింక్స్ దాహాన్ని తగ్గించవు. నాకు మంచి నీళ్ళు కావాలి. ఈ నూతి దగ్గర బకెట్ లేదా!" అందామె.

నూతి దగ్గర బాల్చీ లేదు. రామచంద్రం ఓసారి నూతి చుట్టూ ప్రదక్షిణం చేసి పెదవి విరిచాడు.

"ఆ మూల పార్కులోని మొక్కలకు నీళ్ళుపోసే మాలి వున్నాడు, అతనివద్ద బాల్చీ ఉందనుకుంటాను...." అంది సీమ రామచంద్రానికి ఓ వైపుగా చూస్తూ.

రామచంద్రం ఏమీ అనుమానించకుండానే అటుగా వెళ్ళాడు. అతడు అలా వెళ్ళేసరికి ఎవరో—"అరే—ఆమె ఎవరో నూతిలో దూకేసింది—" అంటూ అరిచారు.

కానేపట్లో నూతిచుట్టూ చాలామంది చేరారు. రామచంద్రం కూడా పరుగున అక్కడికి వచ్చేలోగా ఓ యువకుడు హఠాత్తుగా నూతిలోకి దూకి మునకలు

వేస్తున్న సీమను పట్టుకుని ఆపాడు. నూయి కాస్త లోతుగా ఉండడంవల్ల అతడామెను పైకి తేలుస్తూ తను తేలడానికిబ్బంది పడుతూ—"త్వరగా మాకు ఏదైనా హెల్ప్ చేయండి—" అంటూ అరిచాడు.

అక్కడ జనం కాస్త హడావుడి చేశారు. నెమ్మదిగా లోపలికి లావుపాటి మోకుకు కట్టిన ఓ పెద్ద బుట్ట దింపి మొత్తంమీద ఇద్దర్నీ బైటకు లాగారు.

ముందు ఆమెకు ప్రథమ చికిత్స జరిగింది. రామచంద్రం ఆమె పరిస్థితి గురించి చాలా ఆత్రుతగా వున్నాడు. ఆమెకు స్పృహ రాలేదు కానీ ప్రాణం దక్కినట్లే ఉంది. అప్పుడే అతడు ఆమెను రక్షించిన యువకుని గమనించాడు. రామచంద్రం ఆశ్చర్యానికి అంతులేదు. అతను డిటెక్టివ్!

"హలో—మీరా!" అన్నాడు రామచంద్రం.

"అవును—నేనే!" అన్నాడు డిటెక్టివ్.

అప్పటికి సీమకు స్పృహవచ్చింది. "కనుక్కోండి. ఎందుకు నూతిలో దూకిందో—" అంటూ అరిచారు కొందరు.

"ఆమెను కంగారుపెట్టకండి. దూరాన్నుంచి నేను చూశాను. ఆమె కావాలని నూతిలో దూకినట్లు నాకు అనిపించలేదు. నూతిగట్టుపై కూర్చోవాలనుకుని అందులో పడింది—" అన్నాడు డిటెక్టివ్.

"ఏం జరిగింది?" అంది సీమ. ఆమె భూమ్మీదకు వచ్చినా మాట ఇంకా నూతిలోంచి వస్తున్నట్లే ఉంది.

"ఏమీ లేదు. నూతిగట్టుమీద కూర్చోబోయి— అందులో పడ్డావు. నేను నిన్ను రక్షించాను. ప్రాణాలు ఎంతో విలువైనవి. వాటిని మనం జాగ్రత్తగా కాపాడు

కోవాలి—" అన్నాడు డిటెక్టివ్.

ఆమె చలికి వణుకుతోంది. డిటెక్టివ్ ఆమెతో "తర్వగా ఇంటికి వెళ్ళు" అన్నాడు.

జనం ఒక్కొక్కరే వెళ్ళిపోసాగారు. రామచంద్రం, సీమ, డిటెక్టివ్ మిగిలారు.

"నన్నెందుకు బ్రతికించారు?" అంటూ సీమ ఏడ్వడం మొదలుపెట్టింది.

డిటెక్టివ్ చిరాగ్గా "నీ ఆత్మహత్య ప్రయత్నం కాదు గానీ మగాళ్ళ ప్రాణాలు తీస్తున్నావు. దేవుడు నీకు ఇంత అందం ఇవ్వకుండా వుండాల్సింది. ఉరి వేసుకున్నప్పుడు చీర విప్పేశావు. ఇప్పుడు చీర ఒంటిమీద వున్నా నీ ఒంపుసొంపులన్నీ స్పష్టంగా కనబడి మగాడి ప్రాణాలు జివ్వుమనిపిస్తున్నాయి-ఇలా అన్నందుకు మీరు నన్ను మన్నించాలి మిష్టర్ రామచంద్రం! ఆమె ఒంపుసొంపుల పై పరాయి మగాళ్ళ దృష్టి పడకుండా ఉండాలంటే మీరు ఆమె విషయంలో మరింత జాగ్రత్త తీసుకోవాల్సి వుంటుంది?" అన్నాడు.

అతడి మాటలకు సీమ ముడుచుకుపోయింది. రామచంద్రం అదోలా ముఖం పెట్టి—"ఈమె ఆత్మహత్యా ప్రయత్నం చేసినప్పుడల్లా మీరు ప్రత్యక్షమవుతున్నారు. ఈమె యెప్పుడు చావాలనుకునేదీ మీకు ముందే తెలుస్తోందనుకుంటాను. అలా తెలిసినప్పుడల్లా మీరు నన్ను కాస్త ముందే హెచ్చరించరాదూ!" అన్నాడు.

డిటెక్టివ్ నవ్వాడు "నేను డిటెక్టివ్‌ని. అమాయకుల్ని చావనివ్వను. అందువల్ల ఈమెను రెండు పర్యాయాలు కాపాడాను. కానీ నేను సామాన్య మానవుణ్ని కూడా. ఎల్లకాలం ఆమెను రక్షించగలనని అనుకోను

కూడా. ఎల్లకాలం కనిపెట్టుకుని వుండే మీదే ఆ బాధ్యత!"

రామచంద్రం డిటెక్టివ్‌కి ధన్యవాదాలు చెప్పి, ఓ టాక్సీని పిలిచి అందులో సీమతో కలిసి ఇంటికి వెళ్ళి పోయాడు. ఇంటివద్ద తల్లికి అతను క్లుప్తంగా జరిగింది చెప్పాడు. సావిత్రమ్మ అంతా విని ఆశ్చర్యపడి సీమను మరింత ప్రేమగా దగ్గరకు తీసుకుని "నీ కష్టాలేమిటో మాకు చెబితే శాయశక్తులా ప్రయత్నించి అవి తీర్చ డానికే యత్నిస్తాం. అసలు నీ కథేమిటో చెప్పమ్మా!" అంది.

సీమకు తప్పలేదు. ఇంతగా అభిమానిస్తున్న సావి త్రమ్మను కాదనడం ఆమె వల్లనయ్యేలాలేదు. అందువల్ల ఆమె తన కథ ఆవిడకూ, రామచంద్రానికీ చెప్పడానికే నిర్ణయించుకుంది.

## 6

సీమకు తన తలిదండ్రు లెవరో తెలియదు. అనాథ శరణాలయంలో పెరిగింది. ఇంటర్ దాకా చదువుకుంది. టైపూ, షార్టుహ్యాండూ నేర్చుకుని ఓ చిన్న ఉద్యోగం సంపాదించుకుని శరణాలయం వదిలిపెట్టింది.

శరణాలయాన్ని నడిపినావిడ ఉత్తమురాలు. చెప్పుకో దగ్గ మధురానుభూతు లక్కడ లేకపోయినా సాధా రణంగా నలుగురూ చెప్పుకునే కష్టాలు కూడా ఆమె కక్కడ యెదురుకాలేదు. అందులోనూ అందమైన ఆడ పిల్లగా సీమ తన పవిత్రతను కోల్పోవాల్సిన పరిస్థితి ఎన్నడూ ఏర్పడలేదక్కడ.

ఉద్యోగంలో చేరేక సీమకు నిజమైన ఇబ్బందు లెదు రయ్యాయి. ఆమె అనాథ అని తెలిసి చాలా మంది మగ

వాళ్ళు ఆమెపై ఆశలు పెంచుకోసాగారు. ఆ ఆశలు పెళ్ళికోసం కాదు. డబ్బిచ్చి కొనుక్కోవడం కోసం. అందులో ఆమె బాస్ కూడా వున్నాడు. సీమ ఈ వాతావరణంలో యెలాగో రోజులు నెట్టుకుంటూ వస్తోంది.

తనకు వివాహమైతే ఓ పురుషుడి రక్షణ లభిస్తుందనీ అప్పుడు తనకీ బాధలుండవనీ సీమకు అనిపించింది. అందుకే ఆమె వివాహం కోసం ఆత్రపడసాగింది.

అలాంటి సమయంలో ఆమెకు మోహనరావు పరిచయ మయ్యాడు.

అనుకోకుండా ఒకరోజున సినిమాహాలు దగ్గర వారి పరిచయం జరిగింది. రష్‌గా వున్న సమయంలో ఆమె మోహనరావుకి టికెట్ తీసిపెట్టింది. ఆ కారణంగా ఇద్దరూ పక్కపక్కన కూర్చుని సినిమా చూశారు. ఆ కారణంగా సినిమాకంటే ఎక్కువగా కబుర్లలో పడ్డారు. ఆ పరిచయం స్నేహంగా మారింది.

ఒకరోజు సీమ అతడికి తన కథ చెప్పేసింది. ఇబ్బందులు చెప్పుకుని వాపోయింది. స్వల్పపరిచయంలోనే మోహనరావుకు తన ఇబ్బందులు ఆమె చెప్పుకోగలగ డానికి రెండు కారణాలున్నాయి. ఒకటి మోహనరావు చలాకీతనం. అతడెంతటి అపరిచితులనైనా క్షణంలో పరిచితుల్ని చేసుకోగలడు. రెండు సీమను కలవరపెడుతున్న ఇబ్బందులు.

మోహనరావు ఆమెపై జాలిపడి "నీ అందం అద్భుతం. అనాథవన్న కారణంగానే వివాహం జరగదంటే నేను నమ్మను" అన్నాడు.

సీమ తటపటాయించకుండా "పోనీ నీ సంగతి చెప్పు.

నువ్వు నన్ను పెళ్ళి చేసుకుంటావా?" అని అతణ్ని సూటిగా ప్రశ్నించింది.

"నువ్వు నమ్మినా నమ్మకపోయినా నాకూ ఓ కథ వుంది. చిన్నతనం నుంచీ నాతోనే కలిసి పెరిగి నాపై ఆశలు పెంచుకున్న నా మరదలు లలిత వుంది. నేను కాదంటే అది చచ్చిపోతుంది" అన్నాడు మోహనరావు.

సీమ అతడి మాటలు నమ్మలేదు.

"నాకు నీమీద పూర్తి సానుభూతి వుంది. లలితంటే నాకు ఇష్టముంది కానీ దాన్ని నా జీవిత భాగస్వామిగా చేసుకోవాలన్న కోరిక నాకులేదు. తప్పనిసరి పరిస్థితుల్లో పెద్దల నిర్ణయానికి ఒప్పుకున్నాను."

"నువ్వు డబ్బున్నవాడివి. సమాజంలో హోదా వున్నవాడివి. మీదుమిక్కిలి అనాథవు కావు. నీ మరదలూ అంతే! ఆమెకు పెళ్ళి కావాలంటే కష్టంకాదు. నీకంటె మంచివాణ్ని, గొప్పవాణ్ని చూసి ఆమెకు పెళ్ళి చేయవచ్చు. కానీ నా విషయంలో అలాకాదు. నన్ను పెళ్ళాడతానంటూ ముందుకొచ్చే మగాళ్ళే వుండరు. ఇన్నాళ్ళకు నువ్వొచ్చావు. నువ్వైనా వంకల కోసం వెతుకుతున్నావని నా కనుమానం. కానిపక్షంలో నీ మరదల్ని ఒప్పించు" అంది సీమ.

ఓ నాలుగు రోజులు మోహనరావు సీమకు కనిపించలేదు. తర్వాత ఓ రోజు అతనుత్సాహంగా సీమను కలుసుకుని "నా మరదలు మన పెళ్ళికి ఒప్పుకుంది" అన్నాడు.

సీమ సంతోషానికి మేరలేదు. ఇద్దరూ పార్కుల్లో విహరించారు. కలిసి ఎన్నో కలలు కన్నారు.

ఒకరోజు మోహనరావు విచారంగా వచ్చాడు. సీమ

కంగారుపడింది.

"నా మరదలు మళ్ళీ ఒప్పుకోవడంలేదు. నన్ను పెళ్ళి చేసుకోకపోతే ఉరేసుకు చస్తానంటోంది" చెప్పాడు.

"మరి నేనేం చేయాలి?" అంది సీమ అయోమయంగా.

మోహనరావు మాట్లాడలేదు.

"లలితకు నా అన్నవాళ్ళున్నారు. ఆమెను వెయ్యి కళ్ళతో కాపాడుకునేవారున్నారు. నేనేమైపోయినా యెవ్వరికీ అక్కర్లేదు, ఎవ్వరూ పట్టించుకోరు. పోనీలే—నేనే ఉరేసుకు చస్తాను" అంది సీమ.

"అంతపని చేయకు సీమా! నువ్వు లేని బ్రతుకు నాకు శూన్యం!" అన్నాడు మోహనరావు కంగారుగా.

"మరేం చేయాలో చెప్పు!" అంది సీమ.

"ఒక్కసారి నువ్వూ, లలితా కలిసి మాట్లాడుకో రాదూ!" అన్నాడు మోహనరావు.

"అలాగే—" అంది సీమ.

ఇద్దరికీ పార్కులో సమావేశం ఏర్పరచాడు మోహనరావు. అతను మాత్రం వాళ్ళ మధ్యలేడు.

"నాకంటే చాలా అందంగా ఉన్నావు. అందుకే బావ నీపై మోజుపడ్డాడు—" అంది లలిత.

"సాటి ఆడదాని అందాన్ని మెచ్చుకున్నావు. నీ మనసు చాలా మంచిది—" అంది సీమ.

"పొగడ్తలయ్యాయి కదా—ఇంక విషయానికి వద్దాం—" అంది లలిత.

లలితది పేరు ప్రతిష్ఠలున్న కుటుంబం. మచ్చలేని వంశం. మోహనరావు సీమను చేసుకుంటే ఆ వంశానికి మచ్చ ఏర్పడుతుంది. అది మాయని మచ్చ అవుతుంది.

"చంద్రుడిలో మచ్చవుంది. అందమైన అమ్మాయి

ముఖంలో మచ్చలేకపోతే కావాలని బ్యూటీ స్పాట్ పెట్టుకుంటుంది. మచ్చ ఉండడం ఈ రోజుల్లో ఫ్యాషన్!" అంది సీమ.

"అనాధగా పుట్టి పెరిగావు కాబట్టి మచ్చపై నీ కిలాంటి అభిప్రాయముండడం సహజం. కానీ మచ్చల విషయంలో నా అభిప్రాయం వేరు—" అంది లలిత.

లలిత ముఖంలో ఎక్కడా మచ్చలేదు. ఆమె బ్యూటీ స్పాట్ కూడా పెట్టుకోలేదు. కానీ సీమ ముఖంలో ఓ మచ్చ ఉంది. నల్లటి ఆ మచ్చ కారణంగానే ఆమె సౌందర్యం ద్విగుణీకృతమైంది.

"ఏమంటావ్ నువ్వు?" అంది సీమ.

"మచ్చ ఉండే జీవితం నువ్వు కోరుకో. మచ్చలేని జీవితం నాకు కావాలి—" అంది లలిత.

కోపం, అసహ్యం, బాధ ఒక్కసారిగా కలిగాయి సీమకు.

"మచ్చ ఉండే జీవితం అంటే?"

"పెళ్ళిగురించీ ఆట్టే ఆలోచించకపోవడం!" అంది లలిత.

"ఇంకాస్త వివరంగా చెబుతావా?"

"చెప్పను—" అంది లలిత.

"నీ బావకున్న సంస్కారమే నీకూ ఉంటుందను కున్నాను. ఇలా మాట్లాడతావని తెలిస్తే నిన్ను కలుసు కునేందుకు అంగీకరించేదాన్ని కాదు—" అంది సీమ.

"నాకూ సంస్కారముంది. కానీ అది సంస్కార వంతులముందే బయటపడుతుంది. పక్కను ఎవరైనా ఛీ అని గెంటేస్తారు తప్ప ఏనుండీ బయటకు దయ చేయండీ—అని మర్యాదగా చెప్పరు—" అంది లలిత.

సీమ ఆవేశాన్నణచుకోలేక లలితను సాచి లెంపకాయ కొట్టి అక్కణ్నించి లేచి వెళ్ళిపోయింది.

మర్నాడు మోహనరావు సీమను కలుసుకుని-"ఒక్క క్షణంలో లలిత ఇంతగా మారిపోతుందనుకోలేదు. ఆమె మన పెళ్ళికి అంగీకరించింది. నిన్ను అదే పనిగా పొగుడు తోంది—" అన్నాడు.

తనచేత చెంపదెబ్బ తిన్న లలిత తనను పొగుడు తోందా—అంటే నిన్నటి ఆమె ప్రవర్తనకు కారణ మేమిటి?

సీమ తమ సంభాషణా వివరాలు మోహనరావుకు చెప్పలేదు. ఎందుకంటే అతనా రోజు లలిత ఇంట్లో తమ సమావేశం ఏర్పాటుచేస్తున్నాడు. తమ పెళ్ళికి ముహూర్తాలు నిర్ణయిస్తారు. అలాంటప్పుడు ఇంక గతం తవ్వుకుని ప్రయోజన మేముంది?

రాత్రి మోహనరావు లలిత ఇంటికి తీసుకువెళ్ళాడు. అక్కడ లలిత ఒక్కర్తే ఉంది. పురోహితుణ్ని పిల్చుకుని వస్తానని అతను బయటకు వెళ్ళిపోయాడు.

"నిన్ను నేను అపార్థం చేసుకున్నాను. మన్నించు-" అంది సీమ.

"ఇప్పుడూ చేసుకుంటున్నావని నా అనుమానం—" అంది లలిత.

సీమకు ఆమె మాట అర్థంకాలేదు. అదే ఆమెకు చెప్పింది.

"నీకు గ్రహింపుశక్తి తక్కువనుకుంటాను. అందుకే ఇక్కడకు పిలిపించాను. మచ్చ ఉండే జీవితమంటే ఏమిటని అడిగావు కదూ—అదేమిటో వివరంగా చెప్ప మన్నావుకదూ—అందుకే నిన్నిక్కడకు పిలిపించాను—"

అంది లలిత.

"ఎందుకంత శ్రమ?" అంది సీమ.

"నీకు మచ్చపడితే తప్ప నా బావ నిన్ను వదలడు. అందుకని!" అంది లలిత.

అది లలిత ఇల్లు కాదుట. నామీద మచ్చ వేయాలని లలిత నన్నక్కడకు తీసుకువచ్చిందట.

"ఎలా చేస్తావ్ మచ్చ?" అనడిగింది సీమ.

"ఇలా?" అన్న ఓ పురుష కంఠం వినిపించింది. ఎవడో పురుషుడు సీమ చేయి పట్టుకున్నాడు.

సీమ చేయి వదుల్చుకుంటూ—"ఎవరు నువ్వు?" అంది.

"పరాయి మగాడు చేయిపట్టుకుంటే ఎవర్నువ్వు అనడిగేది మా కుటుంబాల లక్షణం. అనాథవైన నీకు అలాంటి ప్రశ్న అడగాల్సిన అవసరంలేదు—" అంది లలిత.

సీమ కా క్షణంలో కలిగిన కంపరమంతా ఇంతాకాదు, ఆమె సర్వశక్తులూ క్రోడీకరించుకుని అక్కణ్నించి పారి పోగలిగింది.

అయితే కథ అప్పటితో ముగియలేదు. ఆ రోజు లలిత దగ్గర సీమ చేయి పట్టుకున్న మనిషి ఆమెను తర్వాతనుంచీ వెన్నాడసాగాడు. సీమ అతడికి భయ పడింది. మోహనరావుకి విషయం చెబుదామంటే అతను మళ్ళీ కనబడలేదు. ఆ మనిషి మాత్రం రోజూ ఆమెను వెన్నాడాడు.

ఒకరోజు సీమకు లలిత బజార్లో కనబడింది. సీమ ఆమెను పలకరించి ఆపి తనను వెన్నాడుతున్న మగమనిషి గురించి చెప్పింది.

"వాడు నిన్ను వదలడు. ఏదో ఓ రోజున నీకు మచ్చ తెస్తాడు. బావ గురించి మరిచిపోతే వాడు నీ జోలికి రాడు—" అంది లలిత.

సీమకు లలిత చాలా ప్రమాదకరమైన మనిషనిపించింది.

సీమ, లలిత చెప్పిన షరతులన్నింటికీ ఒప్పుకుంది. మోహనరావు పోతే పోయాడుకానీ తనిలా వెంటాడబడడం ఆమెకు ఇష్టంలేదు.

లలిత, సీమను మెచ్చుకుని వెళ్ళిపోయింది.

మర్నాడు సీమను మోహనరావు కలుసుకున్నాడు.

"ఇకమీదట నువ్వు నన్ను కలుసుకోవద్దు—" అంది సీమ.

"ఎందుకని?"

"నీ మరదలు లలితను పెళ్ళిచేసుకుని హాయిగా ఉండు. నా జోలికి రాకు" అంది సీమ.

మోహనరావామెను కారణాలడిగాడు. సీమ చెప్ప లేదు. సీమ చెప్పకపోతే తను చచ్చిపోతానన్నాడు మోహనరావు. అయినా సీమ చెప్పలేదు. మోహనరావు వెళ్ళిపోయాడు.

నాలుగు రోజుల తర్వాత సీమకు మోహనరావు కనిపించాడు. అతడి గెడ్డం మాసివుంది. ఒక విషాద ప్రేమికుడిలా ఉన్నాడతను. అయినా సీమ అతన్ని పలకరించ లేదు.

తర్వాతనుంచి మోహనరావు రోజూ ఆమెకు కనిపిస్తూనే ఉన్నాడు. రోజురోజుకీ అతడి పరిస్థితి దిగజారుతోంది.

ఆఖరికి సీమ ఓ రోజున అతడితో మాట్లాడి—"నీ

మరదలికి అభ్యంతరం లేకపోతే నన్ను పెళ్ళాడతానన్నావు. నీ మరదలు నిన్నొదులుకోలేదు. మా ఇద్దర్లో ఒకరు త్యాగం చేయక తప్పదు. నేను చేశాను. నా త్యాగం నీ కిష్టంలేకపోతే—నువ్వే ఓ నిర్ణయం తీసుకుని నీ మరదలికా విషయం చెప్పి ఒప్పించిరా. అప్పుడు నేను నిన్ను పెళ్ళాడతాను. ఇలా నన్ను కాల్చకు. ఇందులో నేను చేసిందేమీ లేదు—" అంది.

"నా మరదలికి నచ్చచెప్పలేను. నిన్నొదులుకోలేను. నాకు నువ్వే కావాలి. అదే జరిగితే నా మరదలు చచ్చిపోతుంది. నేను చచ్చిపోవాలి. లేదా నీకు నచ్చని పని చేయాలి!" అన్నాడు మోహనరావు.

"అదేమిటి?"

మోహనరావు వివరించాడు. అతడు సీమను వివాహం చేసుకుంటాడు. ఆ విషయం రహస్యంగా ఉంటుంది. అతడు లలితను కూడా వివాహం చేసుకుంటాడు. అందుకు సీమ వ్రాతపూర్వకంగా సమ్మతినివ్వాలి.

"నువ్వు జైలుకిపోతావు—" అంది సీమ.

"లలిత నన్ను జైలుకి పంపదు. నీ సంగతే చెప్పాలి!"

మోహనరావు పరిస్థితి చూస్తే జాలివేసింది. కానీ అతడి ప్రతిపాదన ఆమెకు నచ్చలేదు. మోహనరావుకు ఇద్దరు పెళ్ళాలు కావాలి. కానీ తనకు ఇద్దరు పెళ్ళాల్లో ఒకతెగా ఉండడం ఇష్టంలేదు.

"సమాజంలో అప్పుడు నా స్థానమేమిటి?"

"ఒక ధనవంతుడి మొదటి భార్యవు—" అన్నాడు మోహనరావు. అతడు తన ఇంట్లో రెండు పెళ్ళిళ్ళు చేసుకున్న వివరాలు చెప్పి—"నిజానికి ఇద్దరు పెళ్ళాలు కావాలని నాకు లేదు. అందులో ఎన్నో ఇబ్బంది

లున్నాయి. కానీ మీ ఇద్దర్నీ ఇబ్బంది పెట్టలేక ఈ నిర్ణయం తీసుకున్నాను—" అన్నాడు.

సీమ బాగా ఆలోచించింది. "నీ సమస్య తీరుతుం దంటే నువ్వు చెప్పినట్లు చేస్తాను—" అందామె చివరకు.

ఆ మాటలన్నాక ఆమెకే ఆశ్చర్యం కలిగింది. తనేనా ఈ మాట అన్నది? తను ఏదో విధంగా మోహనరావు భార్య కావాలని చూస్తున్నదా?

తన్ను అనాథగా కాక మనిషిగా చూసిన మొదటి మనిషి మోహనరావు. అతడికి మరదలి ఇబ్బంది వచ్చింది. సమాజం తీరు చూస్తూంటే తనకింతకు మించిన మంచి సంబంధం దొరికేలా లేదు.ఎటొచ్చీ లలితను తను సవతిగా భరించవలసి ఉంటుంది. ఇంతవరకూ లలితకు తనపై ద్వేషభావం తప్ప కోపం ఉన్నట్లులేదు.

"మనం వివాహం చేసుకుని రహస్యంగా కొన్నాళ్ళు హాయిగా గడుపుదాం. రహస్యం అన్నానని భయపడకు. మనకు వివాహమైనట్లు రికార్డు ఉంటుంది. ఆ తర్వాత కొన్నాళ్ళకే నా వివాహం లలితతో జరుగుతుంది—" అన్నాడు మోహనరావు.

సీమకంతా అయోమయంగా ఉంది. అయినా అన్నింటికీ అంగీకరించింది.

సీమ, మోహనరావుల వివాహం స్థిరపడింది. అప్పుడు సీమ మోహనరావు కుటుంబానికి పరిచయం కావాలను కుంది. రహస్య వివాహం కాబట్టి వివాహం అయేదాకా తనవాళ్ళను చూడ్డానికి వీల్లేదన్నాడు మోహనరావు. సీమ ఆ మాటలకు సరేనంది.

అప్పటికి సీను—మోహనరావుతో తన ప్రణయం సంగతి ఆఫీసులో అస్తమానం తన కోసం ప్రయత్నించే

సుబ్బారావు దగ్గర బహిర్గతం చేసింది. సీనుకు త్వరలో ఓ కులీనుడితో వివాహం జరుగుతున్న విషయం విని సుబ్బారావు ఆశ్చర్యపోయాడు. ఆఫీసులో ఈ విషయం పాకింది. అంతా ఆమెను అభినందించారు.

పెళ్ళిరోజు సమీపిస్తూండగా సుబ్బారావు సీమకో విచిత్రవార్త తీసుకుని వచ్చాడు. ఏడాదిక్రితం మోహన రావుకి పెళ్ళయింది. గుళ్లో జరిగిన ఆ పెళ్ళికి అనుకో కుండా అతను వెళ్ళాడు.

ఈ వార్త విని సీమ కంగారుపడింది. లలిత నతనికి ఒక రోజు దూరాన్నుంచి చూపించి—"ఆమె అతని భార్య యేనా?" అనడిగింది.

సుబ్బారావుకి లలిత ఎవ్వరో తెలియదు. ఆమె మోహనరావు భార్య కాదని మాత్రం చెప్పారు. అతను రెండు రోజులు ప్రయత్నించి మోహనరావు పూర్తి ఆచూకీ తెలుసుకుని వచ్చాడు.

మోహనరావు ధనికుడే! అందులో సందేహంలేదు. ఊళ్ళో కాస్తో కూస్తో పేరున్నవాడు కూడా. అతడి తలిదండ్రులీ ఊళ్ళో లేరు. లలిత అన్న మరదలతడికున్న మాట నిజం. అయితే మోహనరావు గురించి దుష్ప్ర చారం కూడా ఉంది. అతడు వ్యభిచార గృహాలను ఎవరికీ తెలియకుండా నడుపుతున్నాడనీ, ఆడపిల్లలను చాలా తెలివిగా వంచించి వృత్తిలోకి దింపుతాడనీ సుబ్బారావు అన్నాడు.

సుబ్బారావు సీమతో-ఇంకో మాట కూడా అన్నాడు- "నేను మంచివాణ్ని కాదు. ఆడపిల్లలపై నాకు చులకన భావం ఉంది. ఒప్పుకుంటాను. కానీ నేనెవరికీ అన్యాయం చేయను. ఎదుటివాళ్ళ సమ్మతితోనే నే నా పనిచేస్తాను

మోహనరావు విషయంలో నాకున్న అనుమానాలు నా అనూయకొద్ది చెబుతున్నాననుకోకు. నీ మంచికోసమే చెబుతున్నాను. పెళ్ళయ్యేలోగా నిజం తెలుసుకో—"

అవసరమైన పక్షంలో సుబ్బారావు సీమకు సాయ పడుతానన్నాడు. ఒక రోజున ఆమె సుబ్బారావును తీసుకుని మోహనరావు ఇంటికి వెళ్ళింది. అక్కడ సుబ్బారావు మోహనరావును ఇబ్బంది పెట్టే ప్రశ్నలు వేశాడు. మోహనరావు వాటికి సరైన జవాబు లివ్వలేకపోయాడు. సీమ అనుమానం పెరిగింది.

సుబ్బారావు వెళ్ళిపోయాక తను సీమకు అన్నీ వివరాలు చెబుతానన్నాడతను. సుబ్బారావు వెళ్ళిపోయాడు.

"నువ్వు అనాథ యువతివి. జీవితంలో నిన్ను కులీనులు పెళ్ళిచేసుకోరు. నీవంటిదానికి కొన్ని నెలల పాటు గౌరవనీయమైన దాంపత్య జీవితం ప్రసాదిద్దామనుకున్నాను. ఆ విధంగా నీ కోరిక తీర్చాక నువ్వు నా వ్యభిచార గృహంలో చేరి నా ఋణం తీర్చుకుంటావనుకున్నాను. కానీ నా గురించి వివరాలు ముందే తెలుసుకున్నావు. ఈ రోజునుంచీ నువ్వు నా బందీవి—" అన్నాడు మోహనరావు.

"ఈ వెధవ మాటలు చెప్పడానికి ఇన్నాళ్ళాగాలా? ముందే నన్ను ఎత్తుకునిపోవచ్చుగా—" అంది సీమ.

"అనాథ యువతివైనా నువ్వుద్యోగం చేస్తున్నావు. పెళ్ళయ్యేదాకా నీ గురించి నీ ఆఫీసువాళ్ళు పట్టించుకుంటారు. నిన్ను మంచిచేసుకుని మంచిగా నాదాన్ని చేసుకుని నాదాని వయ్యాక నెమ్మదిగా కొంప మారిస్తే ఏ గొడవా ఉండదు. నీ గురించి పట్టించుకునేవాళ్ళు కూడా ఉండరు. నేను నా నాటకానికి అనాథ యువతుల్నే

ఎన్నుకుంటాను. వాళ్ళను నమ్మించడానికి కొత్త కొత్త కథలు సృష్టిస్తూంటాను. నీ విషయంలో నాటకం క్లయిమాక్సులో దెబ్బతింది. అందువల్ల నీ కేసు పోలీసు రికార్డుల్లోకి రావచ్చు. కానీ నువ్వు మాత్రం పోలీసులకి దొరకవు—" అన్నాడు మోహనరావు.

సీమ ఆ ఇంట బందీ అయింది. మర్నాడు మోహనరావు సీమ గురించి వాళ్ళ ఆఫీసుకి ఫోన్ చేశాడు. అక్కడ లేదని తెలిసి సుబ్బారావుని వివరాలడిగాడు కూడా! ఆ విధంగా తన అమాయకత్వాన్ని సుబ్బారావుకి నిరూపించుకున్నాడు.

లలిత, మోహనరావు కలిసి సీమను ఆ ఇంట శారీరకంగా, మానసికంగా చాలా హింసించారు. తనను మగవాడు సమీపిస్తే రక్కి చంపేస్తానని సీమ చెప్పింది. ఆమెను దారిలోకి తీసుకురావడానికి రకరకాల మనస్తత్వ శాస్త్రీయ పద్ధతులు అవలంబించారు వాళ్ళిద్దరూ. అది చాలా పెద్ద హింసగా ఉండేది సీమకు.

మొత్తంమీద సీమ ఒకరోజున ఎలాగో అక్కణ్ణించి తప్పించుకోగలిగింది.

## 7

"మా పెళ్ళి సంగతి అందరికీ తెలిసిపోయింది. అందుకని ఆఫీసులో ఎవ్వరికీ ముఖం చూపించలేక పోయాను. ప్రేమించాడనుకున్న మోహనరావు అంతలా మోసగించడంతో జీవితమంటే విరక్తిపుట్టింది. చావాలనుకున్న నన్ను మీ అబ్బాయి బ్రతికించాడు—" అంది సావిత్రమ్మతో సీమ.

"లోకంలో ఎంత దుర్మార్గం దాగుని ఉంది!" అంది సావిత్రమ్మతో సీమ.

"ఆ మోహనరావు వివరాలు చెప్పు. ఆ దుర్మార్గుణ్ని నేను పోలీసులకు పట్టిస్తాను—" అన్నాడు రామచంద్రం ఆవేశంగా.

"కథలో నేను చెప్పిన పేర్లు నిజమైనవనుకోవద్దు. ఆ దుర్మార్గుణ్ని తలుచుకుంటేనే నా శరీరం కంపిస్తోంది. వాణ్ని ఎవ్వరూ ఏమీ చేయలేరని నాకు తెలుసు. నేను పూర్తిగా అసహాయురాల్ని!" అంది సీమ.

"నీ కోసం కాకపోయినా స్త్రీ జాతికి అందులోనూ ముఖ్యంగా అనాథ యువతులకు వాడు చేస్తున్న అన్యాయం సహించరానిది. వాణ్ని పోలీసులకు పట్టించడానికి నువ్వు సహాకరించాలి—" అన్నాడు రామచంద్రం.

"ఆ పని మీవల్ల కాదు. మంచితనం మూర్తీభవించిన ఇల్లు మీది. మీ ఇంట్లో వాడి కథ చెప్పడమే పెద్ద తప్పు. వాడి వివరాలు నేనెవరికీ చెప్పను. అవి నాతోనే అంతమై పోతాయి—" అంది సీమ.

సావిత్రమ్మ సీమను సముదాయించడానికి ప్రయత్నించింది. మోహనరావుకు సంబంధించిన వివరాలు తెలుసుకోవాలనుకుంది. కానీ సీను ఏమీ చెప్పలేదు.

"నీ కథ వింటే జాలిగా ఉంది. నిన్ను నా ఇంటి కోడలిగా చేసుకోడానికి నాకూ ఇష్టమే. నీలాంటి వాళ్ళకు సాయపడ్డం, చేయూత నివ్వడం—మాలాంటి వాళ్ళ బాధ్యత—" అంది సావిత్రమ్మ.

రామచంద్రం కళ్ళు మెరిశాయి—"అమ్మా—నీ అనుమతి లభిస్తే ఇంకేం కావాలి. నేనీమెను వివాహం చేసుకుంటాను—"

సీమ అరిచింది—"నా వివాహం నా ఇష్టంమీద జరగాలి. మీ ఇష్టంమీద కాదు—"

ఆమె ధోరణి సావిత్రమ్మకూ, రామచంద్రానికీ కూడా విస్మయం కలిగించింది.

"జీవితంలో ఇప్పుడు నువ్వు కోరుకునేదేమిటి?"

"చావు!" అంది సీమ నెమ్మదిగా.

# 8

"సీమా! నాకు డబ్బుంది. ప్రేమించే హృదయముంది. నీకు ఆలంబన కావాలన్న కోరిక ఉంది. నీ అందంపై ఆకర్షణ ఉంది. నన్ను నువ్వెందుకు అంగీకరించలేక పోతున్నావ్?" అనడిగాడు రామచంద్రం మర్నాడు ఏకాంతంగా.

"అది తప్ప ఇంకేమైనా అడుగు—" అంది సీమ.

"నువ్వు పెళ్ళికి ఒప్పుకోకపోతే నేను చచ్చిపోతాను-" అన్నాడు రామచంద్రం.

"ఆ పనేదో నేను బ్రతికుండగా చెయ్యకు. నేను చచ్చేక నువ్వేం చేసినా నాకు బాధ లేదు—"

"అయితే పెళ్ళికి ఒప్పుకోనంటావ్?"

"నాకు పెళ్ళియోగం లేదు-"

రామచంద్రం ఎదురుగా ఉన్న ప్లేట్లోని యాపిల్‌ని రెండు ముక్కలుగా కోసి—"నా హృదయంలో సగం నీకిస్తున్నాను. ఆరగించి ఎలావుందో చెప్పు—" అన్నాడు.

సీమ అది అందుకుని తింది—"ముక్క తియ్యగా ఉంది. చెక్కలైన హృదయం తియ్యగా ఉంటే—ఈ లోకంలో బాధలకు తావెక్కడిది?

"ఈమెతో మాట్లాడ్డం కష్టం—" అనుకున్నాడు రామచంద్రం. అతను విసుగ్గా అక్కణ్ణించి లేచి వెళ్ళి పోయాడు. వెళ్ళిన అయిదు నిముషాల్లోనే 'కెవ్వు'మన్న కేక వినబడి ఆత్రుతగా ఆ గదిలోకి పరుగెత్తాడు రామ

చంద్రం.

అప్పటికి సీమ రక్తపు మడుగులో గిల-గిలా తన్ను కుంటోంది.

"అమ్మా!" అంటూ పెద్దగా అరిచాడు రామచంద్రం. అక్కడి దృశ్యాన్ని చూస్తూ అతడి బుర్ర పెద్దగా పనిచేయలేదు. ఎదురుగా సీమ—ఆమె పొట్టలో ఆపిల్ పళ్లు కోసుకునే కత్తి. గదినిండా ఎర్రని రక్తం. సీమ గిల-గిల తన్నుకుంటోంది.

అతను స్పృహతప్పి పడిపోయాడు.

అతనికి స్పృహ వచ్చేసరికి దగ్గర సావిత్రమ్మ మాత్రమే ఉంది—కొడుకు వంక ఆప్యాయంగా చూస్తూ "ఎలా ఉంది బాబూ!" అంది.

"నా సంగతి సరే—సీమకెలా వుంది?" అన్నాడు రామచంద్రం ఆత్రుతగా లేస్తూ.

"ఆమె నా పరిస్థితిలో చూసి నువ్వు పడిపోయావు. మిగతా వాళ్ళం అప్పుడు డాక్టరుకి ఫోన్ చేసి రప్పించాం. డాక్టర్ నర్సింగ్ హోమ్‌కి తరలించాలన్నాడు. బ్రతికే అవకాశాలు చాలా తక్కువన్నాడు" అంది సావిత్రమ్మ.

"అసలేం జరిగిందమ్మా—" అన్నాడు రామచంద్రం.

"ఆ పిల్లకు బ్రతకాలని లేదు. పళ్ళు కోసుకునే కత్తితో కావాలని పొడుచుకుంది. ఇలాంటి పిల్ల ఇంట్లో ఉంటే మనక్కూడా ప్రమాదం—" అంది సావిత్రమ్మ.

"దేనికో ఆమె తనలో తనే బాధపడుతోందమ్మా—మానవత్వంపై నమ్మకం నశించిందో ఏమిటో ఆమె పూర్తిగా నిజం చెప్పడంలేదు. లేదా మోహనరావు చేసిన మోసంతో ఆమె షాక్ తిని ఉండాలి—" అన్నాడు రామచంద్రం.

మోహనరావు చేసిన మోసం సామాన్యమైనదికాదు. సీమనూ, లలితనూ ఇద్దర్నీ పెళ్ళిచేసుకుంటే తప్ప తన సమస్య పరిష్కారం కాదని అతనన డంతో సీమ అతణ్ని పూర్తిగా నమ్మింది. ఇలా అతనెంతమంది అమ్మాయిల్ని బుట్టలో వేసుకుంటున్నాడో? అలాంటివాణ్ణి పట్టివ్వ డానికి సీమ ఎందుకు సహకరించదు?

"తనకు బ్రతకాలన్న ఆశ ఎలాగూ లేదు. అలాం టప్పుడు నిజం చెప్పడానికి ఆమెకింకా దేనికి భయం?" అంది సావిత్రమ్మ. ఈ ప్రశ్నకు సమాధానం తల్లీ కొడుకు లిద్దరికీ తెలియదు.

"నాతో నువ్వు వస్తావా—ఆమెను చూసివద్దాం—" అన్నాడు రామచంద్రం.

సావిత్రమ్మ తను అతడితో రానన్నది. రామచంద్రం ఒక్కడూ హాస్పిటల్‌కు వెళ్ళాడు.

"ఎలా ఉంది డాక్టర్—పరిసితి?"

"సమయానికి గ్రూప్ రక్తం దొరక్క ఇబ్బంది కావలసిందే — కానీ అతనెవరో వచ్చి రక్షించాడు. అతడి గ్రూప్ రక్తం సరిపోవడం ఆమె అదృష్టం! గండం గడిచినట్లే—" అన్నాడు డాక్టర్.

రామచంద్రం ఆత్రుతగా పేషెంట్‌ను చూడ్డానికి వెళ్లాడు. ఆమెను డిస్టర్బ్ చెయ్యవద్దని డాక్టరు చెప్పాడు. ఆమె పక్కనే మంచం మీద నీరసంగా పడు కుని ఉన్న వ్యక్తిని చూసి ఆశ్చర్యపడ్డాడతను.

అతను డిటెక్టివ్!

# 9

"ఎందుకు మాటిమాటికీ ఇలాంటి ప్రయత్నాలు చేస్తున్నావ్! సమయానికి అతను రక్తమిచ్చి కాపాడక

పోతే ఏమయ్యేదానివో తెలుసా?" అన్నాడు రామ చంద్రం చిరాగ్గా.

"ఎవరు నాకు రక్తమిచ్చి కాపాడింది?"

"డిటెక్టివ్!"

అసలే పాలిపోయి ఉన్న ముఖం మరింత పాలి పోయింది.

"సీమా—ఆ డిటెక్టివ్ ఎవరు? ఎందుకు నిన్నిలా కంటికి రెప్పలా కాపాడుతున్నాడు? మీ రక్తం సరి పోయిందంటే మీ ఇద్దరికీ ఏదో రక్తసంబంధముండాలని కూడా నాకు అనుమానంగా ఉంది" అన్నాడు రామ చంద్రం.

"అంతా కాకతాళీయం. అతడికీ నాకూ ఏ రక్త సంబంధమూ లేదు—" అంది సీమ.

"నిన్నింతలా కాపాడుతున్నాడంటే అతడెవరో నీకు తెలిసే ఉండాలి—" అన్నాడు రామచంద్రం.

"అసలే ప్రాణం పోనందుకు బాధపడి నేనేడుస్తూంటే మధ్య నీ గొడవేమిటి? నా కెవ్వరూ తెలియదు. నన్ను వేధించకు—" అంది సీమ.

రామచంద్రం అక్కణ్నించి బయటకు వచ్చేశాడు.

సీమ ఎవరు? డిటెక్టివ్ ఎవరు? వీళ్ళిద్దరి సంబంధం ఏమిటి? ఇద్దరూ కలిసి ఏదైనా నాటకమాడుతున్నారా? ఇంతవరకూ సీమ చేసిన ప్రయత్నాల్లో నాటకముందను కున్నా ఈ రోజు జరిగినదాంట్లో నాటకముండే అవకాశం లేదు. ఎందుకంటే ఆమె కత్తితో పొట్టలో పొడుచు కుంది. చనిపోవలసిన మనిషే. అదృష్టంకొద్దీ బ్రతికింది.

సీమ డిస్పెన్సరీలో వారం రోజులుంది. ఈ వారం రోజులూ రామచంద్రం దగ్గరుండి సీమకు సేవలు చేశాడు.

ఎంతో శ్రద్ధగా ఆమె అవసరాలు చూశాడు. అతడి ప్రేమాభిమానాలు సీమకు కళ్ళనీళ్లు తెప్పించాయి.

"రామచంద్రం—నువ్వు నా జీవితంలో ఎందుకు ప్రవేశించావు?" అంది సీమ బాధగా.

"నీకు సంతోషాన్నిచ్చి నేను సంతోషంగా ఉండడం కోసం—" అన్నాడు రామచంద్రం.

"నాకు సంతోషాన్ని భగవంతుడే ఇవ్వలేదు. నువ్వేం చేయగలవు?" అంది సీమ.

"ఋజువు చేస్తాను—నేను చేయగలనని!"

"నీ కళ్ళముందున్న నిజం తెలుసుకోలేని వాడివి—నన్ను దేవుడినుంచి ఎలా రక్షించగలవు?" అంది సీమ.

"ఏమిటా నిజం?"

"నాకు రక్తదానం చేసినవాడే నన్ను చంప నున్నాడు—" అంది సీమ.

రామచంద్రం ఉలిక్కిపడి-"ఎవరూ-ఆ డిటెక్టివా?" అన్నాడు.

"వాడు డిటెక్టివ్ కాదు...." అంది సీమ.

"మరి...."

"నేను నీకు కథ చెప్పానే....ఆ కథలో లలిత అన్న వాడు...." అంది సీమ.

రామచంద్రం ముఖంలో ఆశ్చర్యం స్పష్టంగా కన బడింది...."మరి....మరి....ఇంతకాలం నా కా విషయం చెప్పలేదేం?" అన్నాడతను—"అయితే వాడు నిన్ను బ్రతికిస్తున్నది నిన్ను వ్యభిచార గృహానికి దక్కించడానికే గానీ నాకు దక్కించడానికి కాదన్నమాట!"

"నువ్వెలా అర్థంచేసుకున్నా సరే—వాడి బారినుండి

నన్ను రక్షించలేవు. ప్రాణాలతో వాడి చేతికి చిక్కడం నాకిష్టం లేదు. నువ్వు నన్ను చావనివ్వడం లేదు—" అంది సీమ నిస్పృహతో.

"సీమా—నాతో జీవితం పంచుకోవడం నీకిష్టం లేదా?" దీనంగా అన్నాడు రామచంద్రం.

"ఇష్టమే—కానీ నాకా అవకాశం లేదు. నీ హృదయంలోని ప్రేమను మరెవ్వరికోసమైనా వినియోగించు. నాలాంటి దురదృష్టవంతురాలికోసం వృథా చేయకు...." అంది సీమ.

ఆ డిటెక్టివ్‌ను కలుసుకుని మొత్తం వివరాలన్నీ లాగాలని నిర్ణయించుకున్నాడు రామచంద్రం.

# 10

హాస్పిటల్ నించి తిరిగివచ్చాక రామచంద్రం సీమపై కట్టుదిట్టాలు ఎక్కువ చేశాడు. అతను ఎక్కువ సమయాన్ని ఆమెతోనే గడుపుతూ ఆమెనుల్లాసపర్చడానికీ, జీవితంపై ఆసక్తి కలిగించడానికీ యత్నం చేశాడు.

"రాబర్ట్ క్లయివ్ మూడు పర్యాయాలు ఆత్మహత్యా ప్రయత్నంలో ఫెయిలయ్యాట్ట. అప్పుడతను తను జీవితంలో ఏదో గొప్ప విశేషం సాధించాల్సి ఉందని అనుకుని ఆత్మహత్యా ప్రయత్నం విరమించుకుని తర్వాత బ్రిటిష్ సామ్రాజ్య స్థాపన ఇండియాలో జరగడానికి ముఖ్య కారకుడయ్యాడు. నువ్వు కూడా అలాంటి అదృష్టవంతురాలివని నా నమ్మకం. మూడు పర్యాయాలు చావు తప్పించుకున్నావు—" అన్నాడోసారి రామచంద్రం.

"అది నా అదృష్టం కాదు. దురదృష్టం!" అని నిట్టూర్చింది సీమ.

ఓ రోజు సీమ నిద్రపోతున్న సమయంలో డిటెక్టివ్,

రామచంద్రాన్ని కలుసుకునేందుకు వచ్చాడు.

"నీ కోసం చాలా రోజులుగా చూస్తున్నాను. ఇన్నాళ్ళకు కనిపించావ్? నీకూ సీమకూ ఉన్న సంబంధం తెలుసుకుంటే తప్ప ఈ రోజు నిన్ను వదలదల్చుకో లేను-" అన్నాడు రామచంద్రం.

"అన్నీ చెప్పడానికే వచ్చాను. సీమ ఏం చేస్తోంది?" అనడిగాడు డిటెక్టివ్.

"నిద్రపోతోంది—"

"సరే—అయితే—ఆమె కథ విను—" అన్నాడు డిటెక్టివ్.

"సీమ నాకు తన కథ చెప్పింది. మోహనరావు, లలిత అనే ఇద్దరు కలిసి ఆమెను వ్యభిచార గృహంలోకి నడిపించాలని ప్రయత్నిస్తే పారిపోయి తప్పించుకు వచ్చిందామె. నువ్వా లలిత అన్నవని కూడా నాకామె చెప్పింది—" అన్నాడు రామచంద్రం.

"అలాగే—అయితే తనా లలితని చంపిన విషయం చెప్పలేదా?" అన్నాడు డిటెక్టివ్.

"ఏమిటీ?" అంటూ ఆశ్చర్యపడ్డాడు రామచంద్రం.

ఏం జరిగిందో తెలియదు కానీ సీమ, లలిత, మోహనరావు ఒక ఇంట్లో కూడారు. సీమ లలితను చంపేసి మోహనరావును తీవ్రంగా గాయపర్చి అక్కణ్నించి పారిపోయింది. తను చేసిన తప్పు తెలిశాక ఆమె అక్కడ ఒక్క ఆధారం కూడా ఉంచలేదు.

డిటెక్టివ్‌కి ఒక్కగానొక్క సోదరి లలిత. చెల్లెలి ఈ అకాల మరణం డిటెక్టివ్‌ను కలచివేసింది. నేరస్థుల్ని పట్టుకోవాలని అతడు నిర్ణయించుకున్నాడు. పోలీసులు ఒక్క అడుగుకూడా ముందడుగు వేయలేకపోయిన ఈ

కేసులో అతడు మోహనరావుకూ సీమకూ ఉన్న పరిచయం గురించి వివరాలు సంపాదించాడు. అంతకుముందు మోహనరావు ఒక అమ్మాయిని అదే విధంగా వంచించడం అతడికి తెలుసు. అందువల్ల అతడి అనుమానం సీమ మీదకు పోయింది.

లలిత చచ్చిపోయింది. మోహనరావు కోమాలో ఉన్నాడు. అతడికి స్పృహవస్తే హంతకుల్ని పట్టుకో వచ్చు. కానీ డాక్టర్లు అతడికి ఎప్పుడు తెలివివచ్చేదీ తేల్చి చెప్పలేకపోతున్నారు.

డిటెక్టివ్, సీమను కలుసుకుని బెదిరించాడు. నిజం ఎప్పటికైనా మోహనరావు ద్వారా బయటపడుతుందనీ ఈలోగా ఒప్పుకుంటే కొంతలో కొంత మంచిదనీ చెప్పాడు. సీమ ఒప్పుకోలేదు.

కానీ ఆమెకు భయం పట్టుకుంది. అందువల్ల ఉద్యోగం వదిలి పారిపోయింది. అతనామెను వదిలిపెట్టలేదు. మోహనరావుకు స్పృహ వచ్చేవరకూ ఆమె ఉనికిని తెలుసుకోవడం అతడికి ప్రధానం. తన చెల్లెల్ని హత్య చేసిన నేరానికి ఆమెను ఉరికంబం ఎక్కించడమే అతడి ముఖ్యోద్దేశ్యం.

ఇప్పుడు మోహనరావుకు తెలివి వచ్చింది. మాట్లాడగలుతున్నాడు. అన్నీ చెప్పలేకపోయినా ఒకటి రెండు రోజుల్లో అన్నీ చెప్పగల్గుతాడు. అప్పటికి సీమను అక్కడ హాజరుగా వుంచాలి.

"అందుకే నేనామెను చావనివ్వలేదు-" అన్నాడు డిటెక్టివ్ గర్వంగా.

రామచంద్రం ఏదో అనబోతుండగా లోపల్నుంచి అతడి తల్లి కేకపెట్టింది—"అబ్బాయ్ రామచంద్రం—

ఈ పిల్ల మళ్ళీ విషం మింగినట్లుందిరా!"

రామచంద్రం, డిటెక్టివ్ కూడా లోపలకు పరుగెత్తారు. సీమ మంచంమీద వెల్లకిలా పడివుంది. ఆమె పక్కన ఓ మందు సీసా ఉంది. డిటెక్టివ్ ఆత్రుతగా ఆమె నాడి చూసి—"అర్జంటుగా డాక్టర్ని పిలవండి!" అన్నాడు.

"నేను పిలవను. ఆమె చచ్చిపోనీ మిస్టర్ డిటెక్టివ్!" అన్నాడు రామచంద్రం.

"నో....ఆమెను చావనివ్వను" అన్నాడు డిటెక్టివ్. అతను అక్కణ్నించి కదిలివెళ్ళి అయిదు నిముషాల్లో ఓ డాక్టర్ని తీసుకునివచ్చాడు. డాక్టర్ మందుసీసాను పరీక్షించి చూసి—"చాలా ప్రమాదకరమైన విషం. ఈమె ఇంత సేపు బ్రతకడమే ఆశ్చర్యం—"అంటూనే తన ప్రయత్నం చేయసాగాడు.

రామచంద్రం ఆలోచిస్తున్నాడు. మోహనరావు అసలు పేరు తనకు తెలియదు. కానీ వాడు సీమను వంచించాడు. ఫలితంగా హత్య జరిగింది. హంతురాలి అన్న తన శాయశక్తులా ప్రయత్నించి సీమను ఉరికంబమెక్కిస్తున్నాడు. అది న్యాయమా? అందుకు భగవంతుడు సహకరిస్తాడా?

సీమ అనాథ. ఆమె కోసం రెండు కన్నీటిచుక్కలు కార్చేవాళ్ళులేరు. ఆమె బాగుగురించి ఎవ్వరూ పట్టించుకోలేరు. హంతకురాలిగా ముద్రవేయించుకుని చనిపోవడం ఇష్టంలేదామెకు. అందుకే ఆమె అభీష్టం నెరవేర్చకపోతే భగవంతుడు లేనట్లే! లేదా అనాథలంటే భగవంతుడు కూడా నిర్లక్ష్యం చేసేవారనుకోవాలి.

డాక్టర్ సీమకు ట్రీట్మెంట్ చేస్తున్నాడు.

రామచంద్రం ఆత్రుతగా ఎదురు చూస్తున్నాడు. ఆమె బ్రతకకూడదన్నది అతడి కోరిక....

డిటెక్టివ్ ఆత్రుతగా ఎదురు చూస్తున్నాడు. ఆమె బ్రతకాలన్నది అతని కోరిక....

డాక్టర్‌కి ఆమె బ్రతకదని అనుమానం. బ్రతికించాలని అతడు ప్రయత్నం చేస్తున్నాడు....

సీమ ఇక యీ ఆత్మహత్యల పోరాటంలో బ్రతికి ఉరికంబం ఎక్కుతుందా? లేక చచ్చి బ్రతికిపోతుందా? ఆ భగవంతుడే తేల్చాలి.

— :ఐపోయింది: —

# మృత్యు చక్రాలు!

టెంపోరావ్

హోటల్ పిక్నిక్‌లో పెద్ద గొడుగుకింద కుర్చీల్లో వాళ్ళిద్దరూ కూర్చున్నారు. అతడు ఆమె వంక నవ్వుతూ చూశాడు. అతడి కళ్ళు ఆనందంతో మెరుస్తున్నాయి.

ఆమె వయస్సు యిరవై వుంటుంది. పొట్టిగా, పచ్చగా బంగారం బొమ్మలా వుంది. అమెరికన్ జార్జట్ చీర, మాచింగ్ జాకెట్ ధరించింది. కాటుక కళ్ళు. లిప్‌స్టిక్ పులిమిన పెదిమలు మెరుస్తున్నాయి.

"రమా, ఏం తెప్పించను?" అడిగాడతను బాయ్ రాగానే.

"నీ యిష్టం, మోహన్." అందామె.

మోహన్ మెనూకార్డు చూశాడు.

"జాంగ్రీ, చపాతీ, బిరాణీమసాలా, రవ్వాదోసా, కాఫీ!" మోహన్ ఆర్డరిచ్చాడు.

హోటల్ బాయ్ వెళ్ళిపోయాడు.

"అన్ని ఐటమ్స్ తినలేం!" అందామె.

"నాకు చాలా ఆకలిగా వుంది. గత మూడు రోజులూ నేను కాఫీమీద జీవించాను. నువ్వు కనిపించకపోవడం వలన ఆకలి చచ్చింది. ఇవాళ నా ఎదురుగా నువ్వు కూర్చుంటే విందు చేసుకోవాలనిపిస్తోంది."

"మోహన్, నీకు పిచ్చిపడ్తోంది!" అం దా మె కొంటెగా.

"లవ్ యీస్ ఒన్ టైప్ ఆఫ్ మాడ్‌నెస్!" అన్నాడతను నవ్వుతూ.

సమీపంలో మరో గొడుగుకింద ఒంటరిగా కూర్చున్న వ్యక్తి వాళ్ళవైపు చూస్తూ సిగరెట్ వెలిగించాడు. అతడి టేబుల్‌మీదున్న వేడి కాఫీ చలిగాలిలో చల్లారుతోంది. నలువైపులా లైట్లు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి. టైము ఎనిమిది కావస్తోంది. సిగరెట్ తర్వాత సిగరెట్ వెలిగించి, పొగ పీల్చి వదుల్తూ అతడు వాళ్ళవైపే చూస్తున్నాడు. కాని వాళ్ళు అతడి చూపును గుర్తించ లేదు. బాయ్ తెచ్చిన పదార్థాలు తింటూ, ఏదో ఉత్సాహంగా మాట్లాడుకుంటున్నారు వాళ్ళిద్దరూ!

ఆమె టైమ్‌చూసింది.

"అప్పుడే ఎనిమిది దాటింది!" అందామె.

"కాలానికి పనా, పాటా? తరుగుతూనే వుంటుంది!" అన్నాడతను.

టిఫిన్ ముగించి యిద్దరూ కాఫీ సేవిస్తున్నారు.

"రమా, యింకా మనం యిలా ఎంతకాలం గడుపుతాం? మీ నాన్నతో చెప్పవా?" అడిగాడతను.

"నాన్నకు నేను తప్ప సంతానంలేదు. ఏ లక్షాధికారికో యిచ్చి నన్ను పెళ్ళిచెయ్యాలని నాన్న కోరిక.

నీ జీతం యింకా వెయ్యేనా కాలేదు. అందుకని ఆలోచిస్తున్నాను," అందామె.

"నిన్ను పెళ్ళాడితే నేను లక్షాధికారి నవుతానుగా!" అన్నాడు మోహన్ నవ్వుతూ.

"నాన్నకు కావలసింది తన డబ్బుతో లక్షాధికారయ్యే అల్లుడు కాదు, స్వయంగా లక్షలున్న అల్లుడు!"

"అయితే మీ నాన్న మన పెళ్ళికి ఒప్పుకోడంటావా?"

"ఒప్పిస్తాను,సరైన సమయం చూసి. మోహన్ నువ్వు తొందరపడకు!"

అతడామె కళ్ళలోకి సూటిగా చూశాడు.

"నా బాధ నీకేం తెలుసు? ఇలా నీతో కాస్సేపు కూర్చుని మాట్లాడితే నాకు తృప్తిగాలేదు. అనుక్షణం నువ్వు నాతో వుండాలి."

"నువ్వు కొంతకాలం వేచివుంటే నీ కోరిక ఫలిస్తుంది," అందామె.

అతడు బిల్లు చెల్లించాడు. ఆమె నవ్వుతూ అతడివంక చూసింది.

"ఇహ నేను వెళ్ళొచ్చా? బాగా లేటైతే నాన్న అందరికీ ఫోన్ చెయ్యడం ప్రారంభిస్తాడు!"

"బీచ్ కి వెళ్దాం. ఈ చంద్రకాంతిలో, చల్లగాలిలో ఏ పడవ పక్కనో కాస్సేపు కూర్చుందాం. తర్వాత వెళ్ళొచ్చు!"

"ఇంత రాత్రివేళ బీచ్ కా?"

"మనలాంటి లవర్స్ కు రాత్రే పండుగ!"

వాళ్ళు కుర్చీల్లోంచి లేచారు. గేటు దాటి రోడ్డువెపు నడిచారు. అక్కడున్న ఆటోలో యిద్దరూ కూర్చున్నారు.

ఆటో రోడ్డుప్మట నుసుకుపోయింది.

అంతవరకూ వాళ్ళను గమనిస్తున్న వ్యక్తి వేగంగా తన అంబాసిడర్ కారు వైపు వెళ్ళాడు. కారులో కూర్చుని తలుపుమూశాడు. కారును వేగంగా పోనిచ్చాడు. కాస్సేపట్లో ముందువెళుతున్న ఆటో అతడికి కనిపించింది. దానివెనకనే అతడు తన కారును పోనిచ్చాడు!

బీచ్‌లో ఆటో ఆగింది. ఇద్దరూ దిగారు. మోహన్ డబ్బు చెల్లించాడు. సోడియంవాపర్ లైట్లు ప్రకాశవంతంగా వెల్గుతున్నాయి. ఇద్దరూ లోపలకు నడిచారు. సముద్రపు హోరు వినిపిస్తోంది.

రమ పైకి చూసింది. చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. చంద్రకాంతి, చల్లగాలి అఖండగా వున్నాయి. ఆమె అతడికి దగ్గరగా జరిగి యిసుకలో నడుస్తోంది. అతడు నలువైపులా చూశాడు. ఎక్కడా సమీపంలో మనుషులు లేరు. ఆమె చుట్టూ తన చెయ్యిని పోనిచ్చాడు. ఆమెను గట్టిగా నొక్కిపట్టుకున్నాడు. ఇద్దరూ మెల్లిగా యిసుకలో కదులుతున్నారు.

కొంచెం దూరంలో యిసుకలో వున్న ఒక పడవ ఆకారం వాళ్ళకు కనిపించింది.

"అక్కడ కూర్చుందాం!" అన్నాడు మోహన్.

"పడవలోనా?" ప్రశ్నించిందామె కొంటెగా.

అతను ఆగాడు. అమాంతంగా ఆమె పెదిమలను ముద్దెట్టుకున్నాడు. ఆమెవైపు ప్రేమతో చూశాడు.

"రమా, ఐ లవ్ యూ!" అన్నాడు మోహన్.

ఆమె మాట్లాడలేదు. మౌనంగా అతడివంక చూసింది. ఇద్దరూ మెల్లిగా కదిలారు. పడవ పక్కనే కూర్చుని సముద్రంకేసి యిద్దరూ చూశారు. కెరటాలు పొంగుతూ

ముందుకొస్తున్నాయి. ఒడ్డున పగిలి నురుగులు కక్కుతూ వెనక్కుపోతున్నాయి.

అతడామెను తనవైపు లాగాడు. నవ్వుతూ ఆమె అతడి ఒళ్ళో వెల్లకిలా పడింది.

"రమా, యిలా రాత్రంతా వుండిపోదాం. సూర్యోదయం చూసి యిళ్ళకు పోదాం," అన్నాడతను.

"ఆ పాటికి నాన్న నన్నెవరో ఎత్తుకు పోయారని పోలీసు రిపోర్టు కూడా యిచ్చేస్తాడు!" అందామె.

"ఇస్తే యివ్వనీ! ఎత్తుకుపోయింది నేనేగా!"

ఆమె ఏదో నీడను చూసి లేవబోయింది. తటాలున బలమైన చెయ్యి మోహన్ చంపమీద రాకెట్‌లా దిగింది. అతడు పక్కకు పడ్డాడు. అతడికి స్పృహలేదు. ఆమె గాభరాగా ఎదురుగా వున్న వ్యక్తివైపు చూసింది. అమాంతంగా అరవబోయింది. కాని అతడి చెయ్యి ఆమె నోరును నొక్కేసింది. ఆమెను యిసుకలోకి తోశాడతను. ఆమె లేవడానికి శాయశక్తులా ప్రయత్నిస్తోంది. అతడి చేతిలోని ఆయుధం ఆమెను అనేకచోట్ల పొడవసాగింది. అతడు లేచాడు.

క్షణకాలం యిసుకలో పడున్న ఆమెవంక చూశాడు. వెనక్కి తిరిగి వేగంగా వెళ్ళిపోయాడు.

అరగంట తర్వాత మోహన్ మేలుకొన్నాడు. రమ కోసం యిటూ, అటూ చూశాడు. కొంచెం దూరంలో వెల్లకిలా పడున్న ఆమె ఆకారం కనిపించింది. ఆమె నిద్ర పోతూ వుండాలి! అతడు కెరటాలవైపు వెళ్ళి ముఖం కడుక్కున్నాడు. వెనక్కి తిరిగొచ్చి ఆమె పక్కనే కూర్చున్నాడు. ఆమె వైపు చూసి వులిక్కిపడ్డాడు.

ఆమె చీరమీద అనేక చోట్ల రక్తం! ఆమెను తట్టాడు.

ఆమె శరీరం చల్లగావుంది. అతడి గుండె దడదడలాడింది. తనను చంపమీద కొట్టిన వ్యక్తి ఆమెను హత్యచేశాడా! అతనెవరు? ఆమె ప్రియుడా?

అక్కడుంటే యీ హత్యలో తను యిరుక్కోవచ్చు. రమ ఈ లోకంలో లేదు. అతడు లేచాడు. వేగంగా ఇసుకలో నడుస్తూ రోడ్డువైపు వెళ్ళాడు. ఎవరేనా తన్ని చూస్తే ప్రమాదం. ఎవ్వరికీ కనపడకుండా అతడు రోడ్డు దాటాడు. పక్కరోడ్డుకు తిరిగి వడివడిగా నడిచాడు.

రెండు ఫర్లాంగులు దాటాక బస్ స్టేండ్ చూసి అతడు ఆగాడు. బస్సులో పోవడం మంచిది. టాక్సీ, ఆటో డ్రయివర్లు మనుషుల్ని గుర్తుంచుకుంటారు. బస్‌లో పోతే ఏ బెంగా వుండదు.

కాస్సేపట్లో బస్సు రాగానే అతడు యెక్కాడు. బస్ కదిలింది. అతడు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. పాపం, రమ శవం రాత్రంతా అలాగే అక్కడ పడుంటుందేమో! ఆమె శవాన్ని వాళ్ళు కనుక్కునేటట్లు తను చెయ్యాలి!

ఒకచోట అతడు దిగాడు. కొంచెం దూరం నడిచి పబ్లిక్ టెలిఫోన్ బూత్‌లోకి దూరి తలుపు మూశాడు. రిసీవరెత్తి ఒక నంబరు తిప్పాడు. ఎవరో హలో అన్నారు. అతడు యాభై పైసలు పడేసి తన కంఠాన్ని మార్చాడు. "సార్. గాంధీ స్టాట్యూ సమీపంలో ఒక యువతి హత్య చేయబడింది. మీ అమ్మాయేమో వెళ్ళి చూడండి" అన్నాడతను.

"రామా, రామా!" అరిచిందొక కంఠం అటువైపు నుంచి.

మోహన్ మౌనంగా వుండిపోయాడు.

"మిస్టర్, ఆమె మా అమ్మాయని నీకెలా తెలుసు?"

"నేను మీ ఇంటి సమీపంలోనే వుంటున్నాను. ఆమె నాకు గుర్తు."

"మిస్టర్, నీ పేరూ, అడ్రసూ చెప్తావా?"

మోహన్ రిసీవర్ని వెంటనే పెట్టేసి బయటకు నడిచాడు. తనింటివైపు అడుగులేశాడు. రమ ఇంటికి సమీపంలో తను వుండడంలేదు. అందువలన ఎవ్వరూ తనని అనుమానించరు. కాస్సేపట్లో అతడు తనింటికి చేరుకున్నాడు.

## 2

గణపతిరావుతో ఫోన్లో మాట్లాడి వెంటనే దుస్తులు మార్చుకొన్నాను. మెట్లవైపు వెళ్తూండగా టెలిఫోన్ మ్రోగింది. వెళ్ళి రిసీవర్ని ఎత్తాను.

"హలో, పరశురామ్ హియర్!"

"బ్రదర్, ఇన్స్పెక్టర్ నాయర్ స్పీకింగ్, బీచ్లో ఏదో హత్య జరిగిందట. నువ్వు అక్కడికి వస్తావా?"

"వస్తున్నా" అన్నాను.

"ఈ న్యూస్ నీకు ముందే తెలుసన్న మాట!"

"గణపతిరావుగారు ఫోన్ చేశాడు. పోలీస్కి రిపోర్టివ్వమన్నాను. ఆల్ రైట్ అక్కడికి వస్తున్నానుగా, తర్వాత అంతా మాట్లాడుదాం" అని రిసీవర్ని పెట్టేశాను.

మెట్లు దిగి షెడ్ వైపు పరుగెత్తాను. మరో నిమిషంలో నా డాడ్జికారు బీచ్ వైపు దూసుకుపోయింది. చల్లటిగాలి వీస్తోంది. గాంధీ విగ్రహానికి కొంచెం దూరంగా కారును బీచ్ లోపల రోడ్డుకు పోనిచ్చాడు. క్షణకాలం ఆలోచించి ఎడంవైపుకు తిప్పి పోనిచ్చి

పోలీస్ జీప్ వెనక నే ఆపాను. జీప్ ముందు మరో కారుంది.

ఇన్‌స్పెక్టర్ నాయర్ ఒక వ్యక్తితో నా దగ్గర కొచ్చాడు. "బ్రదర్, నీకు ఫోన్ చేసిన గణపతిరావు గారు ఈయనే!" పరిచయం చేశాడు.

"పరశురామ్‌గారూ, ఆ శవం మా అమ్మాయిది కాకూడదని దేవుడిని ప్రార్థిస్తూ వచ్చాను" అన్నాడు గణపతిరావు.

"గణపతిరావుగారూ, ఆ శవం ఎవరిదైనా ఏ తలిదండ్రులనో ఏడిపిస్తుంది" అని నాయర్ వైపు తిరిగాను.

"నేనూ ఇప్పుడే వచ్చాను. వెళ్ళి చూద్దాం, పద" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

"శవం ఎక్కడుంది?"

"కానిస్టేబుల్స్ వెతుకుతున్నారు" అన్నాడు నాయర్.

దూరంలో వెలుతున్న టార్చిలైట్లను గుర్తించాను. ఇంకా తొందరలేదు. శవం కనిపించాక అక్కడకు వెళ్ళొచ్చు.

ఇసుకలో నుంచుని సిగరెట్ వెలిగించాను. పొగ వదులుతూ నలువైపులా చూశాను. చంద్రకాంతి బ్రహ్మాండంగా వుంది. ఇన్‌స్పెక్టర్ నాయర్ గణపతిరావు నా పక్కనే నిలబడ్డారు.

"ఇక్కడుంది సార్!" అర్చాడొక కానిస్టేబుల్.

దూరంలో పడవ కనిపిస్తోంది. అరుపు అటువైపు నుంచి వచ్చింది. వేగంగా అటువైపు నడిచాను. నాయర్, గణపతిరావు నాతో కూడా కదులుతున్నారు.

సముద్రపు ఒడ్డున పడవ కటువైపున యిసుకలో వెల్ల

కిలా పడివుంది శవం. టార్చి కాంతిలో శవాన్ని చూస్తున్నాను.

“ఓ భగవాన్, ఎందుకిలా చేశావు? పరశురామ్ గారూ, ఇది నా కూతురే. పేరు రమ” అన్నాడు గణపతిరావు.

అతడు ఏడుస్తూ యిసుకలో కూలిపోయాడు. తలనుంచి పాదాల దాకా శవాన్ని చూశాను. అరడజను చోట్ల వలయాకారంలో మేకులతో పొడిచినట్లు స్పష్టంగా తెలుస్తోంది. హంతకుడు కత్తిని వుపయోగించి వుండడు. ఫోర్క్ లాంటి ఆయుధంతో ఆమెను అనేకచోట్ల పొడిచాడు. ఒక్కపోటుకు శరీరంలో ఆరుచిల్లులు సంభవించి వుండాలి! హంతకుడు యీ ఆయుధాన్ని స్పెషల్ గా చేయించాడేమో!

ఆమె పక్కనే హేండ్ బాగ్ పడుంది. జేబురుమాలుతో పట్టుకొని దాన్ని తెర్చిచూశాను. లోపల కొంత డబ్బు మేకప్ బాక్స్, చిన్న అద్దం వగైరా వున్నాయి. ఆమె ఒంటిమీద నగలన్నీ అలాగే వున్నాయి. దొంగతనం కోసం ఈ హత్య జరిగివుండక పోవచ్చు.

రమ చాలా అందమైన యువతి. ఇంత అమానుషంగా ఆమెను యెందుకు హత్య చేయవలసి వచ్చిందో వూహాతీతంగా వుంది.

లేచి నిలబడి సిగరెట్ వెలిగించాను. గణపతిరావు యింకా ఏడుస్తున్నాడు.

“నాయర్ భాయ్, ఆయన్ని కొంచెం దూరంగా తీసుకెళ్ళడం మంచిది” అన్నాను.

ఇన్ స్పెక్టర్ నాయర్ కానిస్టేబుల్ తో చెప్పాడు. ఒక కానిస్టేబుల్ అతడిని లేవదీసి దూరంగా తీసుకు పోయాడు.

"రేప్ చేసి చంపారేమో!" అన్నాడు నాయర్.

"డాక్టర్ పరీక్ష అయ్యాక అది తెలుస్తుంది" అన్నాను.

"హాస్పటల్లో డాక్టర్ సుధాకర్ వస్తారు" అన్నాడు నాయర్.

ఆలోచిస్తూ దూరంలో కూర్చున్న గణపతిరావు దగ్గరకు వెళ్ళాను. అతడి కెదురుగా యిసుకలో చతికిల బడ్డాను. అతడి చెయ్యి పట్టుకొని ఓదార్చాను.

"పరశురామ్‌గారూ, నాకు రమ ఒక్కగా నొక్క కూతురు. ఈ వార్త తెలిస్తే నా భార్య గుండె ఆగి చస్తుంది" అన్నాడతను.

"మీ అమ్మాయి బీచ్‌కి వెళ్తున్నట్టు మీతో చెప్పిందా?"

"చెప్పలేదు సార్. తన ఫ్రెండ్ కోకిల యింటికి వెళ్ళి వస్తానంది. కోకిల యింటికి ఫోన్ చేశాను. రమ అక్కడకు రానేలేదని చెప్పింది."

"ఆమె కాలేజి స్టూడెంటా?"

"ఈ సంవత్సరంలో బి.ఎ పాసయింది. పెళ్ళి సంబంధాలు చూస్తున్నాను. దాని జీవితం ఈ విధంగా అంతరిస్తుందని కలలో కూడా నేననుకోలేదు."

వెనక్కి తిరిగాను. డాక్టర్ సుధాకర్ వచ్చాడు. ఇన్‌స్పెక్టర్ నాయర్, డాక్టర్ సుధాకర్ ఏదో మాట్లాడుకుంటున్నారు.

"మీ అమ్మాయికి బాయ్‌ఫ్రెండ్స్ వున్నారా?"

"లేరు సార్."

"గణపతిరావుగారూ, ఎవ్వరూ తోడు లేకుండా ఆమె ఒంటరిగా రాత్రి బీచ్‌కి రావడం సహజంగా

లేదు. ఆమెతో మరెవరో వచ్చుండాలి!" అన్నాను.

గణపతిరావు జవాబివ్వలేదు. ఆలోచిస్తూ వుండి పోయాడు.

"ఈ వార్త టెలిఫోన్‌లో ఎవరో చెప్పారని మీరు నాతో ఫోన్‌లో అన్నారు. ఆ వ్యక్తికి యీ హత్యతో సంబంధం వుండొచ్చు. అతడు మీతో ఏం చెప్పాడో నాకు వివరంగా చెప్పండి."

"బీచ్‌లో ఎవరి శవమో పడుంది. అది మీ అమ్మాయి దేమో వెళ్ళి చూడమన్నాడతను. అతడు మా యింటి సమీపంలో వుంటున్నాడట. అమ్మాయితో పరిచయం లేకపోయినా ఆమె ముఖం అతడికి గుర్తుంది."

"అతడు గాభరాగా చెప్పాడా?"

"అతడి కంఠంలో గాభరా లేదు. కాని కంఠం సహ జంగా లేదని నాకు యెందుకో అనిపించింది. కంఠం మార్చాడేమో!"

ఇన్‌స్పెక్టర్ నాయర్ నా దగ్గరకు పరుగెత్తుకొచ్చాడు.

"బ్రదర్, ఆమె రేప్ చేయబడలేదు. డాక్టర్ సుధాకర్ ఆ విషయం గురించి నిస్సందేహంగా చెప్తు న్నారు" అన్నాడు నాయర్.

"నాయర్ భాయ్, రేప్ జరగలేదు. దొంగతనం జరగలేదు. ఆశ్చర్యంగా వుంది. అయితే యీ హత్య యెందుకు జరిగిందంటావు?" ప్రశ్నించాను.

"అదే నాకూ తెలియడం లేదు!"

"డోంట్ బాదర్! ప్రస్తుతం మనకు తెలియక పోయినా ఏదో కారణం వుంటుంది. అకారణంగా ఒకడు మరొక మనిషిని చంపడు. అది మనకు త్వరలో తెలు

స్తుంది" అని లేచాను.

గణపతిరావు లేవబోయాడు. అతడిని కూర్చోమని హెచ్చరించి నేనూ, నాయర్ శవం దగ్గరకు వెళ్ళాం.

డాక్టర్ సుధాకర్ నాతో కరచాలనం చేశాడు.

"డాక్టర్, హత్యకు ఉపయోగించిన ఆయుధం ఏమిటై వుంటుంది?"

"పరశురామ్‌గారూ, యిటువంటి ఆయుధాన్ని గురించి నే నెన్నడూ వినలేదు. గుండ్రటి ఫోర్క్‌లాంటిది అయి వుండాలి! అటువంటి ఆయుధాన్ని హంతకుడు చేయించి వుండాలి!" అన్నాడు డాక్టర్ సుధాకర్.

"యూ ఆర్ రైట్, అదే నేననుకున్నాను. గుండ్రటి ప్లేటుకు అరడజన్ నీడిల్స్ అమర్చబడి వుండాలి. శరీరం లోకి పొడిస్తే అరడజన్ నీడిల్స్ వలయాకారంలో లోపలకు దిగుతాయి," అన్నాను.

మరోసారి ఆమె బాగ్‌ను పరిశీలించాను. చిన్న కాగితం ముక్క నాకు కనిపించింది. దానిమీద ఎమ్— నంబర్ 663851 అని రాసివుంది. ఆ కాగితం ముక్కను బాగ్‌లో పడేశాను.

"బ్రదర్ ఆ నెంబరేమిటి?" అడిగాడు నాయర్.

"ఏదో టెలిఫోన్ నంబర్. ఎవర్దో కనుక్కోవాలి," అన్నాను.

టైమ్ చూశాను. పదకొండు దాటింది. ఇన్స్‌పెక్టర్ నాయర్ వంక చూశాను.

"నాయర్ భాయ్, నేను వెళ్ళివస్తాను!" అని నా కారువైపు నడవసాగాను.

డాడ్జి కారును పోనిచ్చాను. రాత్రంతా తెరిచివుండే హోటల్ మిలన్ ముందు కారాపాను. అక్కడ చాలా

కార్లు వున్నాయి. హోటల్ కుర్రాడు పరుగెత్తు కొచ్చాడు.

"హాట్ టీ పట్రా!"

కాసేపట్లో హాట్ టీ తెచ్చి యిచ్చాడతను. టీ సేవిస్తూ ఆలోచించసాగాను. ఆ టెలిఫోన్ నెంబర్ ఎవరిదో! చాలా కాలంనుంచి ఆ కాగితం ముక్క ఆమె హేండ్‌బాగ్‌లో వుండివుండాలి.

మరో రెండు కప్పుల టీ తాగి, డబ్బు చెల్లించి కారును యింటివైపు పోనిచ్చాను. ఆ నంబర్ని గురించి యింత రాత్రివేళ కనుక్కోడం సాధ్యంకాదు. అదంతా తెల్లారాక చెయ్యాలి.

## 3

పొద్దుటొచ్చిన దినపత్రికల్లో రమ ఘోర హత్యను గురించి పత్రికా విలేఖర్లు చాలా రాశారు. రమ ఫోటో అన్ని పత్రికల్లోనూ వుంది. ఆరు కప్పుల కాఫీ తాగి, సిగరెట్ పీలుస్తూ దిన పత్రికలను చూస్తున్నాను. టెలి ఫోన్ మ్రోగింది.

"హలో!" అన్నాను.

"బ్రదర్ నువ్వు వెళ్ళాక నిన్న రాత్రి ప్రెస్‌వాళ్ళు మందగా బీచ్‌కి వచ్చారు. రమ హత్యకు పబ్లిసిటీ ఎక్కువగా రావచ్చు," అన్నాడు నాయర్.

"పబ్లిసిటీ రావడం మంచిదే. ఆమె బీచ్‌కి వెళ్ళింది. ఏ టాక్సీ డ్రయివరో పబ్లిసిటీ చూసి నీ దగ్గరకొచ్చి అంతా చెప్పొచ్చు!"

"ఇంతవరకూ ఎవ్వరూ రాలేదు! రెండు ఫోన్ కాల్స్ మాత్రం వచ్చాయి. ఇద్దరు స్త్రీలు నన్ను ఎడాపెడా తిట్టేశారు—రమకు జరిగిన దానికి!"

"ఇంకా చాలామంది తిట్టొచ్చు! చివాట్లకు అలవాటు పడిపోవడం నేర్చుకో!" అన్నాను నవ్వుతూ.

"బ్రదర్ బీచ్ ప్రాంతంలో కొంతమందిని రమ గురించి అడిగిచూశాను. కాని ఆమెను ఎవ్వరూ చూడలేదు. ఆమె శవాన్ని పోస్ట్‌మార్టమ్‌కి పంపించాను. త్వరలో రిపోర్టు వస్తుంది."

"గుడ్ వర్క్!"

మరికొన్ని విషయాలు మాట్లాడి రిసీవర్ని పెట్టేశాను. ఇన్‌స్పెక్టర్ నాయర్ పద్ధతుల్లో పరిశోధన సాగిస్తే ఏ హంతకుడూ పోలీసులకు దొరకడు!

టైమ్ తొమ్మిది దాటింది. ఇరవై యిడ్లీ తిని, నాలుగు కప్పుల కాఫీ సేవించాను. టెలిఫోన్ మ్రోగింది. రిసీవర్ని అందుకున్నాను.

"హలో, పరశురామ్ హియర్!"

"సార్, మీరు అడిగిన నంబర్ అరుణ్ అండ్ కంపెనీది. అదొక ఫాక్టరీ. విల్లివాకం ప్రాంతంలో వుంది. డైరక్టరీలో ఆ కంపెనీ అడ్రస్ మీరు చూడొచ్చు," అందామె.

ఆమెకు థాంక్స్ చెప్పి రిసీవర్ని పెట్టేశాను. అరుణ్ అండ్ కంపెనీ!

ఆ కంపెనీలో పనిచేసేవారెవరో రమకు తెలిసి వుంటాలి.

ఆ నంబర్‌కి ఫోన్ చేశాను. ఒక స్త్రీ అటువైపునుంచి "అరుణ్ అండ్ కంపెనీ ప్లీస్ అంది,"

"మిస్టర్ ఎమ్ కావాలి," అన్నాను క్లుప్తంగా.

"మూర్తా, మోహనా?" అడిగిందామె.

"నాకు కావలసిన ఎమ్ యువకుడు," అన్నాను.

"అయితే మిస్టర్ మోహన్ అయివుండాలి. జస్ట్ ఎ మోమెంట్," అందామె.

కాస్సేపట్లో అటువైపునుంచి ఒక పురుష కంఠం వినబడింది.

"మోహన్ స్పీకింగ్!"

"మిస్టర్ మోహన్, మీతో మాట్లాడాలి!"

"ఎవరు మీరు?"

"డిటెక్టివ్ పరుశురామ్!"

అతడు నా పేరు విని తృళ్ళిపడ్డాడు. అతడు నా కళ్ళముందు లేకపోయినా అతడి కంఠాన్ని నేను గ్రహించగలాను.

"నాతో మీకేం పని?" అడిగాడతను ఖంగారుగా.

"రమ!"

"ఆమె ఎవరు?"

"నీకు తెలుసుండాలి!"

"నాకు రమ ఎవరో తెలియదు సార్."

"ఇవాళ్టి పేపరు చూశావా?"

"చూశాను."

"రమ అనే యువతి హత్య గురించి చదివావా?"

"చూసాను సార్. చాలా విచారకరమైన వార్త."

"పేపర్లు ప్రచురించని వార్త నీకు చెబుతున్నాను. ఆమె హేండ్ బాగ్‌లో ఒక కాగితం ముక్కమీద నీ పేరు, ఫోన్ నంబర్ రాసివున్నాయి."

"ఆశ్చర్యంగా వుంది సార్. ఆ మోహన్ మరెవరో అయివుండాలి!"

"కాని ఆ ఫోన్ నంబరు నీదే!" అన్నాను గంభీరంగా.

"ఇంతకీ మీ కేం కావాలి?"

"నేను కారులో వస్తున్నాను. డాడ్జి కారు. మీ ఆఫీసు ముందు నిలబడు. నా కారు దగ్గరకు రా. మాట్లాడుదాం."

"నాకేం తెలియదంటే మీరు వినటంలేదు. మీరింత దూరం రావడం అనవసరం."

"నువ్వు చెప్పేది నిజమని తేల్చుకున్నాక నిన్ను వదిలేస్తాను. నువ్వు భయపడకు. నా మూలంగా నీకే ప్రమాదం రాదు. నాతో మాట్లాడకపోతే పోలీసులతో మాట్లాడవలసివస్తుంది. నిన్ను అరెస్టు చేసి వాళ్ళు లాకప్‌లో పడేస్తారు!"

"రండి సార్, మీ కోసం యెదురు చూస్తూ వుంటాను."

రిసీవర్ పెట్టేశాను. దుస్తులు మార్చుకున్నాను. తల దువ్వుకొంటున్న పార్వతిని ముద్దెట్టుకొని కిందకు దిగాను. వంటతను క్రిష్ణయ్య కనిపించాడు. "ఇవాళ లంచ్‌కి కందట్లు సార్" అన్నాడతను.

కందట్లను గురించి వూహించుకొంటూ కారు షెడ్ వైపు పరుగెత్తాను. డాడ్జి కారును గేటువైపు పోనిచ్చాను.

తిరువళ్ళూరు హైరోడ్డు వారగా వుందా కంపెనీ ఆఫీసు. కారును ఆపి ఇండియా కింగ్స్ సిగరెట్ వెలిగించాను. రోడ్డుదాటి ఒక యువకుడు కారువైపు వచ్చాడు.

అతడివైపు నవ్వుతూ చూశాను. వయస్సు యిరవై ఐదేళ్ళు వుంటుంది. సన్నగా, పొడుగ్గా వున్నాడు. కోల ముఖం. మనిషి పచ్చగా అందంగా వున్నాడు. పాంట్, స్లాక్ ధరించాడు. చేతికి డేట్ సెట్ వాచ్ వుంది.

అతడిని కార్లో కూర్చోమన్నాను. తిరిగొచ్చి కారులో కూర్చున్నాడు. పక్కకు తిరిగి అతడివైపు హిప్నాటిస్టులా

చూశాను. అతడి కళ్ళలో ఏదో భయం గోచరిస్తోంది.

"రమ నీకు తెలియడం వలన యీ హత్యకేసులో నువ్వు ఇరుక్కోవు. ఏ నేరం చెయ్యనంతకాలం నీకు ఏ బెంగా వుండనవసరం లేదు. నిన్ను నేను కాపాడ్తాను. నువ్వు నిజం చెప్పి నాతో సహకరిస్తే ఆ అమాయకురాలి హంతకుడిని పట్టుకొనేందుకు తోడ్పడతావు" అన్నాను శాంతంగా.

అతడు ఓ నిమిషంపాటు మాట్లాడలేదు. మౌనంగా వుండిపోయాడు. ,

"పరశురామ్‌గారూ, రమ నాకు తెలుసు. ఆమెను నేను గాఢంగా ప్రేమించాను. నిన్న నాతో ఆమె బీచ్‌కి వచ్చింది" అన్నాడతను కన్నీళ్ళు కారుస్తూ.

"అక్కడేమైంది?"

"ఇద్దరం పడవపక్కన చంద్రకాంతిలో కూర్చున్నాం. ఆమె నా ఒళ్ళో వెల్లకిలా పడుకొంది. కమ్మటి కబుర్లు చెప్పుకుంటూ ఆనందిస్తున్నాం. సమీపంలో యెవ్వరూ లేరు. అమాంతంగా ఎవరో నన్ను చంపమీద కొట్టారు. నేను స్పృహతప్పి పడిపోయాను. అటుపైన ఏం జరిగిందో నాకు తెలియదు. అరగంట తర్వాత నేను మేలుకొని ఆమెకోసం చూసాను. కొంచెం దూరంలో ఆమె పడుకొని వుంది. సముద్రపు నీళ్ళతో మొహం కడుక్కొని ఆమె పడుకున్నచోటుకు వెళ్ళాను. ఆమెమీదున్న రక్తాన్ని చూసి తారెత్తిపోయాను. నన్ను కొట్టిన వ్యక్తి ఆమెను చంపేసివుంటాడని వూహించాను. నేను ఏం చెయ్యాలి? రమ యీ లోకంలో లేదు. ఈ కేసులో ఇరుక్కోడం నాకిష్టం లేదు. ఆమెను వదిలి మెల్లిగా వెళ్ళిపోయాను."

అతడు ఆగాడు. కన్నీళ్ళు ధారలుగా కార్తున్నాయి.

"ఆమెను ఆ విధంగా వదిలేసిపోతున్నందుకు నా హృదయం నన్ను పీకుతోంది. పబ్లిక్ టెలిఫోన్ బూత్ నుంచి ఆమె యింటికి ఫోన్ చేసి, కంఠం మార్చి ఆమె తండ్రితో యీ వార్త చెప్పాను. అటుపైన నా యింటికి పోయాను" అన్నాడు మోహన్.

"మిస్టర్ మోహన్, ఆమెను మరెవరేనా ప్రేమించారా?"

"లేదుసార్. ఎవరేనా ప్రేమించి వుంటే ఆమె నాతో తప్పక చెప్పేది."

సిగరెట్ పొగ వదులుతూ ఆలోచిస్తున్నాను.

"నీకు తగిలిన దెబ్బనుబట్టి అతడు చాలా బలమైన వాడై వుండాలి!"

"సందేహం లేదు సార్. అతడి చెయ్యి యినుముతో చేసినట్లుంది."

అతడి చంపను పరీక్షించాను. కుడివైపున చర్మం కమిలిపోయినట్లు నల్లబడివుంది.

"రమను నువ్వు కల్సుకుంటున్నట్లు ఆమె తలిదండ్రులకు తెలుసా?"

"ఎవ్వరికీ తెలియదు సార్. సరైన సమయం చూసి మా పెళ్ళి విషయం ఆమె తండ్రితో చెప్తానంది. ఆమె ధనవంతురాలు. నేను ఉద్యోగం చేసుకుంటూ జీవిస్తున్నాను. నా జీతం ఇంకా పెరిగితేగాని తండ్రి ఒప్పుకోరని ఆమె అనేది."

"ఎంతకాలం నుంచి ఆమె నీకు తెలుసు?"

"సంవత్సరం నుంచి. ఆమె కాలేజిలో బి. ఏ. చదువుతూ వుండేది."

"నువ్వామెను పెళ్ళాడ్తానంటే, మీ వాళ్ళు ఒప్పు

కున్నారా?"

"నాకు అమ్మ మాత్రంవుంది. నేనామెతో చెప్పాను. ఆమె వెంటనే ఒప్పుకుంది."

ఆలోచిస్తూ వుండిపోయాను. మోహన్ వైపునుంచి రమకు శత్రువులులేరు. మరెవ్వరూ ఆమెను ప్రేమించ లేదు! ఈ హత్యకు మోటివ్ దొంగతనం కాదు. హంత కుడు ఆమెను రేప్ చేయలేదు. అందాలొలికించే ఆ పువ్వును హంతకుడు తుంచి యెందుకు మట్టిపాలు చేశాడు?

ఇది లక్షరూపాయల ప్రశ్న! జవాబిచ్చిన వ్యక్తికి లక్షరూపాయలు యివ్వొచ్చు!

"మిస్టర్ మోహన్, గత సంవత్సరంలో మీరిద్దరూ ఎన్నిసార్లో కలుసుకొనివుంటారు. ఆమె నీతో ఎన్ని విష యాలో చెప్పివుంటుంది. ఏవైనా గుర్తున్నాయా?"

"ఇప్పుడు చెప్పలేను సార్. నా మనస్సు ప్రస్తుతం బాగాలేదు."

జేబులోంచి నా కార్డుతీసి అతడికిచ్చాను.

"ఏదేనా గుర్తొస్తే నా నంబరుకు ఫోన్ చేసి చెప్పు. నేను లేకపోయినా చెప్పు. నా భార్య నీ మాటల్ని రికార్డు చేస్తుంది. నేను వచ్చాక అంతా వింటాను."

"అలాగే సార్" అన్నాడతడు.

"గుడ్ లక్" అని అతడిని కారులోంచి దిగి పోనిచ్చాను.

## 4

అతడు తోటలో తిరుగుతున్నాడు. చెట్లమీదున్న పక్షులు కూస్తున్నాయి. వాటివైపు కోపంగా చూస్తూ రెండు రాళ్ళను పైకి విసిరాడు. పక్షులు ఎగిరి దూరంగా పోయాయి.

అతను మెల్లిగా ముందుకు కదిలాడు. తెల్లిటి కుక్క అతడి పక్కనుంచి పరుగెడుతోంది. ముందుకు దూకి దాని మెడను అమాంతంగా కుడిచేత్తో పట్టుకున్నాడతను. కుక్క మొరుగుతోంది. అతడు దాన్ని వదల్లేదు. ఎడం చేత్తో దాని మూతిని బిగించి పట్టుకున్నాడు.

కుక్క యిప్పుడు మొరగడం లేదు. మూలుగుతోంది. గజగజ కొట్టుకుంటూంది, కాళ్ళు ఆడిస్తూ. అతడు దాన్ని వదల్లేదు. జేబులోంచి పిడిబిగించి వున్న ఆయుధాన్ని పైకి తీశాడు. కింద భాగానికున్న ప్లాస్టిక్ కావ్‌ను తీసేశాడు.

పిడి కిందున్న గుండ్రటి స్టీల్ బిళ్ళకు పదునైన లావు పాటి ఆరు నీటిల్స్ అతకబడ్డాయి. వాటివైపు తృప్తి కరంగా చూశాడతను.

పిడిని పట్టుకొని ఆయుధాన్ని పైకెత్తాడు. కుక్క యింకా పెనుగులాడ్తోంది. దాని కడుపులోకి తటాలున పొడిచాడు. అనేక చోట్ల అలా పొడుస్తూనే వున్నాడు. కుక్క రక్తంతో ముద్దయివుంది. దాని మూతిని అతడు వదిలేశాడు, కాని అది మొరిగే స్థితిలో లేదు.

తన ఆయుధానికి ప్లాస్టిక్ కావ్ మూసేసి అతడు దాన్ని తన జేబులో పడేసుకున్నాడు. జేబులో వున్న చాక్లెట్‌ను నోట్లో పడేసుకున్నాడు. నవ్వుతూ అతడు కుక్కవైపు చూశాడు. కుక్క ఒంటిమీద ఆరు చిల్లుల చక్రాలు! మృత్యుచక్రాలు!

అతడు యిటూ, అటూ చూశాడు. చెట్టుక్రింద ఖాళీ సిమెంట్ బాగ్స్ వున్నాయి. ఒక సంచిని తెచ్చి అందులో కుక్కని పడేశాడు. ఆ సంచిని తీసుకెళ్ళి కారు డిక్కీలో పెట్టాడు.

కారును పోనిచ్చాడు. అతడు ఆలోచిస్తున్నాడు. ఆ ఆయుధాన్ని అతడు కలకత్తాలో చేయించాడు. కంపెనీ వాళ్ళకు తన పేరు సుధాకర్ ముఖర్జీ అని చెప్పాడు. అతడి మెదడులో యిటువంటి ఆలోచనలన్నీ సాగుతున్నాయి.

నిర్మానుష్యంగా వున్న రోడ్డమ్మట కారు వెళుతోంది. అతడు కారును ఆపి దిగాడు. డిక్కీలోని సంచిని రోడ్డు వారగా పడేసి కారును పోనిచ్చాడు. తనింటికి చాలా దూరంలో వుందా స్థలం!

కారు స్పీడుగా వెళుతోంది. అతడి మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి.

ఆ కుక్క పోలీసుల దృష్టిలో పడుతుందా? లేక రాబందులు, కాకులు పీక్కుని దాన్ని తినేస్తాయా?

* • •

టెలిఫోన్ మ్రోగుతోంది. వెళ్ళి రిసీవర్ని ఎత్తాను.

"హలో, పరశురామ్!" అన్నాను.

"బ్రదర్, మా బీట్ కానిస్టేబుల్ ఒక కుక్కను చూసి మాకు రిపోర్టిచ్చాడు. ఎవరో పొడిచి, పొడిచి కుక్కను చంపారు" అన్నాడు ఇన్స్పెక్టర్ నాయర్.

"పిచ్చికుక్కేమో?"

"మా వెటర్నరీ డాక్టర్ దాన్ని పరీక్షించాడు. దానికి రేబాస్ లేదు. అది మామూలు కుక్క. ఆ కుక్క శరీరం మీదున్న పోట్లను చూస్తే రమ శవం మీదున్న గాట్లు గుర్తుకొస్తాయి" అన్నాడు నాయర్.

"నాయర్ భాయ్!" అన్నాను ఆశ్చర్యంగా.

"బ్రదర్, ఆ కుక్క యింకా అక్కడే వుంది, మిల్స్ రోడ్డు వారగా. నువ్వు వెంటనే రా, నేను యీ

సమీపం నుంచే మీకు ఫోన్ చేస్తున్నాను."

"ఆల్ రైట్. వస్తున్నా!"

రిసీవర్ పెట్టేసి కిందకు పరుగెత్తాను. డాడ్జి కారును శరవేగంగా మిల్సర్ రోడ్డువైపు పోనిచ్చాను. పోలీస్ జీప్ చూసి కారాపి దిగాను. ఇన్స్పెక్టర్ నాయర్ గబగబా వచ్చి నా చెయ్యి పట్టుకున్నాడు.

"అదుగో కుక్క!" అన్నాడు నాయర్.

జేబురుమాల్తో ముక్కు మూసుకుని కుక్క దగ్గరగా వెళ్ళాను. దాని ఒంటిమీదున్న చక్రాల పోట్లను చూసి నిర్ఘాంతపోయాను. సందేహంలేదు. రమను చంపినవాడే యీ కుక్కను చంపివుండాలి! ఈ సమీపంలో అతడి యిల్లు వుందేమో! ఈ ఆలోచన్ని వెంటనే నా మెదడు లోంచి తొలగించాను. హంతకుడు మూర్ఖుడే తేగాని తనింటి సమీపంలో ఈ కుక్కను పడేయడు. ఎక్కడో చంపి దూరంగా తెచ్చి యీ స్థలంలో పడేసివుంటాడు!

ఈ కుక్కని చంపడంలో హంతకుడి అర్థమేమిటి? పోలీసులు చూసేటట్లు దాన్ని రోడ్డువారగా పడేశాడు. ఈ కుక్కద్వారా హంతకుడు నాకు ఏదేనా సందేశం పంపదల్చాడా? హత్య చేయబడిన రమ యీ కుక్కతో సమానమైందని అతడు చెప్పదల్చాడా?

సిమెంట్ సంచిని పరిశీలించాను. దానిమీద ఎవరి అడ్రెసూ లేదు. వెనక్కు తిరిగి కారువైపు నడిచాను. రాబందులు ఆకాశంలో ఎగురుతున్నాయి. కాకులు అరుస్తూ పైన తిరుగుతున్నాయి.

ఇండియా కింగ్స్ సిగరెట్ వెలిగించాను. పొగ వదుల్తూ ఎదురుగా వున్న ఇన్స్పెక్టర్ వైపు చూశాను.

"బ్రదర్, హంతకుడు ఈ కుక్కను చంపి యిక్క

డెందుకు పడేసివుంటాడు?" అడిగాడు నాయర్.

"నాయర్ భాయ్, పోలీసులను ఏడిపించడానికి చేసి వుంటాడు. ఈ కుక్క కోసం పోలీస్ బృందంతో నువ్వు జీప్‌లో రావడం చూసి హంతకుడు పొట్ట పగిలేటట్టు నవ్వుకుంటూ వుంటాడు" అన్నాను.

"రాస్కెల్, ఐ విల్ గెట్ హిమ్!" అన్నాడు నాయర్ ఆగ్రహంతో.

"నాయర్ భాయ్, ఇదంతా చూస్తుంటే రమ హత్యతో పూరుకునేటట్లు లేడు హంతకుడు. ఇక్కడ ఈ కుక్కను పడేసినట్లు మరికొన్ని శవాలను అతడు మనకు వదలొచ్చు. పట్నం నలువైపులా పాట్రోల్ వాన్స్‌ను తిప్పుతూ వుండాలి. నిర్జన ప్రదేశాల సమీపంలో కానిస్టేబుల్సు తిరుగుతూ వుండాలి. పెద్దపార్కులు, బీచ్ లాంటి ప్రదేశాల్లో పోలీసులు గస్తీలు తిరగాలి."

"అలాగే చేయిస్తాను, బ్రదర్. మరో హత్య జరగకుండా వాడు మన చేతుల్లో చిక్కుతాడు, నీ సహాయంతో" అన్నాడు నాయర్.

"నాయర్ భాయ్ నేను డిటెక్టివ్‌ని, దేవుడిని కాను! అనేక విధాలుగా హంతకుడి కోసం ప్రయత్నాలు సాగిస్తున్నాను. ఇంకా అతడి వునికి నాకు అంతుచిక్కలేదు" అన్నాను.

"బ్రదర్, నీ మీద నాకు నమ్మకముంది. నువ్వు సాధిస్తావు!"

కారులో కూర్చుని తలుపు మూశాను. రోడ్డమ్మట కార్లు యిటూ అటూ దూసుకుపోతున్నాయి. ఏ కార్లోనో కూర్చుని హంతకుడు మమ్మల్ని చూసి నవ్వుకుంటూ వుండొచ్చు. ఇన్‌స్పెక్టర్ నాయర్‌కి బై బై చెప్పి కారును

పోనిచ్చాను.

పోలీస్ జీప్ నా కారు వెనకనే కదిలింది. రాబందులు కిందకు దూసుకొస్తూన్న చప్పుడు వినపడ్తోంది.

# 5

"హలో, పరశురామ్ స్పీకింగ్" అన్నాను.

"నేను మోహన్ సార్" అన్నాడతను.

"ఏదేనా జ్ఞాపకమొచ్చిందా?"

"కొన్ని విషయాలు గుర్తుకొచ్చాయి. రమ అత్తయ్య కొడుకు పేరు అంగీరస్. అతడు పొట్టిగా, సన్నగా వుంటాడట. రమాకంటె కొంచెం పెద్దవాడట. అతడికి రమ అంటే చాలా పిచ్చిట. ఎప్పుడూ ఆమె చుట్టూ తిరుగుతూ వుండేవాడని ఆమె చెప్పింది. అతడు వుండే వూరు ఖరగ్ పూరు."

"ఇంకా ఏదయినా వుందా చెప్పవలసింది?"

"ఒకసారి ఒక పెళ్ళికొడుకు ఆమెను చూడటానికి వచ్చాడు. అతడు ఏనుగులాంటి మనిషి. చాలా అంద విహీనంగా వున్నాడు. అతడిని చూసి ఆమె పరిహాసంగా నవ్వింది. కోపంతో అతడు వెళ్ళిపోయాడు."

"అతడి పేరూ, వూరూ తెలుసా?"

"ఆమె తండ్రికి తెలిసి వుండొచ్చు" అన్నాడు మోహన్.

"ఎనిథింగ్ మోర్?"

"ప్రస్తుతానికి ఈ రెండే, సార్.""

"ఫోన్ చేసి చెప్పినందుకు థాంక్స్. ఆనాడు బీచ్ కి మీరు ఆటోలో వెళుతున్నపుడు ఏ కారేనా, స్కూటరేనా మిమ్మల్ని వెంటాడిందా?"

"నేను చూడలేదు సార్. ఆమె పక్కనుంటే నాకు

మరేదీ కనిపించేది కాదు."

"మీరు ఆ పడవవేపు నడిచే సమయంలో బీచ్ లోపల రోడ్డుమీద మీ సమీపంలో ఏ కార్లేనా వున్నాయా?"

"ఏ కార్లూ మొదటలేవు. తర్వాత ఒక కారొచ్చి ఆగింది. కాని కార్లోంచి ఎవ్వరూ దిగలేదు" అన్నాడతను.

"అదేం కారో చెప్పగలవా?"

"నల్లటి అంబాసిడర్ కార్."

"థాంక్స్" అని రిసీవర్ని పెట్టేశాను.

గణపతిరావు నంబరు తిప్పాను.

"హలో, గణపతిరావు సార్."

"పరశురామ్ హియర్! మీ అమ్మాయిని చూడ్డానికి గతంలో కొంతమంది వచ్చి వెళ్ళారని విన్నాను. ఎంత మంది వచ్చారు?"

"ఆరుగురు పెళ్ళికొడుకులు వచ్చి చూసి వెళ్ళారు. కాని వాళ్ళు అమ్మాయికి నచ్చలేదు."

"చూడ్డానికి వచ్చిన ఒకతను చాలా అందవిహీనంగా వున్నాడని విన్నాను. అతడినిచూసి మీ అమ్మాయి నవ్విందట. అతడి పేరేమిటి?"

"అతడి పేరు గుర్తులేదు సార్. అడ్రసూ తెలియదు. నేను మిస్ అయిన బస్ నంబర్లు నాకు గుర్తుండవు సార్"

"గుర్తుంచుకోవడం ఒక్కోసారి వుపయోగపడ్తుంది," అని రిసీవర్ని పెట్టేశాను.

ఏనుగులాంటి మనిషి! అందవిహీనుడు! అతడెవరు? తననిచూసి పరిహాసంగా నవ్వినందుకు అతడామెమీద పగ బట్టాడా? పెళ్ళిళ్ళ సందర్భంలో ఎందర్నో చూస్తూ వుంటాము. ఎందరో నచ్చరు. నచ్చకపోవడం హత్యకు

దారితీయదు!

రోజులు దొర్లి పోతున్నాయి. నా పరిశోధన మొదటి గడిలోనే వుంది. ఏదో కొత్త క్లూ దొరికితేగాని పరిశోధన ముందుకు జరగదు.

భోజనం ముగించి సోఫాలో పడుకుని అమెరికన్ పత్రికలో నా గురించి రాసిన రచనను పార్వతి చదువుతుంటే మౌనంగా వింటున్నాను. రచయిత నన్ను ఎక్కువగా పొగిడేశాడు. అదంతా వింటూంటే నాకే నవ్వువస్తోంది.

టెలిఫోన్ మ్రోగింది. వెళ్ళి రిసీవర్ని అందుకున్నాను.

"హలో, పరశురామ్ స్పీకింగ్" అన్నాను.

"బ్రదర్, హంతకుడు మళ్ళీ రాయి విసిరాడు!" అన్నాడు నాయర్.

"మరో కుక్కా?" ప్రశ్నించాను.

"ఈసారి కుక్క కాదు. మరో యువతి!"

"నువ్వు ఎక్కడున్నావు?"

"నాయుడూ పార్కులో."

"నేను వస్తున్నా" అని రిసీవర్ పెట్టేశాను.

"కాస్సేపు మీతో కూర్చుని మాట్లాడేందుకు వీలు కాదు. ఏదో పని!" అంది పార్వతి విసుగ్గా.

"మైడియర్, డిటెక్టివ్ల జీవితం అంతే. ఏక్షణంలో ఎక్కడనుంచి పిలుపు వస్తుందో వాళ్ళకే తెలియదు!" అన్నాను నవ్వుతూ.

పదినిమిషాల్లో నాయుడూపార్కుకు చేరుకున్నాను. చాలా విశాలమైన పార్కు. పార్కుగేటు తెరిచివుంది. కారును లోపలకు పోనిచ్చి పోలీస్ జీపు ముందుగా ఆపాను.

ఇన్స్పెక్టర్ నాయర్ నా దగ్గరకు ఎవరో తన్నిన

బంతిలా వచ్చిపడ్డాడు. అతడివైపు నవ్వుతూ చూసాను. మా సమీపంలో లైట్ ప్రకాశవంతంగా వెలుగుతోంది.

"నాయర్ భాయ్, ఏమిటంత ఖంగారు పడుతున్నావు?"

"బ్రదర్, రమలాగే యీమె హత్య చేయబడింది."

"పద చూద్దాం."

కానిస్టేబుల్సు పార్కులో అనేకచోట్ల తిరుగుతూ వున్నారు. నాయర్‌తో పడమరవైపుకు వెళ్ళాను. సిమెంట్ సోఫాముందు గడ్డి నేలమీద ఆమె వెల్లికిలా పడివుంది. ఆమె ధరించిన తెల్లచీర రక్తమయంగా వుంది. ఆమెను కసితో హంతకుడు పదిచోట్ల పొడిచాడు. పది మృత్యుచక్రాలు! ప్రతి చక్రానికీ ఆరు చిల్లులు!

ఆమె వయసు ఇరవైలోపున వుంటుంది. ఆమె అంత అందమయినది కాదు. ఆమె ఒంటిమీద నగలున్నాయి. జాకెట్ లోపల దాచిన చిన్నపర్సులో రెండు రూపాయలు, కొంత చిల్లరవుంది. ఆమె మధ్యతరగతి కుటుంబానికి చెందినదై వుండాలి.

టైమ్ చూశాను. పదకొండు కావస్తోంది. నాయర్ వేపు చూశాను.

"ఈమె ఎవరో తెలిసిందా?"

"లేదు."

"ఈ పార్కుకి వాచ్‌మన్ వుండాలిగా?"

"అతడే," అని నాయర్ దూరంలో నిలబడిన ఒక మనిషివైపు చూపించాడు.

అతడి దగ్గరకు వెళ్ళాను. పొట్టిగా, లావుగా వున్నాడు. ఖాకీ నిక్కర్, షర్టు వేసుకొన్నాడు.

"వాచ్‌మన్ నువ్వేనా?"

అతడు తలాడించాడు.

"ఆమె తరచు యీ పార్కుకు వస్తూ వుంటుందా?"

"ఆమెను చాలాసార్లు చూశాను సార్."

"ఈ పార్కును ఎన్నింటికి మూసేస్తారు?"

"మునుపు పదింటికి మూసేవాళ్ళం సార్. టి. వి. వచ్చాక 10-15కి మూస్తున్నాను."

"మూసేముందు పార్కులో ఎవ్వరూ లేకుండా చూస్తావా?"

"ఒక్కోసారి చూస్తాను, సార్. ఒక్కోసారి చూడటానికి వీలుపడదు. లోపల ఎవరేనా వుంటే ఏ గోడో దూకి వాళ్ళే పోతారు" అన్నాడతను.

"ఆమె ఇల్లెక్కడో తెలుసా?"

"తెలియదు సార్. ఈ చుట్టుపక్కలనే వుంటుంది. దూరంగా వుండేవాళ్ళు యింతసేపు యిక్కడ కూర్చోరు" అన్నాడు వాచ్‌మన్.

ఇన్‌స్పెక్టర్ నాయర్ నా దగ్గరకు పరుగెత్తుకొచ్చాడు. అతడి వెనకనే పంచె, చొక్కా వేసుకున్న వ్యక్తి మాకు దగ్గరయ్యాడు.

"బ్రదర్, ఈయన పేరు రఘుపతి. ఈయన ఆ శవాన్ని పోల్చారు. ఆమె ఈయన కూతురు. పేరు కమల," అన్నాడు నాయర్.

రఘుపతి వంక సూటిగా చూశాను.

"మీరు యిక్కడికి ఎలా వచ్చారు?" అడిగాను.

"అమ్మాయి యింటికి రాలేదు. ఆమె కోసం వెతుకుతూ యిలా వచ్చాను. ఏదో శవం వుందని తెలిసి వెళ్ళి చూశాను. నా కూతుర్ని యెవరో ఘోరంగా హత్య చేశారు" అన్నాడతను.

"ఆమె ఈ పార్కుకి ఒంటరిగా వస్తూవుంటుందా?"

"ఒంటరిగా వస్తుంది, వాడి కోసం!"

"ఎవరికోసం?"

"పరశురామ్‌గారూ, నా కూతురు యిక తిరిగిరాదు. మీకు ఏదీ దాచకుండా నిజం చెప్తాను. ఆమెను యెవరు హత్య చేశారో మీరు కనుక్కుంటే నా మనసుకు కొంత శాంతి చేకూరుతుంది."

"చెప్పండి!"

"ఆమెకోసం ఎన్ని సంబంధాలో తెచ్చాను. ఆమె అందర్నీ తరిమేసింది. ఈ రోజుల్లో ఆడపిల్ల పెళ్ళి చేయడము ఎంత కష్టమో తమరికి తెలిసేవుంటుంది. నాకు ఆరుగురు ఆడపిల్లలు, నలుగురు మగపిల్లలు. ఈమె అందరి కంటె పెద్దది. బి. ఎ. పాసయ్యింది. చదువే దాన్ని పాడుచేసింది. పెళ్ళికాకుండా ఎంతకాలం అలా పడి వుండగలదు? ఓ బస్ కండక్టరుతో ఈమెకు స్నేహమయింది. అతడిని నేను ఇంటికి రానివ్వనన్నాను. వాడికోసం యిక్కడికొచ్చి కూర్చుంటూ వుంటుంది. ఇది మంచిది కాదని నేనన్నా ఆమె వినదు" అన్నాడతను.

"ఆ కండక్టర్ పేరు?"

"దేవరాజ్."

"అతడామెను పెళ్ళాడ్తానన్నాడా?"

"అదే వాళ్ళ వుద్దేశం. బి. ఎ. పాసయిన యువతి బస్ కండక్టర్‌కి సరస్వతీదేవిలా అగుపిస్తుంది."

"వాళ్ళెందుకు పెళ్ళి చేసుకోలేదు?"

"డబ్బు పోగుచేశాక చేసుకుంటారని విన్నాను. నేను ఈ పెళ్ళి చెయ్యనన్నాను. కావలిస్తే వాళ్ళే చేసుకుంటారని వదిలేశాను."

"ఇంతకుముందు మీరు తెచ్చిన సంబంధాలేవీ ఆమెకు నచ్చలేదా?"

"శని నెత్తిమీద కూర్చునివుంటే ఎలా నచ్చుతాయి సార్? నేను తెచ్చినవాటిలో ఒకతను చాలా ధనవంతుడు. అతడికి కారూ, పెద్దయిల్లు అన్నీ వున్నాయి. మనిషి అంత అందంగా వుండడు లెండి."

"అతడిలో లోపం ఏమిటి?"

"అతడి పైపెదిమలో తొర్రివుంది. నల్లగా వుంటాడు. అయినా మనిషి బలశాలి. పెద్దమనిషి. అతడిని యెడా పెడా తిట్టి పొమ్మంది కమల. కోపాన్ని దిగమింగుకుంటూ అతడు వెళ్ళిపోయాడు!"

అతడు చెప్పింది విని ఆశ్చర్యపోయాను. రమ ఇంటికి పెళ్ళిచూపులకు వెళ్ళినతను కమల ఇంటికికూడా వెళ్లాడు. రమ, కమలా అతడిని తిరస్కరించారు. ఇద్దరూ ఘోరంగా చంపబడ్డారు!

రఘుపతివంక చూశాను.

"ఆ పెళ్ళికొడుకు పేరేమిటి?"

"సుందరం."

"అతడెక్కడుంటున్నాడో తెలుసా?"

"అతను ఈ పట్నంవాడు కాదు. విజయవాడ నివాసి. వాళ్ళ స్వంత యిల్లు గవర్నర్ పేటలో వుందన్నాడు."

"అతడు విజయవాడనుంచి యిక్కడకు కారులో వచ్చాడా?"

"వచ్చుండాలి."

"ఆ కారునంబర్ మీకు గుర్తుందా?"

"ఉంది. టి. ఎస్. ఎం. 36465."

"అంతబాగా ఎలా గుర్తుంది?"

"అతడికి మా యిల్లు తెలియదు. కారులో పాండీ బజారుకు వచ్చి వుంటానని అతడన్నాడు ఫోన్‌లో. ఎవర్నైనా అక్కడకు పంపమని తన కారు నంబరు చెప్పాడు. నేనే వెళ్ళి కారు నంబరు చూసి, అతడిని యింటికి తీసుకు వచ్చాను."

"అది అంబాసిడార్ కారా?"

"కారు పేరు నాకు తెలియదు సార్. కారుమాత్రం విశాలంగా వుంది. సుఖంగా కూర్చోవచ్చు."

అతడివైపు సూటిగా చూశాను.

"అతడిని మరికొంచెం వర్ణించండి," అన్నాను.

"అతడు ఆరడుగుల పైన పొడుగుంటాడు. అతడిని చూస్తే భయమేస్తుంది. కనుబొమ్మలు రెండూ కలిసి వుంటాయి. కుడిచెవి ప్రక్కన పెద్ద వులిపిరికాయ వుంటుంది. పై పెదవి మధ్యలో చీలివుంటుంది."

ఇన్‌స్పెక్టర్ నాయర్ వేపు తిరిగాను.

"నాయర్ భాయ్, నీపని కానీ. వెంటనే హంతకుడు మనకు దొరక్కపోవచ్చు. త్వరలో దొరుకుతాడు," అన్నాను.

ఇన్‌స్పెక్టర్ నాయర్, నేనూ శవం దగ్గరకు వెళ్ళాం. డాక్టర్ సుధాకర్ శవాన్ని పరీక్షిస్తున్నాడు.

"మిస్టర్ పరశురామ్, ఈసారి హంతకుడు ఈమెను రేప్ చేసి తర్వాత హతమార్చాడు" అన్నాడు డాక్టర్ సుధాకర్.

"రియల్లీ!" అన్నాను ఆశ్చర్యంగా.

"నిస్సందేహంగా" అన్నాడు డాక్టర్.

క్షణకాలం అటూయిటూ పచార్లు చేస్తూ ఆలోచించ సాగాను. రమా ఈమెకంటే చాలా అందమయినది.

ఆమెను రేప్ చేయని హంతకుడు ఈమెని యెందుకు రేప్ చేశాడు? వాళ్ళు అతడిని తిరస్కరించారు—వాళ్ళమీద విశేషమయిన అసహ్యాన్ని అతడు సృష్టించుకున్నాడు. అటువంటి స్థితిలో వాళ్ళను రేప్ చేయడు. డాక్టర్ సుధాకర్ చెప్పింది దీనికి విరుద్ధంగా వుంది.

ఆలోచిస్తూ వాచ్‌మన్ దగ్గరకు వెళ్ళాను.

"ఈరాత్రి ఆమె పార్కులో కూర్చునివుండగా నువ్వు చూశావా?"

"చూశాను సార్."

"ఆమె ఒంటరిగా వుందా?"

"బస్ కండక్టర్‌తో ఆమె కూర్చుంది."

నాకు కావలసిన జవాబు అదే. ఇప్పుడు అంతా స్పష్టంగా వుంది. బస్ కండక్టర్ దేవరాజ్ చీకట్లో ఏ మూలో ఆమెను అనుభవించి వుంటాడు. అతడు వెళ్ళిపోయాక ఈ హత్య జరిగివుండాలి!

వెనక్కి తిరిగాను. ఇన్‌స్పెక్టర్ నాయర్ దగ్గరకు వెళ్ళాను. ఇద్దరం నా కారువేపు నడిచాం.

"నాయర్ భాయ్, అనేక విషయాలు తెలిశాయి. హంతకుడు త్వరలో నీకు చిక్కుతాడు" అన్నాను.

"ఏదో తొందరగా జరగాలి బ్రదర్. కాస్సేపట్లో కాకల్లా పత్రికల వాళ్ళు యిక్కడికొస్తారు. పోలీసు డిపార్టుమెంటు నిద్రపోతోందని ప్రజలు నిందిస్తారు" అన్నాడు నాయర్.

"ప్రస్తుతం మనం ఏమీ చెయ్యలేం. కొంతకాలం పాటు ప్రజలు ఎంత దూషించినా మనం భరించాలి. ప్రజల ఆగ్రహం శాశ్వతం కాదు. ఇందిరాగాంధీని కిందకు లాగినవాళ్ళే మళ్ళా ఆమెను సింహాసనం ఎక్కిం

చారు. హంతకుడు ఎవడు చిక్కాక, అంతా మర్చిపోయి ప్రజలు శెభాష్ అంటారు."

తలుపు తెరిచి కార్లో కూర్చున్నాను. ప్రెస్ వాన్ లోపలకు వస్తోంది. ఇన్‌స్పెక్టర్ నాయర్ శవంవైపు పరుగెత్తాడు. నేను డాడ్జికారును వేగంగా ముందుకు పోనిచ్చాను.

"మిస్టర్ పరశురామ్! పరశురామ్!" అర్చారు కొందరు విలేఖర్లు.

కారు స్పీడు హెచ్చించాను.

## 6

టైమ్ చూశాను—పదకొండు కావస్తోంది. మగ్‌లో వున్న బీర్ తాగి సిగరెట్ వెలిగించాను. జర్మనీ బీర్ అఖండంగా వుంది.

టెలిఫోన్ మ్రోగింది. రిసీవర్ని ఎత్తాను. ఎస్. టి. డి. కాల్ ఫ్రమ్ విజయవాడ. ఇన్స్పెక్టర్ కొండలరావు అటువైపు నున్నాడు.

"పరశురామ్‌గారూ, గవర్నర్ పేటలో మీరు అడిగిన సుందరం అనే వ్యక్తి లేడు. అతడి కిక్కడ స్వంత యిల్లు వుండడం కల్ల. ఆ వ్యక్తి మీతో అబద్ధం చెప్పి వుండాలి," అన్నాడు కొండలరావు.

"థాంక్స్ ఫర్ ది యిన్‌ఫర్‌మేషన్," అన్నాను.

రిసీవర్ పెట్టేశాను. సోఫాలో కూర్చుని మళ్ళీ బీర్ తాగడంలో నిమగ్నుడనయ్యాను. టెలిఫోన్ మళ్ళీ మ్రోగింది.

"హలో, పరశురామ్ హియర్!"

"నేను, సార్, సెల్వమ్ ఫ్రమ్ ట్రాఫిక్ అండ్ లైసెన్సింగ్!"

"చెప్పండి, మిస్టర్ సెల్వం."

"మీరు పొరబడ్డారు. ఆ కారు సుందరం అనే వ్యక్తిది కాదు. ఆ కారు ఓనర్ పేరు పి. నాగరాజు. అతను నెంబర్ 10, దేవర్ స్ట్రీట్, మైలాపూర్‌లో నివసిస్తున్నాడు."

"చాలా థాంక్స్, మిస్టర్ సెల్వం."

"మీకేం కావలసినా క్షణంలో సమాచారం అందజేస్తాను, సార్. వుంటాను," అని అతడు రిసీవర్ని పెట్టేశాడు.

సోఫాలో కూర్చున్నాను. కథ అడ్డం తిరిగింది. నాగరాజు ఎవరు? అతడే సుందరమా? వెళ్ళి రహస్యంగా చూడాలి!

మగ్‌లో వున్న బీర్‌ను పూర్తిగా తాగేశాను. ఇండియా కింగ్స్ సిగరెట్ వెలిగించాను. పొగ పీల్చి వదులుతూ కాస్సేపు ఆలోచించాను.

గబ-గబా మెట్లు దిగాను. డాడ్జికారును దేవర్ స్ట్రీట్ వైపు పోనిచ్చాను. 10 నంబరున్న గేటువైపు చూశాను. గేటుముందు వాచ్‌మన్ వున్నాడు. కొంచెం దూరం పోనిచ్చి కారును ఆపాను.

పెద్ద మేడ లోపలుంది. ఇంటి నలువైపులా పెద్ద తోటవుంది. ఇంటి చుట్టూ ఐదడుగుల ఎత్తున ప్రహరీ గోడ వుంది. కారును వెనక్కు తిప్పి పోనిచ్చాను. పదో నంబర్ గేటుముందు కారాపి వాచ్‌మన్‌కి సౌజ్ఞ చేశాను. గూర్ఖా దగ్గరగా వచ్చాడు.

"సాబ్ యింట్లో వున్నారా?" ప్రశ్నించాను.

"లేరు, సార్," అన్నాడతను.

కారును పోనిచ్చాను. ఫర్లాంగు దూరం వెళ్ళాక ఒక

చెట్టుకింద కారాపి కూర్చున్నాను. సిగరెట్ తర్వాత సిగరెట్ పీలుస్తున్నాను. నిమిషాలు గడుస్తున్నాయి. అరగంట తర్వాత నల్లటి అంబాసిడర్ కారు రోడ్డుమ్మట దూసుకు పోయింది.

కారు నడుపుతున్న వ్యక్తివైపు చూశాను. సందేహం లేదు! సుందరం ఉరఫ్ నాగరాజు అతనే! వెనక్కి తిరిగి చూశాను. గూర్ఖా గేటు తెరిచాక కారు లోపలకు దూసుకు పోయింది.

డాడ్జికారును శరవేగంగా యింటికి పోనిచ్చాను. ఇంటి ముందు కారాపి దిగాను. మెట్లెక్కి హాల్లోకెళ్లాను. మగ్ నిండా బీరుపోశాను. సగంపైన తాగేశాను.

రిసీవర్ ఎత్తి ఒక నంబర్ తిప్పాను.

"హలో, ఇన్స్పెక్టర్ నాయర్!"

"నాయర్ భాయ్, ఇవాళ హంతకుడిని స్వయంగా చూశాను."

"ఎక్కడ?"

"అతడి యింటి ప్రాంతంలో."

"బ్రదర్, అడ్రెస్ చెప్పు! వెంటనే అతడిని అరస్టు చేస్తాను," అన్నాడు నాయర్ హుషారుగా.

"నాయర్ భాయ్, మరికొంతకాలం ఓపిగ్గా కూర్చో! హంతకుడు నీ దగ్గరకొస్తాడు."

"అదెలా సాధ్యం బ్రదర్? ఏ దోషీ పోలీసుల దగ్గరకు రాడు. మాకు దూరంగా పరుగెడ్తాడు!"

"నాయర్ భాయ్, నా మాటల్ని నువ్వు సరిగ్గా అర్థం చేసుకోలేదు. హంతకుడు మనదగ్గరకు రాకపోవచ్చు కాని మనం అతడి దగ్గరకు వెళ్దాం. పారిపోయే అవకాశం అతడికుండదు! ఎలకలా మనకు చిక్కిపోతాడు."

"ఆ రోజు కోసం ఎదురుచూస్తూ చూస్తుంటాను," అన్నాడు ఇన్స్పెక్టర్.

*　　　　*　　　　*

ఆకాశంలో చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. ఇసుకలో రేవతి, సుధాకర్ ఎదురెదురుగా కూర్చుని వున్నారు. సమీపంలో ఎవ్వరూ లేరు. సముద్ర కెరటాల హోరు వాళ్ళకు వినిపిస్తోంది.

"రేవతీ, గుడ్ న్యూస్! నీ గురించి మా అమ్మతో చెప్పాను. ఆమె మన పెళ్ళికి ఒప్పుకుంది. నిన్ను రేపు సాయంత్రం మా యింటికి తీసుకు వెళ్తాను," అన్నాడతను.

ఆమె ఆనందంగా అతడి చెయ్యి పట్టుకుని నిమిరింది.

"ఈ వార్త విని అమ్మా, నాన్నా సంతోషిస్తారు," అందామె.

"నువ్వు సంతోషించవా?" అడిగాడతను కొంటెగా.

"నా సంతోషాన్ని నీకు అందిస్తాను," అందామె.

ఏదో ఆకారం వాళ్ళవైపు కదులోంది. రేవతి, సుధాకర్ కూర్చున్న స్థలానికి కొంచెం దూరంలో ఒక పడవ వుంది. వాళ్ళ పక్కనుంచి ఆ ఆకారం ముందుకు వెళ్ళి, తటాలున వెనక్కి తిరిగింది.

గాభరాపడ్తూ సుధాకర్ లేచాడు. సుధాకర్ వైపు దూకిందా ఆకారం.

పడవలోంచి బయటకు దూకాను. రాకెట్ లా వాళ్ళ వైపు పరుగెత్తాను. సుధాకర్ కిందపడి మూలుగుతున్నాడు. రేవతిని బలంగా తోసిందా ఆకారం. ఆమె యిసుకలో పడింది. ఆమె మీదకు ఆకారం దూకింది.

"నన్ను వదులు!" అరుస్తోందామె.

"నా చేతుల్లో పడ్డవాళ్ళకు విముక్తి లభించదు!"

అందా ఆకారం.

"ఎవరు నువ్వు? నీకేం కావాలి?"

"నువ్వు తిరస్కరించిన మనిషిని!" అని అతడు చెయ్యి పైకి ఎత్తాడు.

అతడి వెనకనుంచి మెల్లిగా జరిగాను. కిందకు దిగబోయిన అతడి చెయ్యిని మెలితిప్పాను. చేతిలోని ఆయుధం యిసుకలో పడింది.

పాములా బుసకొడుతూ అతడు లేచాడు. బూట్‌తో అతడి పొట్టలో తన్నాను. అతడు యిసుకలో పడ్డాడు. అతడి కాళ్ళను పైకెత్తి పట్టుకుని గిర్రున తిప్పాను.

"రాస్కెల్!" అర్చాను.

అతడు లేవడానికి ప్రయత్నిస్తున్నాడు. కాళ్ళు నా చేతుల్లో వుండడం వలన లేవలేకపోతున్నాడు.

మెల్లిగా యీలవేశాను. పడవలోంచి ఇన్‌స్పెక్టర్ నాయర్, అరడజన్‌మంది కానిస్టేబుల్స్ నావైపు పరుగెత్తుకొచ్చారు. అతడికాళ్ళను వదిలేశాను. కానిస్టేబుల్స్ అతడిని చుట్టేశారు. ఇన్స్‌పెక్టర్ నాయర్ అతడి చేతులకు సంకెళ్ళు వేశాడు.

అతడు ఇసుకలో కూర్చుని వున్నాడు. మూలుగుతున్న సుధాకర్ లేచి రేవతి సహాయంతో నా దగ్గరకొచ్చాడు. ఇసుకలో కూర్చున్న వ్యక్తి మీద టార్చి కాంతి పడింది.

"నువ్వా!" అర్చింది రేవతి.

"ఇతడు నీకు తెలుసా?" ఆమెను అడిగాను.

"పెళ్ళి చూపులకు మా యింటికొచ్చాడు. అతడిని యిలా చూసి వెంటనే లోపలకు పరుగెత్తాను," అందామె.

"మిస్టర్ నాగరాజు, యింకా యిలా ఎంతమందిని చంపాలని నీ ఆశ?" అడిగాను.

"నన్ను తిరస్కరించిన వాళ్ళందర్నీ!" అన్నాడతను.

"కాని యిటు పైన చంపే అవకాశం నీకు రాదు!"

"రాకపోతే పోనీ! ఈ వికృత రూపంతో బ్రతకడం కంటె చావడం మేలు," అన్నాడతను.

ఇన్స్పెక్టర్ నాయర్ యిసుకలో పడున్న ఆయుధాన్ని జేబురుమాలో పట్టుకుని నాకు చూపించాడు. పొడుగాటి పదునైన ఆరు స్టీల్ నీడిల్స్ టార్చి కాంతిలో మెరుస్తున్నాయి.

"అతడిని జీప్ లో కూర్చోబెట్టండి," అన్నాను.

కానిస్టేబుల్స్ అతడిని లాక్కుపోయారు.

"దేవుడిలా వచ్చి మీరు మమ్మల్ని రక్షించారు," అంది రేవతి.

"రేవతీ, యూ ఆర్ లక్కీ! సుధాకర్ యూ్స్ లక్కీ! మీరిద్దరూ పెళ్ళాడి సుఖంగా జీవించాలని నా ప్రార్థన," అన్నాను.

అందరం దూరంలో వున్న కారు వెపు నడిచాం.

ఇన్స్పెక్టర్ నాయర్ నాతో కరచాలనం చేశాడు.

"థాంక్స్, బ్రదర్. అనుకున్నకంటె త్వరగా హంతకుడు దొరికాడు. ప్రెస్ విలేఖర్లను పిలిచి అంతా చెప్తాను," అన్నాను.

"గుడ్ లక్," అన్నాను.

ఇన్స్పెక్టర్ జీప్ వైపు వెళ్ళిపోయాడు. రేవతినీ, సుధాకర్నీ నా కారులో ఎక్కమన్నాను. ఇద్దరూ ముందు సీటుమీద కూర్చున్నారు. పోలీస్ జీప్ కదిలింది. వెనకనే అంబాసిడర్ కారు వెళుతూంది.

డాడ్జికారును పోనిచ్చాను. నా పక్కనే సుధాకర్ వున్నాడు.

"మీరు ఎక్కడికి వెళ్ళాలి?" అడిగాను.

"అజంతా హోటల్ దగ్గర దిగిపోతాం." అన్నాడతను.

"మమ్మల్ని కాపాడిన మీ పేరు చెప్తే చాలా సంతోషిస్తాం," అంది రేవతి.

"తొందరపడకండి. మీరు కారు దిగాక చెప్తాను," అని స్పీడు పెంచాను.

—: ఐపోయింది :—

# (పన్నెండవ భాగం)

డాక్టర్ జులేఖా—లూసీని తన యింటికి తీసుకు వెళ్ళడానికి అనుమతి ఇచ్చినందుకు, రాణా ఎంతో సంతోషించాడు.

అతనిమీదా, లూసీమీదా చేయవల్సిన పరీక్షలన్నీ పూర్తయ్యాయి.

సందర్భవశాత్తూ, వారి అవసరం ఏర్పడగలదని, యిద్దర్నీ రీసెర్చి భవనంలోనే ఉండిపోమని, కోరుదామనుకొన్నది జులేఖా. కాని, తమ ఉనికి ప్రతిరోజు ఆమెకు రిపోర్టు చేస్తామని, రాణా ప్రామిస్ చేసిన తర్వాత ఆమె సంతోషంగా వొప్పుకుంది, ఒకరినొకరు ఓదార్చుకోడానికే పరస్పరం గాయాలు మాన్పుకోడానికీ ప్రేమికులకు ఏకాంతం అవసరమని గ్రహించి.

జులేఖా ఉద్దేశం ప్రకారం వైద్యం—ఒక పేషంట్‌ని నయం చేయటంలో ఒక స్థాయివరకే ఉపయోగపడుతుంది. ఆ తర్వాత—ఆ వ్యక్తి పట్టుదల, ఇన్‌స్టింక్టుల మీద మిగతాది ఆధారపడి ఉంటుంది.

రెండు రోజులుగా, విషమేఘం ఆచూకీ తెలియక పోయినా, రాణా అధికారులతో రెగ్యులర్ టచ్‌లో ఉన్నాడు.

విషమేఘం వదిలిపెట్టిన అడుగుజాడల్లో యింకా కొందరు ఉన్మాదులౌతూనే ఉన్నారు. ప్రతి వ్యక్తినీ రక్షించడం, ప్రభుత్వానికి కష్టసాధ్యమైంది.

చాలామందిలో 'ప్రభావం' వెనువెంటనే కనబడుతోంది. మెదడు కణాలు, ప్రమాదకరమైన పారసైట్స్‌తో అతివేగంగా ఆవహించబడి—వెంటనే పిచ్చివాళ్ళు అవుతున్నారు.

చాలామంది చంపబడ్డారు. కొంతమంది తమనుతాము చంపుకుంటున్నారు....అధికార పార్టీకి, చేటుకాలం దాపురించినట్టుంది....

రాణా, చేతివేళ్ళు, లూసీ నడుముమీది సున్నితమైన వంపును తాకాయి....

తమను విడదీయడాన్కి—ఏ క్షణంలో అధికారుల ఫోన్ కాల్ వస్తుందోనని భయపడుతున్నాడు రాణా.

తిరిగి ఆ విషమేఘంలో ప్రవేశించే ఆలోచనను అసహ్యించుకున్నాడు రాణా. ఆ రాక్షసి ఈపాటికి నాశనమై ఉండాలని లోలోపల ప్రార్థిస్తున్నాడు భగవంతుడ్ని.

ఆమెలో కదలిక వచ్చింది....

వెచ్చదనాన్ని కోరుతున్నట్లు, అతనివైపు జరిగింది, మత్తుగా మూల్గుతూ.

అతను ప్రక్కకు ఒరిగి, ఆమె నడుంమీద చేయి ముందుకు లాక్కున్నాడు, యిద్దరి శరీరాలు తాకేలా.

ఇప్పుడు పూర్తిగా మేల్కొన్నదామె.

"గందరగోళం యిక ముగిసినట్టేనా?" అడిగింది లూసీ.

"విషమేఘమా? ఆ పీడకల ముగిసిందనే ఆశిస్తున్నాను."

"ఈపాటికి ఏదో పరిష్కారం కనిపెట్టి ఉండాలి..."

"కాల్షియం క్లోరైడ్ బాగా పనిచేసింది. వాళ్ళకి యింకా ఈ కెమికల్ సప్లైస్ భారీ ఎత్తున కావాలి."

"విషమేఘం ప్రమాదమైందని చెప్పడాన్కి ప్రభుత్వానికెందుకు సంకోచం?"

"దానికారణం, ఆ కెమికల్ మైక్రోప్లాస్మాని ఎలా డిస్ట్రాయి చేయగలిగిందో అర్థంగాక. అశ్వత్థామ

సలహాపై ఈ విషయంలో కూల్‌గా ప్రవర్తిస్తున్నారు, మైక్రోప్లాస్మా ప్రమాదం పూర్తిగా తొలగిపోయిందన్న విషయం నిర్ధారణ కావడాన్ని ఎదురుచూస్తూ."

"ఎప్పుడు—ఆ నిర్ధారణ జరిగేది?"

"ఎవరికి తెలుసు? నాసిక్ ఏరియాని పూర్తిగా కవర్ చేసి పరిశోధించేవరకూ."

"లేక—ప్రజలు పిచ్చివాళ్ళు కావడం పూర్తిగా తగ్గిందని తెలిసేవరకూ" అందామె భయంగా అతని దగ్గరగా జరుగుతూ.

బెంగగా ఆమెవైపు చూడసాగాడతను.

"ఐయామ్ ఓ.కే" అన్నదామె క్లుప్తంగా.

అతను ఫోమ్ బెడ్‌మీద లేచికూర్చున్నాడు. యిక ఎప్పుడూ చేరుగతంలోకి తన ఆలోచనలు చెదిరిపోనీయ కూడదని నిర్ధారించుకుంటూ, "ఐ విల్ గెట్ సమ్ కాఫీ డార్లింగ్."

"నో" ఆమె అతన్ని బెడ్‌మీదకు లాగింది, "నువ్విక్కడే ఉండు నేను తేస్తా."

రెండు చేతులు మడిచి తలక్రింద పెట్టుకుంటూ వెనక్కి వాలాడు రాణా, నగ్నంగా మెరిసిపోతూ పైకి లేచిన ఆమె, తను వదిలిపెట్టిన ఫుల్‌హాండ్స్ చొక్కా ధరించడం చూస్తూ.

తన చొక్కా, ఆమెకు బాగా వదులుగా ఉండి, ఆమె అందాన్ని మరింత ద్విగుణీకృతం చేసింది.

ఆమె మంచంమీదికి వంగి, అతనిని ముద్దాడింది. చొక్కాలోంచి సగం బైటపడ్డ ఆమె వక్షోజాలు, అతనిలో ఒక్క క్షణం సంచలనం రేపాయి.

ఆమె మంచంచుట్టూ తిరిగివెళ్ళి, కర్టెన్ వైపు నడిచింది.

కర్టెన్ ఒకప్రక్కకి లాగుతూ ఆగిపోయిందామె!

ఆమె శరీరం హఠాత్తుగా బిర్రబిగుసుకుపోవడం గమనించాడతను.

"రా....ణా!...." సగం అతనివైపు తిరిగి—బైటి దృశ్యాన్నుంచి దృష్టి మరల్చుకోలేక నిలబడిపోయిందామె.

యింతకుముందు తనకు పరిచయం ఉన్న భయం ఏదో ఆవహించినట్లనిపించింది రాణాకి.

అతను బెడ్ మీంచి చివాలున ఉరికాడు. నాలు గంగల్లో ఆమె ప్రక్కకు చేరుకొని, కర్టెన్ ఒక్క ఊపుతో చివరికి లాగేశాడు.

అప్పుడు నిల్చిపోయాడు శిలాప్రతిమలా.

మేడక్రింద కనబడుతున్న దృశ్యాన్ని చూస్తూ— "మైగాడ్! మైగాడ్!" అన్నాడతను ఊపిరి బరువుగా పీలుస్తూ—

కాని....

ఆ గాజు కిటికీ అవతల....క్రిందుగా....అంత భయంకరమైన దృశ్యమేమీ లేదు.

—బూడిదరంగు శూన్యం—

దట్టంగా ఉన్నప్పటికీ—శూన్యంగా ఉండి, అక్కడక్కడ లేతపసుపు రంగులో ఉన్న మేఘం....

రాతిబొమ్మల్లా చాలాసేపు నిలబడిపోయారిద్దరూ— అవతలి గదిలో ఫోన్—పొలికేక పెడుతోందని గ్రహించే వరకూ.

* * *

ఆ కాల మేఘం.....

ఆ మహమ్మారి.....

బొంబాయి నగరంలో అడుగు పెట్టిందని హెచ్చరించడాన్కి వాక్యంతో ప్రయత్నించారు!

అది హఠాత్తుగా ప్రత్యక్షమైంది!

బలమైన, గాలికి కొట్టుకువచ్చిన చిన్న మేఘం....

రెండు రోజుల తీవ్ర అన్వేషణ తర్వాత, మేధావులు రిలాక్సవుతుండగా, అది ప్రత్యక్షమయింది, ఆకాశ రాకాశిలా.

మొదట్లో అది తెల్లవారుఝాము పొగమంచులో దాక్కుంది. అప్పటివరకూ దేనికోసమో కాచుకున్నట్టు అది తర్వాత పైకిలేచింది, బలం పుంజుకుంటూ, బొంబాయి నగరంలోకి తీసుకపోయే పడమటి గాలులకోసం ఎదురు చూస్తూ—

వేగంగా, నేలబారుగా, తమ దారిలోకి దూసుకువస్తున్న ఆ విష మేఘాన్ని చూసి, ప్రజలు భయాభ్రాంతులై, అన్నివైపులకీ పారిపోయారు.

ప్రభుత్వ సూచన ప్రకారం—కొందరు తెలివైనవాళ్లు మాత్రం తాము పారిపోయేముందు 'మొబైల్ ఆపరేషన్ బేస్'కి ఫోన్ చేసారు. మిగతావాళ్ళు తమ ప్రాణం రక్షించుకొనే హడావుడిలో కాలికి బుద్ధి చెప్పారు.

బొంబాయి పొలిమేరల్లోంచి ప్రయాణిస్తుండగా, విష మేఘం ఆకారం పెద్దగా పెరిగింది.

మొదట చిన్న చిన్న బస్తీలను దాటి, అది యిండస్ట్రియల్ ఎస్టేట్‌లగుండా ప్రయాణించి, అవి వదిలిపెట్టే కల్మష వాయువుల్ని ఆకలిగా, ఆబగా, తన విషపు పొట్టలో కలుపుకుంటూ పెరిగి పెద్దదైంది.

తర్వాత మెల్లగా అది సెంట్రల్ బాంబేలోకి అడుగు పెట్టింది.

ఆర్మీ తిరిగి ఒకచోట పోగయింది.... మిలటరీ వాహనాలు, విషమేఘం ముందుగా పురవీధుల్లో పరిగెట్టుకుంటూ లౌడ్‌స్పీకర్లు అదరగొడుతూ, హెచ్చరికలు చేయసాగాయి.

కాని, వాళ్ళకు తెలియకపోలేదు, తమ ప్రయత్నం వృధా ప్రయాస అని.

ప్రజలు నిద్ర కళ్ళు రుద్దుకుంటూ, లేచి తమ హెచ్చరికను పూర్తిగా అర్థం చేసుకొనే సమయానికి, వెనకాల తరుముతున్న విషమేఘం వారిని ఆవహిస్తుంది.

అయినా వాళ్ళు ప్రయత్నించారు.

కనీసం మూడువంతుల్లో రెండువంతుల సైన్యం ప్రయత్నించింది.

మిగతా మూడోవంతు సైన్యం, బొంబాయి నగరం లోపలికి దూసుకుపోయింది.... 'మిగతా లక్ష్యాలను' నిర్వహించడానికి.

* * *

ఆ ఉదయం డాక్టర్ జులేఖాని ఆమె అసిస్టెంట్ నిద్రలేవగొట్టాడు.

ఆమె గబ-గబా దుస్తులు మార్చుకొని, స్లీపింగ్ క్వార్టర్స్ వదిలిపెట్టి ప్రక్కనే ఉన్న ఆఫీసు గదిలోకి ప్రవేశించింది.

ఫోన్ ఎత్తి, స్విచ్‌బోర్డు ఆపరేటర్‌ని—తనకోసం ఎదురుచూస్తున్న కాల్‌కి తక్షణం కనెక్షన్ ఇవ్వమని ఆదేశించింది.

కాల్ వచ్చింది....

నిశ్శబ్దంగా వినసాగింది....

ఆమె ముఖంలో భావాలు మారలేదు....

చూపులు మాత్రం విషాదాన్ని ప్రతిఘటిస్తున్నట్లున్నాయి.

ఆమె చివరికి ఫోన్ క్రెడిల్ చేసి—దానివైపే తదేకంగా చూస్తూ వుండిపోయింది చాలాసేపు.

ఉలిక్కిపడి, ఆమె ఆలోచనల్లోంచి బైటపడింది. దిగ్భ్రమగా నిలబడిపోయిన అసిస్టెంట్ ని చూస్తూ, గబ-గబా ఆర్డర్స్ జారీచేసింది జులేఖా—

వెంటనే మెడికల్ రీసెర్చ్ సెంటర్ ఖాళీచేయమనీ, నేరు చేయడానికి వీలైన పరికరాలన్నింటినీ, నోట్సులు, రికార్డులన్నింటినీ మరో రహస్య ప్రదేశానికి తరలించడానికి వీలుగా సిద్ధంగా పాక్ చేసి ఉంచమనీ....

* * *

అరుణోదయ సమయం....

డిపార్టుమెంట్ ఆఫ్ ఎన్విరాన్ మెంట్ లో పనిచేసే రాణా, సహోద్యోగి—కపిల్ శ్రీవాత్సవ—తెర్చివున్న పడగ్గది కిటికీలోంచి బయటికి తదేకంగా చూస్తూ ఉండిపోయాడు పొగమంచుకేసి....

కన్నీళ్లు కార్చని, అతని కళ్ళు బరువెక్కి వున్నాయి. అతనికి తెలుసు అది విషమేఘమని!....

చుట్టూ ఉన్న పసుపుఛాయ చెబుతోందా నిజాన్ని. అతనికి తెల్సు—యిలాంటి పరిస్థితి ఎదురౌతుందని... సంక్షోభాల నెదుర్కోడంలో—ప్రభుత్వ కృషిమీద అతనికి ఎక్కువ నమ్మకంలేదు.

పరిస్థితి ఈ విధంగా చిందరవందర ఔతుందని అతను ఊహించాడు.

బయటి ప్రజలకంటే, తనకు ముందునుండీ బాగా తెలుసు ఈ ప్రమాదం గురించి.

తన కొలీగ్ రాణా అసుభవాలు!....

తమ బాస్ రామ్‌కింకర్ హఠాన్మరణం!....

తన ప్రక్కగా, దుప్పటి క్రింద ముడిచిపెట్టుకు పడుకున్న భార్యవైపు చూసాడు శ్రీవాత్సవ.

ప్రక్కగదిలో నిద్రిస్తున్న పిల్లలు జ్ఞాపకం రాగానే, అతని ఆవేదన ఉధృతమైంది....

కళ్ళలో నిలవలేని అశ్రువులు,క్రిందికి జారిపడ్డాయి....

ఈ విష ప్రభావం, తన కుటుంబం మీదపడి తాము పిచ్చివాళ్ళు కావడానికి ఎంత టైం పడ్తుంది??

తను, ఉన్మాది అయిన వెంటనే ఏ విధంగా ప్రవర్తిస్తాడు?

తన కుటుంబాన్ని తానే హతమారుస్తాడా?

తన భార్యనీ....పిల్లల్నీ....తన చేతుల్తో....

శ్రీవాత్సవ బలంగా నిట్టూర్పు విడిచాడు.

వారిని రక్షించడానికి ఓ మార్గం కనుక్కోవాలి!!

భార్యను లేపకుండా, జాగ్రత్తపడుతూ, అతను మంచం వారగా కూర్చున్నాడు.

ఏదో జవాబు కనుక్కోవాలి!

తన కుటుంబాన్ని కట్టి పడేస్తే?....

గదిలో పెట్టి, తాళం వేస్తే?....

తననుండి వాళ్ళను రక్షించడం ఎలా?....

వారిలో వాళ్ళు తగువులాడి చంపుకోకుండా చూడ్డం ఎలా?....

అవును?....

తను యిప్పుడు బైటికి పోతే?....

వారిలో వారికి రక్షణ కల్పించి, బైటికిపోతే....

విష మేఘంలోకి విచ్చలవిడిగా....

నో!....

తను వారిని వదలిపెట్టలేడు....

అది తప్పించుకొని పారిపోడం అవుతుంది....

తను వేగంగా ఆలోచించాలి!....

గబగబా....

మెదడు విషపూరితం కావడాన్కి ఎంత టైం పడుతుందో.... దేవుడికే తెలియాలి!....

బాస్ రామ్‌కింకర్‌కి ఒకరోజు పట్టింది....

రాణాకి — వెనువెంటనే,

అప్పుడు తట్టింది మెరుపులా ఆలోచన శ్రీవాత్సవకి.

ఆలోచన అంత శ్రేష్టమైనది కాదు.

కాని వాళ్ళకి కొంత టైం యిచ్చినట్లవుతుంది.... ప్రభుత్వాన్కి .... ప్రాణరక్షణ చర్యలు ప్రారంభించడాన్కి....తల పంకించి, గబగబా తన కూతురు గదిలోకి వెళ్ళాడు కపిల్ శ్రీవాత్సవ.

స్టాండ్ మీద వున్న చిన్న బ్లాక్ బోర్డునీ, సుద్దముక్కనీ, తీసుకుని, తలుపు దగ్గరగా వేసి అలికిడి కాకుండా బైట పడ్డాడు.

మెట్లు దిగి క్రిందికి వెళ్ళి, ఆఖరి మెట్టుమీద కూర్చుని, బోర్డుమీద, సుద్దముక్కతో పెద్దపెద్ద అక్షరాలతో చకచకా ఓ సందేశాన్ని రాశాడు.

వీధి తలుపు తెరిచి, గుమ్మంలో అమర్చాడు బోర్డుని, దాని లక్ష్యాన్ని అది సాధిస్తుందన్న ఆశతో.

గబ-గబా మెట్లెక్కి, వంటగదిలో ఎత్తుగా ఉన్న షెల్ఫ్‌లోని సీసాను అందుకున్నాడు కపిల్.

నిద్రమాత్రలు!

పిల్లలతో, ఒంటరిగా సంసార భారాన్ని మోయలేక తన భార్య ఆ అలవాటు చేసుకొంది.

బిందె మూతతీసి, గ్లాసునిండా, నీళ్లు తీసుకొని, తిరిగి తన కూతురి గదిలో ప్రవేశించాడు శ్రీవాత్సవ.

మంచంమీద నిద్రిస్తున్న ఎనిమిదేళ్ళ పసిపిల్ల తల పైకెత్తాడు.

బలహీనంగా సగం మత్తులో చేస్తున్న ఆ పసిపిల్ల ఆక్షేపణలను నిర్లక్ష్యంచేస్తూ, బలవంతంగా ఐదు నిద్ర మాత్రలు మింగించాడు.

తర్వాత, ఆమె బుగ్గల్ని ముద్దాడి, దుప్పటి కప్పి ప్రక్క గదిలో ఉన్న మగపిల్లల వద్దకు వెళ్ళి అదే పనిని తిరిగి చేసాడు.

పెద్ద కొడుకు మారుతిని వొప్పించడం చాలా కష్టమైంది ఆ తండ్రికి.

తరువాత పదిరూపాయలు యిస్తానని ఆశ పెడితేగాని, ఆ కుర్రాడు లొంగలేదు.

శ్రీవాత్సవ పూర్తి చేసిన మిగతాపని మరీ కష్టతరమైనది! భార్య శశిరేఖను, నిద్రలేపి, ఆ పని ఎందుకు చేస్తున్నాడో నచ్చచెప్పగలగాలి!

శశిరేఖ ఏడ్చింది.

నిరాకరించింది మొదట్లో తీవ్రంగా.

చాలాసేపు బోధనలు, వాద ప్రతివాదాలు యిద్దరి మధ్య కొనసాగిన తర్వాత అయిష్టంగా వొప్పుకుంది.

ఆచరించింది.

యిక తన విషయంలో—

శ్రీవాత్సవ ఎనిమిది నిద్రమాత్రలు మింగాడు.

ఎన్ని మాత్రలు తింటే, ప్రాణానికి హానికరమో సరిగా అతనికి తెలీదు....

మొత్తానికి, తను, తన కుటుంబం వేసుకున్న డోస్ ప్రమాద స్థాయిని చేరదని ఆశించాడు.

పైగా, యిప్పుడున్న పరిస్థితుల్లో ఆ మాత్రం రిస్కు తీసుకోక తప్పదు.

తిరిగి వెచ్చటి బెడ్ మీదకి చేరాడు శ్రీవాత్సవ ఏడుస్తున్న భార్యను, దగ్గరగా లాక్కుంటూ.

వారిద్దరూ, అలాగే పడుకుని ఉన్నారు, నిద్రాదేవి ఆవహించడంకోసం ఎదురుచూస్తూ.

* * *

అదే రోజు ఉదయం....

సూపరింటెండెంట్ మెహ్రోత్రా, అలసటగా వంటగది లోకి నడిచేడు. ఆవులిస్తూ ఎలక్ట్రిక్ కెటిల్ లో పాలు పోసి, స్విచ్ నొక్కాడు.

భగవాన్! తను ఎంత అలిసిపోయేడు!

ఆ విషమేఘం గొడవవల్ల, రాత్రనక, పగలనక నిర్విరామంగా శ్రమపడాల్సి వొచ్చింది.

యిప్పుడు ఊపిరి పీల్చుకోడాన్కి సమయం దొరికింది. విషమేఘం రెండు రోజులుగా అదృశ్యం కాబట్టి.

యిక అతను కొద్దిరోజులు శెలవు పెట్టాలి.

తను 'రాణా' వ్యవహారాన్ని ఎంతో నేర్పుగా హాండిల్ చేయగలిగాడు.

మొదట్లో అనధికారంగా, వ్యవహారం నడిపి.

అనధికారంగా తను చాల ఏర్పాట్లు చేసాడు, ముందుగా .రాణా చెప్పిన కథ పచ్చి నిజమని వెల్లడైనప్పుడు తనకు ప్రభుత్వంలో ఎంతో క్రెడిట్ దక్కింది.

మాహిమ్ దుర్ఘటన ఏర్పడకముందే, తాను కొన్ని చర్యలు తీసుకున్నందుకు.

ఇన్స్పెక్టర్ రైనాకు అత్యాశ ఎక్కువ.

తనలో తను నవ్వుకున్నాడు మెహ్రోత్రా.

పాలు మరుగుతున్న శబ్దం విని, ఆలోచనల్లోంచి ఉలిక్కిపడ్డాడు మెహ్రోత్రా. స్విచ్ ఆఫ్ చేసి కెటిల్ లో సెగలు కక్కుతోన్న పాలను కప్పులో పోసుకున్నాడు. తర్వాత నెస్ కాఫీ, సుగర్, కలిపాడు అందులో. ప్రాతః సమయంలో నిత్యం డాబామీద నిలబడి, కాఫీ త్రాగడం అతన్కి హాయిని గొల్పే అలవాటు.

లుంగీ మడత పెట్టుకుని, చేతిలో కాఫీ కప్పుతో మెట్లు ఎక్కి డాబా చేరుకున్నాడు మెహ్రోత్రా.

హఠాత్తుగా ఆగిపోయాడు మెహ్రోత్రా.

అతని కళ్ళు ఎదురుగా ఉన్న విషమేఘాన్ని గుర్తించే లోగా ఆ విషవాయువుని అప్పటికే గుండెలనిండా పీల్చాడు, తనకు తెలియకుండానే.

ఇన్స్పెక్టర్ రైనా నిద్రపోతున్నాడు.

ఆ వారం రోజులు చేతినిండా పని తగిలిందతనికి.

చాలా రోజుల తర్వాత ఆ రోజు ఆట విడుపు.

రైనా—తను రాణా చుట్టూ పనిమనిషిలా తిరగవల్సి వచ్చినందుకు అసహ్యించుకున్నాడు.

ఒక డిటెక్టివ్ ఇన్స్పెక్టర్ చేయాల్సిన పనికాదు అది. అలాంటి సంక్షోభంలో తనలాంటి యువకుడు, పోలీస్ అధికారి, నిర్వహించవల్సింది అందరూ మెచ్చుకొనే పని.

తన ధైర్యసాహసాలు వెల్లడయ్యే కార్యక్రమం.

అసలు రాణా, ప్రాముఖ్యతను సంతరించుకున్నది తన ప్రవేశంతోనే.

అతను తనకు చాలా కోపం కలిగించాడు. నిజమే! తను చాల కఠినంగా ప్రవర్తించాడు రాణాపట్ల- కాని తర్వాత తన తప్పు తెల్సుకున్నాడు.

చాల సందర్భాల్లో అతనికి తోడుగా నిలిచాడు.

అతని గురించి బాధ పడ్డాడు.

అతనితో స్నేహ సంబంధాలు పెంచుకోడానికి తాపత్రయపడ్డాడు.

రెండోసారి, ఉన్మాద వ్యాధి సోకే ప్రమాదం లేదు కాబట్టి రాణా ప్రముఖ వ్యక్తి అయ్యాడు.

రాణాకు బాడీగార్డుగా ఉన్నంతసేపూ అతనికి ఏదైనా ప్రమాదం వాటిల్లితే తన పరువు ఏమయ్యేదీ?

అలా జరక్కుండా అనుక్షణం అప్రమత్తతో ఉన్నాడు తను.

కాని రాణా, పూర్తి స్నేహ భావంతో తనకు రెస్పాన్స్ యిస్తున్నట్లు కనబడ్డంలేదు.

గతంలో తన ట్రీట్‌మెంట్, యింకా మనసులో పెట్టుకున్నాడేమో?

ఏమైతేనేం, యిక గొడవ ముగిసింది.

విష మేఘం ప్రహసనం యిక ముగిసినట్లుగా కనబడ్తోంది.

కాల్షియం క్లోరెడ్ దాన్ని పూర్తిగా నాశనం చేసి ఉండాలి. ఈ ఆలోచనలన్నీ — 'గత' రాత్రికైనా మంచంమీద నడుం వాల్చగానే—ఏర్పడ్డవి.

పూర్తిగా అల్సిపోవడంవల్ల అతనికి గాఢమైన నిద్ర పట్టింది.

సూర్యకాంతి కిటికీగుండా పడుతున్నా యింకా అతను మేలుకోలేదు.

గదిలో ఉన్న విష మేఘంగుండా ప్రసరిస్తున్న సూర్య కాంతి!

• * •

బొంబాయి మహా నగరమంతా—

ప్రజలు నిద్రలేచి పసుపు మేఘం కోసం ఎదురు చూస్తున్నారు.

కొంతమందికి తెలిసీ—మరికొందరికి తెలియకా,

అప్పటికే నిర్లక్ష్యంగా—చాలామంది పిచ్చివాళ్ళు.

వేలాదిమంది ప్రజలు రాత్రికి రాత్రి నగరాన్ని వదిలి పెట్టి వెళ్ళారు.

అదృష్టవశాత్తూ రాత్రి—లౌడ్ స్పీకర్ హెచ్చరికలు వినడంవల్ల, రేడియో ప్రసారాలు వినడంవల్లా,

హెచ్చరికను విన్నవాళ్ళు—బంధువులకీ, స్నేహితులకీ, ప్రమాదాన్ని తెలియజేసారు, ఆదరాబాదరాగా వారి యింటికి వెళ్ళిగాని, టెలిఫోన్ ద్వారా గాని.

కానీ, అది మహానగరం!

తెలిసి పారిపోయిన వాళ్ళు బహు తక్కువ, హెచ్చరికలు గురించి అసలు తెలియని లక్షలాది జనంతో పోలిస్తే.

కాని, ఉదయం ఏర్పడ్డ నరక దృశ్యాలతో, పోలిస్తే గతరాత్రి ఏర్పడ్డ వినాశం బహు తక్కువ.

* * •

రాణా స్పెషల్ ఆర్మీ వాన్ ని—విశాలమైన భూగర్భ రహస్య స్థావరంనుండి ఏటవాలుగా ఉన్న కాంక్రీట్ నేలమీదుగా బైటికి పోనిచ్చాడు, దట్టంగా పొగమంచు

అలుముకున్న వీధుల్లోకి.

సురక్షిత, లోహపు దుస్తులు ధరించి విచిత్రమైన ఆకారంలో ఉన్న డోగ్రా, అనబడే వ్యక్తి రాణా ప్రక్కగా కూర్చుని ఉన్నాడు, కిటికీలోంచి గంభీరంగా బైటికి చూస్తూ.

"ఎలా వెళ్ళాలి?" అడిగాడు రాణా.

"ఎడమవైపు సముద్రపు టొడ్డునే ఉన్న రోడ్డు మీదుగా పోనీండి. ఆ రోడ్డుగుండా సిటీలోకిపోతే మనం అక్కడికి చేరతాం" అన్నాడు డోగ్రా.

వాన్‌ని ఎడమవైపు తిప్పాడు రాణా, పేవ్‌మెంట్ ఆధారంగా చేసుకుని, ప్రక్కనుంచి ముందుకు పోనిస్తూ.
పొగమంచు యింకా దట్టంగా ఉంది, ఉదయం రాణా భూగర్భ రహస్య సావరాన్ని ప్రవేశించినప్పటిలాగే.

పొగమంచుతో నిండిన ఆ పురవీధులగుండా ఉదయం తను ప్రయాణించినప్పటి భయంకర ' అనుభవాలు గుర్తుకు రాగా ఒళ్ళు జలదరించింది రాణాకి—

ప్రొద్దున రాణా, లూసీ—విస్తరించుకుంటూ అవహిస్తున్న విషమేఘాన్ని షాక్ తిన్నట్లు చూస్తుండగా ఫోన్ పొలికేక వినబడింది.

విషమేఘం హిప్నాటిజంనుండి బయటపడి రాణా ప్రక్కగదిలోకి పరిగెట్టి ఫోన్ ఎత్తాడు.

అవతలివైపు ఆర్మీ అండర్ సెక్రటరీ రణధావే—గబగబా చెప్తూకుంటూ పోయాడు రాణా ఎదురుచెప్పడాన్కి లేశమైనా అవకాశం యివ్వకుండా.

అతని ఆదేశం ప్రకారం రాణా వెంటనే బయలుదేరి, బైకుల్లా బ్రిడ్జిదగ్గర నిలబడాలి.

అక్కడ అతన్ని—రకరకాల్ల యాంటెనాలతో

అమర్చబడిన ఓ ప్రత్యేక మిలటరీ వాన్—పికప్ చేసు కుంటుంది.

అక్కడనుంచి అతను ఓ రహస్య స్థావరంలో జరిగే సమావేశానికి తీసుకురాబడతాడు. రహస్య స్థలం ఎక్కడ ఉందో అప్పుడే వెల్లడించే అవకాశంలేదు.

దారిలో ఏర్పడే రకరకాల ప్రమాదాల్ని తప్పించు కుంటూ అతను బైకుల్లా బ్రిడ్జి చేరుకోవాలి.

ఎంత త్వరగా వీలయితే అంత త్వరలో—రాణా తన శరీరాన్కి ఎట్టి హాని ఏర్పడుచుకోకుండా జాగ్రత్తపడ్తూ, ఆ సమావేశాన్కి హాజరుకావాలి.

దారిలో ప్రమాదాలు ఎదురైతే, అతన్ని అతను రక్షించడం కోసం, ఎదుటి వ్యక్తిని చంపవొచ్చు!

లక్షలాది ప్రజల క్షేమం—రాణా క్షేమంపై ఆధార పడి ఉంది కాబట్టి—అతను ఒకరిద్దర్ని చంపినా పర్వాలేదు ఆత్మరక్షణకోసం.

లూసీ యిప్పుడెక్కడుందో, అక్కడే ఉండిపోవాలి.

నగరంలో యిద్దరూ ప్రయాణించడం వారికీ, దేశానికీ హానికరం.

రాణాకి ఏమయినా 'అనుకోనిది' జరిగితే, లూసీని కల్సుకొనే ప్రయత్నం ప్రభుత్వం చేస్తుంది.

స్పెషల్ ఆర్మీ వాహనాన్ని, రాణాను వెంటతీసుకు రావడాన్కి డైరెక్టుగా అతని యింటికే పంపుదామను కున్నారు. కాని—

ఆ ప్రయత్నం కొన్ని గంటలు పడుతుంది.

పైగా, నగరంనిండా పొగమంచు చిక్కగా అలుము కోడంవల్ల ప్రయాణం దుర్భరమయ్యే అవకాశం ఉండడం వల్ల స్పెషల్ వాహనం ప్రయాణించలేదు వేగంగా.

అది వేగంకన్నా—పాయిజన్ గాస్‌ల ప్రభావాన్ని లోపలిమనుషులు తట్టుకోడాన్కి వీలుగా నిర్మించబడింది. యిలాంటి సాంకేతిక కారణాలవల్ల ఆ ప్రయత్నం సాఫ్య పడలేదు.

రాణా సజీవంగా బైకుల్లా బ్రిడ్జి చేరుకోలేకపోతే, ఆ ఆపరేషన్‌లో లూసీని ఉపయోగించడం జరుగుతుంది. కారణం ఆమెకు కూడా వ్యాధి రెండవసారి సోకే ప్రమాదం లేకపోవడంవల్లనే.

సూచనలు వెంటనే అమలుపరుస్తానని రాణా చెప్ప గానే లైన్ కట్ అయింది.

రాణా గబగబా బట్టలు మార్చుకుంటూ, లూసీకి విషయాన్ని వివరించాడు.

ఆమె ఏడవలేదు.

అతని ప్రయత్నాన్ని ప్రతిఘటించలేదు....

తమ వ్యక్తిగత స్వార్థాన్ని వొదిలిపెట్టి, పరిస్థితుల కనుగుణంగా నడవక తప్పదని గ్రహించిన స్థితిలో ఉందామె.

ఆమెను బైటితలుపు గడియపెట్టి, బెడ్‌రూమ్ తలుపులు బంధించుకుని, లోపలే ఉండిపొమ్మని ఆదేశించాడు రాణా.

బైటి పిచ్చి ప్రపంచం గురించి పట్టించుకోకుండా, బెడ్‌రూమ్ తలుపులు మూసుకుని లోపలే ఉండిపోవాలని పించింది, ఒక్కక్షణం వారిద్దరికీ.

కాని అలా చేయలేదు.

యిద్దరూ, ఒకర్నొకరు ముద్దుపెట్టుకున్నారు, తటాలున రాణా నిష్క్రమించాడు, మాట్లాడకుండా.

మెట్లు దిగి గ్రౌండ్ ఫ్లోర్‌కివచ్చి, రోడ్డుమీద అడుగు పెట్టగానే అతని పీడకల కొత్త మలుపు తిరిగింది.

రోడ్లన్నీ శూన్యంగా ఉన్నాయ్....

రోజూ వుండే ట్రాఫిక్ లేదు....

కలియుగాంతం అయిపోయినట్లు అంతటా నిశ్శబ్దం....

వాతావరణంలో....అసహజమైన స్తబ్ధత....రోడ్లకు వారగా నడవసాగాడు రాణా, ఏ పిచ్చివాడైనా గుద్దుకుంటాడేమోనన్న భయంతో.

కాని—'ఉన్మాదులు కాని మామూలు మనుషులు' కనబడితే బావుండునని ఆత్రంగా వుంది అతని అంతరంగంలో.

జేబుల్లో చేతులుంచుకుని నడుస్తున్నాడు రాణా.

హఠాత్తుగా ఎక్కడ్నించో భయంకరమైన పొలికేక వినబడింది రాణాకి.

అతివేగంగా రోడ్డుమీద ఓ కారు దూసుకుంటూ వెళ్ళి, దూరంగా మాయమైంది.

వెంటనే కారు గుద్దుకున్న భయంకర శబ్దం....

తర్వాత నిశ్శబ్దం....

ఎవరో స్త్రీ అరుపు లీలగా వినబడింది అతనికి....

నవ్వుతో కూడిన అరుపు....

హిస్టీరియా నవ్వు....

మళ్ళీ ఏడుపు....

తర్వాత పురుషుడి నవ్వు....

గుండెలు చేత్తోపట్టుకుని నడుస్తున్నాడు రాణా. సమయం యింకా ఉదయం ఆరుగంటలే కావడంవల్ల— చాలామంది యింకా నిద్రలేవకపోవడంవల్లా, కొంతమంది యిప్పుడే మేలుకొనే సమయం కావడంవల్లా—కొంత ధైర్యంగా వుంది రాణాకి. మరో గంటపోతే?

పిచ్చివాళ్ళుగా నిద్రలేచిన మనుషులు ఏం చేస్తారో

అన్న ఆలోచన వచ్చి నడక వేగం హెచ్చించాడు రాణా.

యూసీకి మరోసారి వ్యాధి సోకే ప్రమాదం లేక పోవటంవల్ల ధైర్యంగా ఈ ఎస్సైన్‌మెంట్‌కి వొప్పుకో గలిగాడు రాణా.

ఆ భయంకర ప్రమాదం త్వరలో తొలగిపోతుందని అతని ఆశ.

పొగమంచులో రాణా, ఎదురుగా వస్తున్న ఆకా రాన్ని గుర్తించేలోగా ఆలస్యమైంది.

యిద్దరూ దఢాలున ఢీకొన్నారు.

ఆ మానవాకారం వెల్లకితలా నేలమీదపడింది.

రెండో ఆలోచనలేకుండా, రాణా ముందుకి వంగాడు ఆ వ్యక్తికి చేయూత నివ్వడానికి.

ఆ వ్యక్తి రాణా, రెండు భుజాలు పట్టుకున్నాడు పైకిలేస్తూ.

యిద్దరి ముఖాలు అడుగుదూరంలోకి వచ్చినప్పుడు గమనించాడు రాణా ఆ వ్యక్తి పెదవులమీద లాస్యం!

గాభరాగా వెనక్కి జరిగాడు రాణా.

కాని ఆ వ్యక్తి పట్టువదల్లేదు.

వ్రేలాడుతూ వుండిపోయాడావ్యక్తి, విజయగర్వంతో పక-పకా నవ్వుతూ.

భుజాలమీద క్లాంపైన ఆ ఉన్మాది ఉడుంపట్టు తప్పించడానికి పెనుగులాడాడు రాణా.

ఆ వ్యక్తి చేతులు మార్చి రాణా మెడకు వ్రేలాడ సాగాడు.

తల బరువుగా క్రిందికి నొక్కబడుతుండగా, రాణా ఉక్కిరి బిక్కిరౌతూ, పిచ్చివాడి పొట్టలో రెండు చేతుల్తో

పొడిచాడు.

ఉన్మాది ముఖంలో నవ్వు మాయమైంది. నోరుసాచి, తోడేలులా అరిచాడతను, క్రోధంతో రాణా మోకాళ్ళ మీద తన్నుతూ.

రాణా యింక ఆలస్యం చేయలేదు.

రెండు చేతులమధ్య, అతని ముఖాన్ని యిరికించుకుని మెరుపులా కదుల్తూ అతని తలను బలంగా గోడకు గుద్దించాడు.

"థప్"మన్నది అతని తల.

ఏం జరిగిందో కూడా చూడకుండా భయవిహ్వలుడై ముందుకు పరుగెట్టాడు రాణా.

కొంతసేపు తర్వాత ఆగి, ఒగుర్చుతూ చుట్టూ చూసాడు రాణా.

తను ఒంటరిగా ఆ వీధిలో వున్నట్టు గ్రహించాడు. రోడ్డు కటూ-ఇటూ పొగమంచు దట్టంగా పేరుకోడంవల్ల తను మధ్యగా పరిగెట్టి ఉండాలి—అనుకున్నాడు.

దారితప్పలేదని ఆశిస్తూ, మళ్ళీ ముందుకి నడవసాగాడు రాణా, ఈసారి కాషస్‌గా.

మరుక్షణం....

కెవ్వున పొలికేక!

అతను ఎడంప్రక్కగా దబ్బున ఏదో పడ్డ శబ్దం!

ముఖంమీద ఏదో జిగటగా తగలడంతో, చేయిపెట్టి తడుముకున్నాడు రాణా.

అతను వేళ్ళను చూసుకున్నప్పుడు, అవి రక్తంతో తడిసివున్నాయి.

ఏం జరిగిందో గ్రహించి గడగడా వణికాడు రాణా.

ఎవరో మేడమీంచి క్రిందికి దూకారు! శరీరం

కాంక్రీట్ రోడ్డుకు గుద్దుకుని. తల పగిలి, రక్తం తన ముక్కుమీద చిమ్మింది!!

రాణా అడుగుల వేగం హెచ్చింది.

తీవ్రంగా ఆలోచిస్తున్నాడు రాణా.

తను బైకుల్లా బ్రిడ్జిని చేరడానికి ఆలస్యమయ్యేకొద్దీ, తనకు యింట్లోంచి బైటకు వచ్చేవాళ్ళ ప్రమాదం ఎక్కువౌతుంది.

తను వేగంగా నడవాలి.

కార్లో ప్రయాణిస్తే?

ఈ దట్టమైన పొగమంచులో నడవడం ప్రమాదకరమే.

కాని, రిస్కు తీసుకోదగ్గ ప్రయోజనముంది. దూరాన్నించి, దగ్గరకు వస్తున్న ఓ పాట శబ్దం వినిపించింది రాణాకి.

ఆనందంగా పాడుతోంది ఎవరిదో పురుష కంఠం.

దగ్గరౌతున్న ఆకారాన్ని చూసాడు రాణా.

ఓ యువకుడు సైకిల్ మీద ప్రయాణిస్తూ తనవైపు వస్తున్నాడు.

హేండిల్ బార్ అటూ ఇటూ తిప్పుతూ, సాధ్యమైనంత నెమ్మదిగా తొక్కుకున్నాడు ఆ యువకుడు, తన పాటలో లీనమౌతూ.

ఆ యువకుడు రాణాని చూసి, పాట ఆపకుండా, అతనిచుట్టూ నడపసాగాడు సైకిల్.

గుండ్రంగా తిరుగుతూ,

రాణాకు దగ్గరగా,

అతన్నే చూస్తూ,

పాట పాడుతూ,

నవ్వుతూ—

రెండో రౌండ్ కొట్టి ఆ యువకుడు చేయి గాల్లో ఊపుతూ, గానాన్ని కొనసాగిస్తూ పొగమంచులో మాయ మయ్యాడు.

భయంకరమైన ఒంటరితనం ప్రవేశించింది రాణాలో మళ్ళీ.

రాణా గిరుక్కున వెనక్కి తిరిగాడు.

పరిగెడుతున్న శబ్దం వినిపించి—

అతను స్పష్టంగా చూసేలోగానే ఆ ఆకారం, రోడ్డు మీద టక టక శబ్దం చేసుకుంటూ వేగంగా ముందుకు దూసుకుపోయింది.

ఈ విధంగా నడవడంవల్ల ఉపయోగంలేదని గ్రహిం చాడు రాణా.

అతని గుండెలు అదురుతున్నాయి.

అడుగులు వేగంగా వెయ్యలేకపోతున్నాడు, ఎదురుగా ఎవడు ఢీకొంటాడోనని భయపడ్తూ.

ఈ విధంగా తాబేలు నడక నడిస్తే తను బైకుల్లా బ్రిడ్జి చేరుకునేలోగా యిళ్ళల్లోని పిచ్చివాళ్ళందరూ రోడ్డుమీదుంటారు!

ఓ కారు వెతికి పట్టుకోవాలి!

తాళంలేకుండా స్టార్ట్ చేయడం తనకు తెలుసు. మళ్ళీ ప్లాట్ ఫాం అంచుని గైడ్ గా చేసుకుని నడవసాగాడు రాణా.

ఎక్కడో తగలకపోదు ఓ వాహనం.

చెత్త పేరుకుపోయినందుకు, మున్సిపల్ కార్పొరేషన్ వాళ్ళని తిట్టుకుంటూ దుమ్ము చీపురుతో బైట పార బోస్తున్న ఓ స్త్రీని దాటివెళ్ళాడు రాణా.

(ఇంకా వుంది)

## "ముఖచిత్ర వాఖ్యాల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, **ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.**

**'హోమ్ డెలివరీ'** సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో **అత్యుత్తమమైన వ్యాఖ్యకు** రు. 25/- నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ

మీరు **'హోమ్ డెలివరీ'** సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 9/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి **'హోమ్ డెలివరీ'** సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టుతో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 108/-లు ముందుగా పంపవచ్చును. •



# క్రైమ్‌లో తమాషాలు

[ఈ శీర్షికలో ప్రచురింపబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును—ఎడిటర్]

## చిలుక జోస్యం!

"చిలుకజోస్యం చెబుతాను" అని కొందరు జ్యోతిష్కులు, అమాయకుల దగ్గర ఏదో చిలువలు పలువలు కల్పించి పావల నుండి పాతిక రూపాయల వరకు కాజేయటం అలవాటు.

అలాంటి వాడినొకడిని అమాయకుడైన పరంధామయ్య పిలిచాడు. తనకు చిలుక ఏం చెబుతుందోనని పావలా యిచ్చి "చిలుక జోస్యం" చెప్పమన్నాడు.

యధావిధిగా జ్యోతిష్కుడు జ్యోతిషం కార్డులను వరుసగా పేర్చి బోనుమూత తీశాడు—వెంటనే బయటికి వచ్చి ముక్కుతో కార్డును తీయాల్సిన చిలుక బయటికి రాకపోయేసరికి బోను వెనుక నుండి కూడా మెల్లగా తట్టాడు—ఊఁ హూఁ లాభం లేకపోయింది.

అప్పుడు పరంధామయ్యతో "అయ్యా మా చిలుక మీ జోతిష్యం గూర్చి ఏదో విశేషం చెప్పదలచుకున్నట్టుంది మీరు అర్ధరూపాయి ఇస్తేకాని చిలుక బయటికి వచ్చేట్టు లేదు," అన్నాడు.

ఇలా అదీ ఇదీ చెప్పినా, ధర 5/- లకు పెంచినా,

ఎంత ఆర్భాటంగా చిలకని బయటికి పిలిచినా, చిలుక ససేమిరా బయటికి రాలేదు.

ఇక లాభం లేదనుకొని వెనుకనుండి ఓ పుల్లతో చిలుకను గట్టిగా తోసేసరికి గత్యంతరం లేక చిలుక బయటికి రావడమే తడవుగా అక్కడ ప్రక్కన యెంత సేపునుంచో పొంచివున్న గండుపిల్లి అమాంతంగా చిలుకని నోట కరచుకొని బయటికి పరుగుతీసింది.

జ్యోతిష్కుడు, పరంధామయ్యగార్లు అవాక్కయి పోయారు.

—వేదాంతం జగన్నాథ్, హన్మకొండ.

## ముగ్గురు జూదరులు?

ఒక జడ్జి సదాచార పరాయణుడు. పౌరాణికులన్నా, బ్రాహ్మణులన్నా ప్రీతి.

ఒకరోజు గుడిలో జూదమాడినందుకు ముగ్గురిపై కేసు బనాయించి కోర్టులో నిలబెట్టారు పోలీసులు.

అందులో ఒకరు గుడి పూజారి. పంచ, అంగవస్త్రం, తీర్చిదిద్దిన నామాలతో కనుపించాడు.

రెండవతను పురాణాలు చెప్పే పండితుడు. కుండలాలు, రుద్రాక్షమాల, పట్టువస్త్రాలతో నిలబడ్డాడు.

మూడవతను జైలుపిట్ట.

మొదట ఇద్దర్ని ఎలాగన్నా వదిలేసి మూడవవాడిని మాత్రం శిక్షించాలనుకున్నారు జడ్జి. పూజారి బోనులో నిలబడగానే—

"ఏమండీ, మీరు పూజారులు. ప్రమాణంచేసి అబద్ధాలాడరు. మీ మాట నమ్ముతాను. భగవంతుని పై ప్రమాణం చేసి చెప్పండి. మీరు జూదం ఆడినారా?" అడిగారు.

క్లూ అందుకున్న పూజారి వెంటనే 'అబద్ధాలాడినందుకు క్షమించు భగవంతుడా' అని మనసులో ప్రార్థించి,

"నేను జూదమాడలేదండీ" అన్నాడు.

జడ్జి అతనిని వదిలేసాడు.

అలాగే పౌరాణికుణ్ని కూడ వదిలేసారు.

పాతకేడి బోనులోకి రాగానే కటువుగా "ఏరా! జూద మాడావు కదూ? చెప్పు" అడిగారు జడ్జీగారు.

జూదగాడు బాగా ఆలోచించి ఎదురు ప్రశ్నవేసాడు "ఎవరితో ఆడాను జూదం?" అని.

—దామెర్ల కృష్ణమూర్తి, నెల్లూరు.

## ఉద్యోగం దొరికింది!

చిరుగులుపడ్డ పంచ లాల్చీ ధరించిన నలభై ఏళ్ళ వ్యక్తి ఒకతను, నగరంలో పేరుపొందిన పెద్ద కాంట్రాక్టర్‌ని కలిసాడు.

"చూడండీ, నేనొక మంచి ఏయిర్‌కండిషన్డు సినిమా హాలు నిర్మించాలనుకుంటున్నాను. దానికి ఎంత ఖర్చవుతుందో చెప్పగలరా?"

కాంట్రాక్టర్ ఆ వ్యక్తిని పరీక్షగా చూసి, "పాపం!... మిమ్మల్ని చూస్తుంటే పిచ్చాసుపత్రికి ఫోన్ చేయాలనిపిస్తూ వుంది నాకు" వ్యంగ్యంగా అన్నాడు కాంట్రాక్టర్.

"తొందర పడకండీ! నేను వేసుకున్న గుడ్డల్నిచూసి మీరలా భావించినట్టుంది. మా అబ్బాయి రెండ్రోజుల క్రితమే సబ్ ఇన్‌స్పెక్టర్‌గా సెలెక్టయ్యాడు. ఇకనయినా చెబుతారా ఎంత ఖర్చవుతుందో?" అన్నాడు ఆ వ్యక్తి.

—యం. వీరాస్వామి, మల్కాజిగిరి.

